5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరి సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను 15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారత దేశంలో ప్రప్రథమంగా తయారు చేస్తూ, దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొంది అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే, వి. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి. (వి. పి. పి. చార్జీలు అదనం)




# MERI GOLD COVERING WORKS

P.O. BOX 1405, 14, RANGANATHAN STREET
T. NAGAR MADRAS-600 017 INDIA





ముఖచిత్రం : యమునాకళ్యాణి

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

దగ్గరకొచ్చి గమనించండి

# సూపర్ రిన్
# చిమ్ముతూన్న మరింత తెల్లదనం
## దీనికి సరిపడే డిటర్జంట్ బిళ్ల మరొకటి లేదు.

సూపర్ రిన్ తెల్లదనం
మిరుమిట్లు గొల్పుతుంది :
దగ్గరగా వచ్చి చూడండిక.
ఆకర్షణీయమైన, కొత్త ర్యాపర్,
మరి దాంతో బాటే తాజాదనం
నిండే సరికొత్త సువాసన!




హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# పిల్లదాని వంటి తెల్లదనం పరంపరాగతమా కేవలం—చెప్పవే ఓ మనసా!

మీ కళ్ల రంగు, ముఖ ఆకారం, మీ ఎత్తు, తెల్లని శరీర చాయ—ఇవన్నీ సాధారణంగా వంశపారంపర్యంగా వస్తాయి. మీకు తెల్లని వంటి చాయ వచ్చినా, అది అలాగే నిలిచి వుండకపోవచ్చు. దానికి కారణం, ఏళ్లు గడుస్తూన్న కొద్దీ మీరు నల్లబడుతూ ఉండటమే.



LINTAS FALOV 31 1822 TL

నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది.
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది

ఎలాగో చూడండి:


మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు ముక్కల్లో దుర్వాసన... దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి


కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు ముక్కలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.


ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుండి రక్షణ. ఆరోగ్యమైన గట్టి పళ్లు

దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

## జూలై నెల భావపరిచయ పోటీ

## రు. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

"చిన్నారి చిట్టికి వైద్యం
చంటి డాక్టరి బాల్యం"

—ఎల్.పి. చంద్ర
ధర్మవరం

# 1984
# చక్రపాణి అవార్డులు

ఇది 'యువ' రజతోత్సవ సంవత్సరం.

ఇరవై నాలుగున్నర సంవత్సరాలనుంచీ సాహిత్య కాలక్షేపంలో ఒక భాగంగా 'యువ'ను అవిచ్ఛిన్నంగా చదువుతున్నవారు కొన్ని లక్షలమంది పాఠకులున్నారు. వారి సాహిత్య అభిరుచుల్ని, ఆసక్తుల్ని, అభిలాషల్ని పోషిస్తూ 'యువ' నెలనెలా అభివృద్ధిపొందుతూ ఈ తరహా మాసపత్రికలకు శిరోమణిగా నిల్చిందని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. అందుచేత 1984 సంవత్సరపు చక్రపాణి అవార్డులకు విశేషమైన ప్రాధాన్యముంది. ఈ ప్రాధాన్యతను గుర్తించి సాహిత్యంలో చిరస్థాయిగా నిల్చే శ్రేష్ఠమైన రచనలు పంపించి, మా కృషికి ఇతోధికంగా దోహదం కల్పించమని రచయితల్ని, రచయిత్రుల్ని కోరుతున్నాం.

## అవార్డుల వివరాలు

**నవల :**

| | | |
|---|---|---|
| మొదటి అవార్డు | — | రూ. 4,000 |
| రెండో అవార్డు | — | రూ. 2,500 |
| మూడో అవార్డు | — | రూ. 1,500 |

**కథానిక :**

| | | |
|---|---|---|
| మొదటి అవార్డు | — | రూ. 1,000 |
| రెండో అవార్డు | — | రూ. 750 |
| మూడో అవార్డు | — | రూ. 500 |

## నియమ, నిబంధనలు

1. రచనలు తెలుగువారి సమకాలీన సామాజిక జీవనాన్ని చిత్రించి, పాఠకుల అభిరుచులకు అద్దంపట్టేవిగా ఉండాలి.

2. నవల అరఠావు సైజులో 70-80 పేజీల మధ్య ఉండాలి.

3. కథానిక అరఠావు సైజులో 12 పేజీలకు మించకుండా ఉండాలి.

4. అనువాదాలూ, అనుసరణలూ పనికిరావు. రచన స్వంతమేననీ, దేనికీ అనువాదం, అనుసరణ, ఆధారం కాదనీ హామీపత్రాన్ని ప్రతి రచనకూ జతపర్చాలి.

5. అవార్డులకు పంపే రచనల కవర్లపై '1984 చక్రపాణి అవార్డుల కోసం' అని స్పష్టంగా వ్రాయాలి.

6. అవార్డులు పొందని నవలలు, కథల్ని కూడా 'యువ'లో సాధారణ ప్రచురణకు స్వీకరించే హక్కు మాకున్నది.

7. అవార్డులు లభించని రచనల్ని తిరిగి పొందగోరేవారు తగినన్ని తపాళా బిళ్ళలు అంటించిన కవర్లను విడిగా తప్పకుండా జతపర్చాలి. లేకపోతే వాటిని తిప్పిపంపడం సాధ్యంకాదు.

8. అవార్డులను ఇచ్చే విషయంలో 'యువ' సంపాదకునిదే తుది నిర్ణయం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

అవార్డుల కోసం నవలలు, కథలు మాకు చేరవల్సిన ఆఖరు తేదీ 14, ఆగస్టు 1984.

సంపాదకుడు, యువ

# యువ

## దీపావళి రజతోత్సవ సంచిక

పాతికేళ్ళ క్రితం ఉత్తమ కాల్పనిక సాహిత్యాన్ని తెలుగు పాఠక లోకానికి అందించాలనే సదుద్దేశంతో ప్రారంభమైన 'యువ' వచ్చే దీపావళికి అత్యంత ప్రత్యేకమైన, ప్రతిష్ఠాకరమైన 'దీపావళి రజతోత్సవ సంచిక'ను మీ అభిరుచులకు దర్పణంలా వెలువడుతోందని ప్రకటించడానికి సంతోషిస్తున్నాం.

తెలుగు కాల్పనిక సాహితీ జగత్తులో రెండున్నర దశాబ్దాల పరిణామ వికాసానికి ఈ సంచిక ప్రయోజనపూరితమైన ప్రతీక.

అప్పటి రచనలు వేరు; ఇప్పటి రచనలు వేరు.

అప్పటి పాఠకులు వేరు; ఇప్పటి పాఠకులు వేరు.

కాల్పనిక సాహిత్యంలో, పాఠకుల అభిరుచుల్లో తరతరాల అంతరాలకు ఈ ప్రత్యేకాతి ప్రత్యేకమైన సంచిక మేలైన వారధిగా నిలుస్తుంది.

రెండున్నర దశాబ్దాల 'యువ'కు ఈ సంచిక ప్రతిబింబం:

రెండు నవలలు....

ఎన్నో కథలు....

మరెన్నెన్నో కార్టూన్లు....

త్రివర్ణ చిత్రాలు....

తెలుగువారి ప్రతి ఇంట్లోనూ తప్పకుండా ఉండాల్సిన ప్రత్యేక సంచిక.

ఈ దీపావళికి ముందుగా వెలువడుతుంది.

మీ కొనుగోలు వ్యయానికి పదిరెట్లు సంతృప్తిని అందించే ప్రత్యేక సంచిక.

ఆ సంచిక కోసం ఇప్పట్నుంచే ఎదురుచూసే బదులు– వెంటనే రిజర్వు చేసుకోండి.

యువ
సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 50 | అగష్టు 1984 | సంచిక 2

'వినియోగదారు చక్రవర్తిలాంటి వాడు' అని పూర్వం అర్థశాస్త్రజ్ఞులు అనేవారు. కాని ఈ సుభాషితం ఈ కాలానికి వర్తించదు. రెండో ప్రపంచయుద్ధం తర్వాత దేశదేశాల ఆర్థిక వ్యవస్థల్లో గణనీయమైన మార్పులు వచ్చాయి. ప్రతి దేశమూ ఆర్థికంగా, పారిశ్రామికంగా, వ్యవసాయికంగా ముందంజవేయటానికి శతధా ప్రయత్నించాయి. సాంకేతిక, శాస్త్రీయరంగాల్లో అనూహ్యమైన మార్పులు వచ్చి వస్తూత్పత్తిలో, మార్కెటింగ్‌లో గొంతుకోత పోటీ వచ్చింది. ఈ పరిణామ వికాసం వినియోగదారుకు అనుకూలంగానే ఉంది. అయితే ధరలు నిర్దాణంగా లేవు. ధరల పెరుగుదల ఆధునిక ప్రపంచం వైఖరిగా మారిపోయింది. ఏ దేశమూ ధరలను అదుపులో పెట్టలేని దుస్థితికి దిగజారిందని చెప్పవచ్చు. ధరల పెరుగుదల ధోరణి ఆర్థికాభివృద్ధి చెందిన దేశాల్లోనూ, పారిశ్రామికీకరణ హెచ్చుగా జరిగిన దేశాల్లోనూ, ఆర్థికాభివృద్ధి చెందుతూన్న దేశాల్లోనూ, ఆర్థికంగా వెనుకబడిన దేశాల్లోనూ కొద్దోగొప్పో తేడాలతో దాదాపు అన్ని దేశాల్లోనూ ఇప్పుడు ప్రస్ఫుటంగా కనబడుతూన్నది. మనదేశంలోని ధరలు ప్రవృత్తి సంగతి ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. ధరలు ఆకాశానికి నిచ్చెనవేస్తూన్న ఈ రోజుల్లో వినియోగదారుడ్ని చక్రవర్తిగా అభివర్ణించడం హాస్యాస్పదంగా ఉంటుంది. ఆనాటి అర్థశాస్త్రవేత్తలు ఈనాటి పరిణామాన్ని వూహించి వుండకపోవచ్చు.

ఇది 'యువ' రజతోత్సవ సంవత్సరం

ఈనాడు అమ్మకందారు చక్రవర్తి; వినియోగదారు నిస్సహాయుడైన పౌరుడు. ఫలానా వస్తువు ధర ఫలానా అని అమ్మకందారు శాసిస్తే, ఆ మేరకు వినియోగదారు ఇష్టమున్నా లేకపోయినా కొనితీరవల్సిందే అమ్మేవాడికి కొనేవాడు లోకువైపోయిన ఈ మార్కెటింగ్ ఆర్థికవ్యవస్థలో కొనుగోలుదారు కష్టాలు కొనుగోలుదారుకే ఎరుక. ప్రజాస్వామిక ప్రభుత్వాల్లో కూడా కొనుగోలుదారుకు రక్షణ లేకుండాపోయింది. ప్రజల యొక్క కొన్ని ప్రాథమిక అవసరాలను ప్రభుత్వం సరసమైన ధరలకు తీర్చాలి. తిండి, బట్ట, గృహవసతి, రవాణా, విద్యుత్ సౌకర్యాలు మొదలైనవాటికే కాకుండా, విద్య, వైద్యంలాంటి అవస్థాపన సదుపాయాల్ని సమకూర్చడంలో ప్రజాస్వామిక ప్రభుత్వాలు చౌకగా ప్రజలకు సేవల్ని అందించాలి. కొన్ని వస్తువుల ఉత్పత్తిలో, సేవల్ని సమకూర్చడంలో ప్రభుత్వం గుత్తాధిపత్యాన్ని చెలాయిస్తూనే చీటికీమాటికీ ధరల్ని పెంచుతూన్నది. ఇటీవల ఉక్కు రేటు పెరిగింది. అంతకుముందు రైల్వే, బస్సు ఛార్జీలు పెరిగాయి. నిత్యావసర వస్తువుల ధరలు నియతికాలికంగానే పెరుగుతున్నాయి. గృహనిర్మాణ వస్తువుల రేట్లు ఈ మధ్య ఎంతగా పెరిగాయో ఇళ్లు కట్టేవాళ్లకే తెలుసు. సబ్బులు, టూత్‌పేస్టులు, కిరాణా వస్తువులు, నూలు దుస్తులు, నూనెలు, ఎలక్ట్రికల్ వస్తువులు, పుస్తకాలు, నోట్‌పుస్తకాలు — ఒకటేమిటి ధర పెరగని వస్తువు ఏదైనా వుంటే, ఆ వస్తువుకు వినియోగదారు పట్టాభిషేకం చేయవచ్చు. ఈ ధరల పెరుగుదల ధోరణి పరిణామక్రమంలో వినియోగదార్ల పాత్ర ఏమిటి? ప్రభుత్వం పాత్ర ఏమిటి?

ధరలను తగ్గించడానికి, లేదా అరికట్టడానికి ప్రభుత్వం నిరంతరం కృషి చేస్తూన్నట్టు మన ప్రణాళికలు ప్రకటిస్తున్నాయి: మన ఆర్థిక మంత్రులు ఘోషిస్తున్నారు; చట్టబద్ధమైన చర్యలు తీసుకోవడం జరుగుతున్నాయి వస్తువులకు ధరలు నిర్ణయిస్తున్నారు; చట్టాలు చేస్తున్నారు: నిఘాసిబ్బందిని నియమిస్తున్నారు. ధరల తగ్గింపుకు దీర్ఘకాలిక చర్యలకు పథకాలు వేస్తున్నారు. కాని ఫలితమేమిటి? ధరలు తగ్గకపోగా, పెరుగుతున్నాయి.

దేశ ఆర్థిక వ్యవస్థలో తమ పాత్ర ఏమిటో వినియోగదారు ఏమాత్రం తెల్సుకోవడం లేదు. తాము వాడే సబ్బు ఆరుపైసలు పెరిగినా, మాట్లాడకుండా కొనుక్కొని పోతున్నారు: పాలధర లీటరుకు అయిదుపైసలు పెరిగినా ఇల్లాలు ఏం మాట్లాడటంలేదు; సినిమా టిక్కెట్టు ధర పావలా పెరిగినా ఆ మోజులో ఖాతరుచేయడంలేదు; ఇంటి అద్దెను యాభై రూపాయలు పెంచినా అద్దెకుండే

వ్యక్తి పోనీలే అని నిర్లిప్తంగా వూరుకుంటున్నాడు: కారు ధర పదివేలరూపాయలు పెరిగినా ఆకస్మిక ధనవంతులు 'ధరలు పెరగటం సహజమేగా' అనుకొంటూన్నారు. ధరలు ఎందుకు పెరుగుతున్నాయి? ఎవరు పెంచుతున్నారు? ప్రభుత్వం ఏం చేస్తోంది? మొదలైన ప్రశ్నలకు సమాధానాలు రాబట్టడంలో వినియోగదార్లు ఆసక్తి కనబర్చడంలేదు. తమ కొనుగోలుశక్తిని ధరల పెరుగుదల భూతం రోజురోజుకీ హరింపజేస్తున్నా వినియోగదార్లు పట్టించుకోవడంలేదు. ఎందుకు?

మన దేశంలో వినియోగదార్ల చైతన్యం బొత్తిగా మృగ్యంగా కనబడుతోంది. అమెరికా, ఇంగ్లాండ్, కెనడా, జపాన్ మొదలైన దేశాల్లో వినియోగదార్ల సంఘాలున్నాయి. వస్తువుల నాణ్యతను పోషించడంలో, ధరల విచక్షణ విధానం విచ్చలవిడిగా పెరిగిపోకుండా వుండటానికి, వస్తువు ధరలు అన్నిచోట్లా ఒకే రకంగా ఉండేందుకూ, వినియోగదార్ల హక్కుల్ని, బాధ్యతల్ని తెలియచేయడానికి ఆ సంఘాలు ఇతోధికంగా కృషిచేస్తున్నాయి. అట్లాంటి సంఘాలు మనదేశంలో విరివిగా ఏర్పడాల్సిన అవశ్యకత ఎంతైనా వుంది. ఆ సంఘాలు క్రియాశీలకంగా పనిచేస్తే వినియోగదార్ల వస్తువుల్లో కల్తీలు తగ్గిపోతాయి; ఒకే వస్తువుకు అంగడికో ధర, ఊరికో ధర ఉండవు: వస్తువుల ధరలు అన్యాయంగా అక్రమంగా పెరగవు. వినియోగదార్ల సంఘాల ఏర్పాటుకూ, వాటి విజయానికీ తోడ్పడాల్సిన అవశ్యకత ప్రభుత్వంపైన కూడా ఎంతో ఉంది.

———

## మీ చర్మం రంగును నిర్ణయించేది ఏమిటి?

మీ చర్మం లోపల మెలానిన్ అనే నల్లని రంగు పదార్థం వుంది. ఇది చర్మంలో ఎంత ఎక్కువగా వ్యాపిస్తే మనుషులు అంత నల్లగా కనబడతారు. మీ చర్మం రంగు మీద ప్రభావం చూపే బయటి కారణాలు కూడా ఉన్నాయి. ఎండలో మీరు బయటకి వెళ్లినప్పుడు సూర్యరస్మిలోని అల్ట్రా వయొలెట్ కిరణాలు మిమ్మల్ని మరింత నల్లబరుస్తాయి.

## వంటి చాయను పెంచడానికి సరియైన పద్ధతి ఏదైనా ఉందా?

ఉంది. మొట్టమొదటిసారిగా సాధించిన ఓ వైజ్ఞానిక విజయం ఫెయిర్ అండ్ లవ్‌లీ....నల్ల చర్మాన్ని తెల్లపరిచే క్రీమ్. ఇది మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టి తిరిగి ఎర్రగా రంగు తేలేలా చేస్తుంది.

## ఫెయిర్ అండ్ లవ్‌లీ ఎలా పనిచేస్తుంది?

లోపలా, బయటా 2 విధాలుగా.

చర్మం లోపల: ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చర్మం అడుగున మృదువుగా, సురక్షితంగా పనిచేసి, నల్లబడుతున్న చర్మం తిరిగి రంగు తేలేలాగ చేస్తుంది.

చర్మం బయట: ఫెయిర్ అండ్ లవ్‌లీలో గల 'సూర్యరస్మిని వడబోసే' ప్రత్యేక పదార్థాలు. అల్ట్రా వయొలెట్ కిరణాలు మీ చర్మాన్ని నల్లబరచకుండా అడ్డగిస్తాయి. అయినప్పటికీ, సూర్యరస్మిలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు.

## రంగు తేలడానికి కేవలం 6 వారాలు!

ఫెయిర్ అండ్ లవ్‌లీని ఆరు వారాలపాటు క్రమం తప్పకుండా రోజుకు రెండుసార్లు రాసుకోండి. మొదట చర్మంమీద కాస్త జిమజిమలాడవచ్చు. ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేస్తున్నదనడానికి అది నిదర్శనం. ఆరు వారాల్లో ఖచ్చితమైన తేడా మీకు కన్పిస్తుంది, ఇతర్లకీ కన్పిస్తుంది. క్రమం తప్పకుండా వాడుతూ ఉండండి, ఫెయిర్ అండ్ లవ్‌లీ శరీర చాయతో అలాగే వుంటారు.

ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి మీరు మరిన్ని వివరాలు తెలుసుకోవాలనుకుంటే ఈ చిరునామాకు వ్రాయండి:

FAIR & LOVELY ADVISER
P. O. BOX 758, BOMBAY 400 021.

**ఫెయిర్ అండ్ లవ్‌లీ**

నల్ల చర్మాన్ని ఎర్రపరిచే క్రీమ్



ఇది సహజంగా, మృదువుగా మీ వంటి చాయను పెంపొందిస్తుంది.

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

సాయంత్రం ఆఫీసునుంచి నేరుగా రూమ్‌కు వచ్చాడు మల్లిక్. ఆరు నిముషాల తక్కువ ఆరుగంటలైంది. ఆఫీసునుంచి అతను నేరుగా రూమ్‌కు రావడం బహు అరుదు. ఫ్రెండ్స్‌తో కలిసి సినిమాకెళ్ళడమో, షికారుకెళ్ళడమో, మందు పార్టీలో మార్పోవడమో, చీట్లపేక ఆడటమో- ఏదో ఒకటి చేయడం నెలలో ఇరవైతొమ్మిది రోజులు అలవాటు. ఏంతోచక, కలియుగ బుద్ధిమంతునిలా ఎప్పుడైనా సూటిగా రూమ్‌కెళ్ళితే ఏదో ఒక సంఘటన జరక్కుండా పోదు. అలాగని అనుకొంటూనే మల్లిక్ ఒంటిస్తంభం రూమ్ తలుపు తెరిచాడు.

ఎదురుగ్గా మడిచిన ఓ తెల్లకాగితం అతని దృష్టిలో పడింది. అందులో-

'సాయంత్రం ఆరున్నరకు టాంక్‌బండ్ మీద కల్సుకోండి. వివరాలు ముఖాముఖీ.

మీ

అంబిక.

మల్లిక్ మనస్సు ప్రమోదంతో ఉత్తుంగతరంగమైంది. ఇక షర్ట్ డ్రస్సు మీద ఈగ వాలనీయకుండా ఆపళంగా మొహం కడుక్కొని, ఆ మొహంమీద యింత టాల్కంపౌడరు వేసుకొని, ఆ పైన 'యు అండ్ మి' స్ప్రే చల్లుకొని, అయిదు నిముషాల్లో టిప్‌టాప్‌గా తయారై- అటో ఎక్కాడు రూమ్ తలుపులు తాళం వేసిందీ లేనిదీ జ్ఞాపకంలేకుండా.

అంబిక ఆర్.టి.సీలో స్టెనో. అద్భుతమైన అందాల రాశి.

మూడేళ్ళనుంచీ ఆమెను మహా యిదిగా ప్రేమిస్తున్నాడు.

ఆమె పెళ్ళికి ఒప్పుకొంటే దారం తెగిన గాలిపటంలాంటి తన బ్రతుక్కి స్థిరమైన, శాశ్వతమైన ఆసరా దొరుకుతుందనీ, 'గృహమే కదా స్వర్గసీమ' అన్న ఆశయానికి ఆచరణ సాధ్యత లభిస్తుందనీ ఆశిస్తూ వచ్చాడు.

ఆమె కిష్టమే. తనంత గాఢంగా కాకపోయినా మొత్తంమీద తనని ఆమె ప్రేమిస్తోంది. తమ పెళ్ళికి రిటైర్ అయిన డిప్యూటీ తాశీల్దారు ఆమె తండ్రి

అడ్డుగోడగా నిలుస్తూ వచ్చారు! ఇప్పటికైనా గ్రీన్ సిగ్నల్ ఇచ్చారో, లేదో! కులం ఒక్కటే. తనకి పన్నెండొందల రూపాయల వుద్యోగముంది. ఇద్దరం పెళ్లి చేసుకొంటే సంసారం నిమ్మకాయ రసంలో తేనె కలిపినట్టు పసందుగా నడిచిపోతుంది....

ఆరూ ఇరవైకి మల్లిక్ టాంక్‌బండ్ మీద ఆటో దిగాడు. ఆటోవాడికి డబ్బులిస్తూ హుసేన్‌సాగర్ పేవ్‌మెంట్ మీద కలియచూశాడు— అంబిక కోసం. ఆమె ఇంకా రాలేదు. పదినిముషాలపాటు టాంక్‌బండ్ మీద లైట్లనీ, తిరిగే జనాన్నీ, వాహనాల్నీ, దూరంగా 'ల్యాండ్' అయ్యే విమానాల్నీ చూస్తూ కాలక్షేపం చేశాడు.

సరిగ్గా ఆరున్నరకు అంబిక వచ్చింది. ఆమె మొహంలో వెన్నెల్ని చూసి, పెళ్లికి 'గ్రీన్ సిగ్నల్' అయినట్టు సంతోషం సగం బలంగా పన్నెండు కిలోలు ఉబ్బిపోయాడు మల్లిక్.

కలకత్తా కాటన్‌చీరలో అంబిక అపరూప లావణ్యరాశిగా కనబడింది. ముసిముసి నవ్వులతో సిగ్గుల్ని విరజిమ్ముతూ, "ఎంతసేపైంది వొచ్చి" అంది.

"నా కళ్లు చూస్తే తెలీయడంలేదూ!— ఎంతసేపట్నుంచి నిరీక్షిస్తున్నానో!" అన్నాడు మల్లిక్ కొంటెగా.

"ఇకమీదట ఈ నిరీక్షణలు వుండవులెండి!"

"అంటే—?"

"మా ఫాదర్ పెళ్లికి ఒప్పుకున్నాడు."

అమాంతంగా ఆమెను కౌగలించుకొని అర్ధమీటరు పైకెత్తి, ముద్దులతో ముంచెత్తాలన్నంత ఉద్వేగపూరితమైన సంతోషం కలిగింది మల్లిక్‌కు. కాని అది పబ్లిక్‌ప్లేస్ అయిపోయింది. ఆ సంబరానికి కళ్లేలు బిగించి, దగ్గరున్న రాతి సోఫామీద కూర్చోబెట్టి, అరగంటసేపు మహదానందంతో ఆ కబురూ ఈ కబురూ చెప్పాడు. తమ వైవాహిక జీవితంలోని మాధుర్యాన్ని రంగుల బొమ్మ వేసినట్టు చూపెట్టాడు.

చీకటి చిక్కబడింది.

విద్యుత్‌దీపాలు పౌరుషాన్ని పెంచుకున్నాయి.

"పొద్దుపోతోంది. వస్తాను" అంది అంబిక చివుక్కున లేస్తూ.

"అప్పుడేనా! ఓ ముద్దిచ్చి...." అన్నాడు మల్లిక్ చిలిపిగా.

"అమ్మో! ఇది కొలోంబో అనుకున్నారా, క్యాలిఫోర్నియా అనుకున్నారా! నలుగురూ చూస్తే నగ్నంగా నవ్విపోరూ!...." అంటూ బస్‌స్టాప్‌కు వెళ్లింది అంబిక కళ్లతో 'టాటా' చెబుతూ.

మల్లిక్ మనస్సు తెల్లమబ్బుల మధ్య ఎయిర్ బస్ పోతోన్నంత కులాసాతో వూగిసలాడింది.

సిటీబస్సు ఎక్కిపోయింది అంబిక.

ఆటో ఎక్కాడు మల్లిక్. ప్యాంట్ జేబులో చేయిపెట్టి చూసుకున్నాడు— పదహేను రూపాయల ముప్పావలా వుంది. తాను గాఢాతిగాఢంగా ప్రేమిస్తోన్న అంబికతో పెళ్లివార్త విన్న శుభసందర్భంలో ఓ చుక్క వేసుకోవాలన్న కోర్కె అతనిలో కోడెత్రాచులా బుసపెట్టింది. వెంటనే హిమాయత్‌నగర్‌లో ఓ చిన్న బార్ ముందు ఆటోను ఆపాడు. ఆ బార్‌లోకి దూరాడు, ఆటోకు రెండు రూపాయలిచ్చి.

చవుక బారు బ్రాందీ ఓ పెగ్‌కు ఆర్డరిచ్చాడు. సోడా అక్కర్లేదన్నాడు. ఓ ప్లేట్ చిప్స్ పట్టుకురమన్నాడు. ఉగాది పండక్కు ముందు తయారుచేసినట్లున్నాయి ఆ చిప్స్, దుర్వాసన. వెలిసిపోయిన రంగు. నోట్లో పెట్టుకోగానే తెమలి నట్లయింది. బ్రాందీ కూడా బావుంతలేదు. కిర్సనాయిలో, గుడుంబాయో, కాపుసారాయో కల్తీ కల్పినట్లుంది. అయినా అంబికతో పెళ్లి కాబోతోన్న ఆనందంతో, స్కాచ్ త్రాగుతూన్న వూహతో రెండున్నర పెగ్గులు తాగి పధ్నాలుగు రూపాయల పావలా చెల్లించి రోడ్డుమీద పడ్డాడు మల్లిక్.

రాత్రి ఎనిమిదిన్నర దాటింది.

అరకిలోమీటరు దూరం నడుచుకుంటూ రూమ్‌కు చేరాడు. రూమ్ తలుపులు తెరిచే వున్నాయి. ఆ తలుపుల్ని అతను సాయంత్రంపూట మూయటం మర్చిపోయాడు.

లోపలికెళ్లి మంచంమీద అడ్డంగా పడ్డాడు మల్లిక్.

గంట గడిచింది.

నిద్రరాదు. కడుపులో తుప్పుకత్తులతో ఏదో కెలుకుతున్నట్టు ఫీలింగ్.

రెండుసార్లు వాంతులు చేసుకున్నాడు— పెద్దగా శబ్దంచేస్తూ.

వొంటినిండా చెమట. తలబ్రద్దలయ్యే నొప్పి.

ఇంటి యజమాని కిందనుంచి పైకి వచ్చాడు.

మల్లిక్ పరిస్థితి చూడగా ఆయనకు భయమేసింది. వెంటనే రిక్షా పిలిపించి దగ్గరున్న నర్సింగ్‌హోమ్‌లో చేర్పించాడు మల్లిక్‌ను.

బ్రాందీలో కల్తీవల్ల ఆ ప్రమాదం ఏర్పడిందని డాక్టరు చెప్పాడు.

మరునాడు సాయంత్రానిగ్గానీ మల్లిక్ నర్సింగ్‌హోమ్‌నుంచి బయట పడలేదు. అతని ఇంటి యజమానే నూటముప్పైరూపాయల బిల్లు చెల్లించి, మల్లిక్‌ను ఇంటికి తీసుకొచ్చాడు.

*మనసులు కలిస్తే ప్రమోదం; కాని మందులో కల్తీ కలిస్తే ప్రమాదం.*

తుమ్మల బాబ్జీ



# అరుణరాగంలో అపశృతులు

ప్రభుత్వంవారి ధర్మాసుపత్రి గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

అర్జంటు కేసులేమీ లేకపోవడంతో ఒక అరగంట కునుకుతియ్యాలని అప్పుడే నిద్రలోకి జారుకుంటున్న అరుణ ఉలిక్కిపడి కుర్చీలోంచి లేచి చేతి గడియారం చూసుకుంది.

సమయం పదిగంటలు కావస్తుంది.

'ప్రభుత్వ యంత్రాంగమే తప్పుడు నడక నడుస్తుంది. ప్రభుత్వ గడియారం తప్పుడు సమయం చూపడంలో ఆశ్చర్యం ఏముంది' అనుకుంటూ, తనలో తానే నవ్వుకుని మళ్ళీ నిద్రపోడానికి ప్రయత్నించింది.

నిద్ర రావడంలేదు.

నిన్న రాత్రి ఇదే సమయంలో జరిగిన సంఘటన కళ్ళముందు మెదిలింది.

* * *

"అరుణ."

వార్డంతా చూసుకుని స్టేఫ్‌రూమ్‌లోకి వెడుతున్న అరుణ ఆ పిలుపు విని వెనక్కి తిరిగి చూసింది.

నైట్‌డ్యూటీలో వున్న డాక్టర్ శ్రీహరి చిరునవ్వుతో నిలబడివున్నాడు.

"పిలిచారా!"

"నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి. ఒకసారి అలా గార్డెన్‌లోకి వస్తావా."

తనతో ఒంటరిగా శ్రీహరి మాట్లాడే ముఖ్యవిషయం ఏమిటో అర్థం కాలేదు.

"వస్తావా" అంటూనే తన సమాధానం వినకుండా వెనక్కి తిరిగాడు శ్రీహరి.

వెళ్ళకపోతే బాగోదని అతన్ని అనుసరించింది.

వెన్నెట్లో నిర్మానుష్యంగా వున్న తోట పెళ్ళికాని ఆడపిల్ల జీవితంలా వెలవెలబోతుంది.

తోటలో బోగన్‌విల్లి చెట్ల నీడన ఒక సిమెంటు బెంచీలో కూర్చున్నాడు శ్రీహరి.

తనను ఎందుకు పిలిచాడో తెలియక ఏంచెయ్యాలో తోచక శ్రీహరికి కాస్త దూరంలో నిలబడిపోయింది అరుణ.

"ఇలా కూర్చో అరుణ" అంటూ తను కూర్చున్న బెంచీలో చోటు చూపించాడు.

సంశయిస్తూనే ఆ సిమెంటుబెంచీలో కాస్త దూరంలో ఒదిగి కూర్చొంది.

శ్రీహరి సిగరెట్ ముట్టించుకుని ఆకాశంలోకి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.

అరుణకి ఏంచెయ్యాలో పాలుపోవడంలేదు.

అక్కడి వాతావరణం చాలా ఇబ్బందిగా వుంది.

కొన్ని క్షణాల తర్వాత,

"ఏదో ముఖ్యవిషయం మాట్లాడాలన్నారు. ఏమిటది" అంది.

గుండెల్లోకి పీల్చిన పొగను బయటకు వదులుతూ "నువ్వింకా పెళ్ళి చేసుకోకపోవడానికి కారణం ఏమిటి" అన్నాడు.

ఎదురుచూడని ప్రశ్న!

వెంటనే ఏం సమాధానం చెప్పాలో పాలుపోలేదు.

అరుణ ఏం మాట్లాడకపోవడంతో "చెప్పకూడని విషయమా" అన్నాడు.

అతను ఏ ఉద్దేశంతో ఈ ప్రశ్న వేసాడో అర్థంకాలేదు అరుణకి.

"ఈ రోజుల్లో ఆడపిల్ల పెళ్ళికాకుండా వుండటానికి వుండే కారణాలు ఏమిటో మీకు తెలియదా" అంది.

"కట్నం సమస్యా?"

"అదికూడా కొంతవరకు."

"ఇంక నువ్వేం చెప్పనక్కర్లేదు. నాకు అర్థమయింది. చదువుకుని వుద్యోగంచేసే, అందులోను నర్సు వుద్యోగం చేసే నీలాంటి అందమైన ఆడ పిల్లకి భర్త దొరకడం ఈ రోజుల్లో కష్టమైన పనే."

"ఈ విషయం మాట్లాడటానికేనా నన్ను పిలిపించింది" అంటూ అక్కడ్నుంచి లేవడానికి సిద్ధపడింది అరుణ.

"ప్లీజ్! నామీద ఏమాత్రం గౌరవమున్నా కాసేపు అలా కూర్చో" అంటూ శ్రీహరి అభ్యర్థించడంతో అక్కడ కూర్చోక తప్పిందికాదు.

"అరుణ! నిన్ను నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను."

"మీరేం మాట్లాడుతున్నారో మీ కర్థమవుతుందా?"

"ఇందులో తప్పేముంది?"

"మీరు వివాహితులన్నమాట మర్చిపోకండి."

"ఏం! పెళ్ళయిన మగాడు ప్రేమకి అనర్హుడా?"

"మీ భార్యకూడా మిమ్మల్ని ఇదే ప్రశ్న వేస్తే?"

"అరుణా!"

శ్రీహరి గొంతు కరుగ్గా మారిపోయింది.

"ఏం మగాళ్ళండి! తల్లి, చెల్లి, పెళ్ళాం తప్పితే మిగిలిన ఆడవాళ్ళం దరూ మీ దృష్టిలో చులకనే."

"నన్ను మరోలా అర్థంచేసుకోకు అరుణా!"

"సరే!" అంటూ అరుణ అక్కడ్నుంచి వెళ్ళబోతుంటే "ప్లీజ్, ఒక్క క్షణం ఆగు" అంటూ చెయ్యి పట్టుకున్నాడు శ్రీహరి.

చెయ్యి విడిలించుకుని "ఏమిటో తొందరగా చెప్పండి. అవతల నాకు చాలా పనివుంది" అంది.

"జీవితాంతం నీకు ఏ లోటూ రాకుండా పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను."

"అయితే నన్ను మళ్ళీ పెళ్ళిచేసుకుంటానంటారా?"

"ఇంతకుముందు నాకు పెళ్ళి కాకుండా వుండివుంటే తప్పకుండా చేసుకునే వాడ్నే."

"అంటే మీ ఉద్దేశం"

"మోటుగా చెబుతున్నందుకు మరోలా అనుకోకు. నిన్ను వుంచుకుంటాను."

ఆ మాట అరుణ హృదయంలో శూలంలా గుచ్చుకుంది.

ఇంతకాలం ఒక మంచి డాక్టరుగా శ్రీహరిమీద వున్న సద్భావం మంచు తెరలా తొలగిపోయింది.

"నర్సులంటే వేశ్యలు కాదు. ఆత్మాభిమానం వున్న ఏ ఆడపిల్ల దగ్గరా ఇంకెప్పుడూ ఇలా కళ్ళుమూసుకుపోయి మాట్లాడకండి" అంటూ ఆవేశంగా అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

* * *

'నిన్ను వుంచుకుంటాను.'

శ్రీహరి మాటలు గుర్తుకొస్తే చాలు హృదయం కళుక్కుమంటుంది.

వెనకాముందు ఎవరూలేని ఒంటరి ఆడదానికి, అందులోను నర్సు వుద్యోగం చేసే తనలాంటి అందమైన ఆడపిల్లకి ఈ నాగరిక సమాజం ఇచ్చే విలువ ఎటువంటిదో నిరూపించే శ్రీహరిమాటలు ఎంత మర్చిపోదారనుకున్నా మర్చిపోలేకపోతుంది.

జరిగిపోయిన సంఘటన మళ్ళీ కళ్ళముందు మెదలడంతో నిద్ర పూర్తిగా దూరమైంది.

కుర్చీలోంచి విసుగ్గా లేచి స్టేఫ్ రూమ్‌లోంచి వరండాలోకి వచ్చింది.

వెన్నెలచీర కట్టుకున్న ఆకాశం బాలవితంతువులా వుంది.

పగలంతా పార్లమెంటు సభను గుర్తుకుతెచ్చే ప్రభుత్వ హాస్పిటలు కర్ఫ్యూ విధించిన ప్రదేశంలా ప్రశాంతంగా వుంది.

ఆ వెన్నెల రాత్రి,

ఆ ప్రశాంత వాతావరణంలో,

ఆ ఒంటరితనంలో,

పని భారపు ఇనుపతెరల మధ్య బలవంతంగా బంధిస్తూ వస్తున్న ఇరవైమూడేళ్ళ అరుణ కన్నెహృదయం బాధగా మూలిగింది.

ఎప్పుడైనా నిద్రపట్టని ఇటువంటి వెన్నెల రాత్రుల్లో,

పనిలేని ఖాళీసమయాల్లో,

తనకొక హృదయ మున్న సంగతే మర్చిపోయినట్లు వ్యవహరించే అరుణని,

అరుణ హృదయం ఎదురుతిరిగి ప్రశ్నిస్తుంది:

"ఎందుకీ జీవితం" అని.

"అవును ఎందుకీ జీవితం?"

ఆలోచిస్తే తన ఒంటరిజీవితం తనకే అర్థరహిత మనిపించి మౌనంగా కన్నీళ్లు కారుస్తుంది.

భర్త, పిల్లలు, సంసారంతో అందరు ఆడపిల్లల్లాగే హాయిగా బ్రతకవలసిన వయసులో,

వర్గ వ్యత్యాసాల విషవ్యవస్థలో,

ఒంటరిగా

ప్రేమించే మనుష్యులు లేని,

ప్రేమంటే ఏమిటో తెలియని,

మనిషిని మనిషి వంచించే,

నాగరిక జనారణ్యంలో,

బ్రతుకుతెరువుకోసం వుద్యోగం చేస్తూ,

"సిష్టర్, సిష్టర్" అంటూనే చెయ్యిపట్టుకుని వెకిలిచేష్టలు చేసే రోగుల మధ్య,

నర్సులు అంటే తేలికభావంగల దొంగడాక్టర్ల డేగ రెక్కల క్రింద,

నర్సులు అంటే వేశ్యలుగా భావించే దోపిడి ప్రపంచపు అజ్ఞానంలో,

మానవసేవే మాధవసేవగా

రోగుల సేవకు జీవితాన్ని అంకితంచేసిన ఇరవై మూడేళ్ల అందాల భరిణె,

పెళ్ళికాని అరుణ,

ఆ రాత్రి సమయంలో,

ఆ వెన్నెల్లో,

కళ్లనుండి జారుతున్న నీళ్లు తుడుచుకుని ఇలా అనుకుంది.

అమ్మడం, కొనడం, లాభం, నష్టం అనే సూత్రాలమీద కొనసాగుతున్న ప్రేమరాహిత్యపు నాగరిక సమాజం సర్వవిధాలా చెడి కుళ్లిపోయింది.

ఇక్కడ స్త్రీలకు రక్షణ లేదు.

ప్రేమ అనే పదానికి అర్థం లేదు.

న్యాయం, ధర్మం, నీతి, మమత, మానవతలకు ఇక్కడ చోటులేదు.

నివాసయోగ్యం కాని ఈ సమాజాన్ని మార్చాలి.

ఎవరు మారుస్తారు?

ఎలా మారుస్తారు?

ఎప్పటికి మారుస్తారు?

జనరల్ వార్డులోంచి హృదయాన్ని మెలితిప్పే భయంకరమైన దగ్గు తెరలు అరుణ ఆలోచనలను చెదరగొట్టాయి.

## 2

ఆరోనెంబరు బెడ్‌మీద దగ్గిదగ్గి బాధతో మెలికలుతిరిగిపోతున్న పట్టాభి గుండెలమీద ఎవరిదో సుకుమారహస్తం రాపెడిచేయడంతో బాధనుండి కాస్త వుపశమనంపొంది నెమ్మదిగా కళ్లుతెరిచి చూశాడు.

"ఎలా వుంది? డాక్టర్‌ని తీసుకురమ్మంటారా?" ఆత్రృతగా అడిగింది అరుణ.

"అవసరం లేదు. మీరొచ్చారుకదా తగ్గిపోయింది" అని ఒకసారి ఆమె వైపు తేరిపార చూసి

"అయినా ఇదేం రోగమో మీరు దగ్గరున్నంతసేపు బాగానే వుంటుంది. మీరలా వెడితే చాలు నన్ను చంపుకుతింటుంది" నవ్వుతూ అన్నాడు.

మామూలుగా అయితే అరుణ ఆ మాటలకు తేలిగ్గా నవ్వి వూరుకుని వుండును.

కానీ, దుష్టుడు ప్రతీ మాటలోంచి రెండు అర్థాలు తియ్యగలడు.

పట్టాభి పక్క బెడ్‌మీదవున్న ముసలాయన "అయితే మీ రోగానికి మందేమిటో తెలిసిపోయింది. ఆ మందు తీసుకుని మీరు ఇంటికి వెళ్ళిపోవచ్చు" అని వెకిలిగా నవ్వాడు.

ఆ మాటల్లోని అంతరార్థం గమనించిన అరుణ "మీరు కాస్త సభ్యతగా మాట్లాడటం నేర్చుకోండి" అంటూ పట్టాభివైపు కోపంగా చూసింది.

పట్టాభి మనస్సు చివుక్కుమంది.

మూడో నెంబరు బెడ్‌మీద తివారి అనే క్షుద్రవాసు "సిష్టర్, సిష్టర్" అని పిలవడంతో అరుణ అతని దగ్గరకు వెళ్లి "ఏం కావాలి" అని అడిగింది.

"ఏంలేదు సిష్టర్ నిద్రరావడంలేదు. కాలక్షేపం కావడంలేదు. కాసేపు అలా కూర్చోండి" అన్నాడు తివారి.




ధర్మాసుపత్రికి రకరకాల మనుష్యులు వస్తుంటారు. రకరకాలుగా ప్రవర్తిస్తుంటారు. రోగాలు నయంచేయించుకోడానికి మరో దారిలేక హాస్పిటల్లో జాయినయ్యేవాళ్ళు కొందరయితే, ఏ రోగం లేకపోయినా ఏదో సాకుతో సరదాగా జాయినయ్యేవాళ్ళు కొందరుంటారు. ఈ రెండవ కోవకు చెందినవాడు తివారి.

వుద్యోగంలో జాయినయ్యాక రెండేళ్ళలోను రకరకాల మనుష్యులను, వారివారి వింత వింత ప్రవర్తనలకు అలవాటుపడిపోయిన అరుణ చిన్నగా నవ్వుకుని తివారి బెడ్ పక్కన కుర్చీలో జారగిలబడింది.

బెడ్ పక్కనేవున్న హాస్పిటల్ బాక్స్‌మీద దానిమ్మపండు తీసి రెండు ముక్కలుగా కోసి ఒక ముక్క అరుణకు ఇచ్చాడు తివారి.

వద్దన్నా వినిపించుకోడని తెలియడంవలన మారుమాట్లాడకుండా అది తీసుకుంది.

నగరంలో పేరుమోసిన కోటీశ్వరుడి కొడుకు తివారి. వైద్యం చేయించుకోడానికి అయితే అతనికి జనరల్ హాస్పిటల్ అవసరంలేదు. కానీ, చిన్నా పెద్దా వయసు బేధంలేకుండా, వున్నవాడు లేనివాడు అనే తేడాలేకుండా జనంలో చాలామందికి నర్సులంటే ఒక తేలికభావం వుంది. వాళ్ళ చెయ్యి తగులుతుంటే చాలు వచ్చి వొళ్ళో వాలతారని వీళ్ళకో పెద్ద నమ్మకం. ఈ నమ్మకంతోనే తివారి

నెలకి ఒక్కసారయినా సరే ఏదో రోగంవంకతో కాలేజి ఎగ్గొట్టి హాస్పిటల్‌లో జాయినవుతుంటాడు. అందుకుగాను డాక్టర్లకి పెద్ద ఎత్తులో డ్రింక్‌పార్టీలు ఇస్తుంటాడు.

కళ్లు చెదరగొట్టే అరుణ అందం తివారిని పిచ్చివాడ్ని చేస్తుంది. ఎలాగైనా ఆమె ప్రేమను పొందాలని ఆమెను అనుభవించాలని గతసంవత్సరం నుండి పట్టువదలని విక్రమార్కుడిలా ప్రయత్నిస్తూనే వున్నాడు. ఆ ప్రయత్నంలోనే రెండురోజుల క్రితం కడుపునొప్పితో హాస్పిటల్‌లో జాయినయ్యాడు.

"అమ్మా నొప్పి" అంటూ తివారి కడుపు పట్టుకుని తిరిగిపోతుంటే అరుణ కంగారుగా అతన్ని పట్టుకుని కడుపు నిమరసాగింది.

అతను కాస్త సర్దుకున్నతర్వాత "డాక్టర్ని పిలవనా" అంది.

"అవసరంలేదు. ఇప్పుడు కాస్త బాగానే వుంది" అంటూ అరుణ రెండు బుజాలు పట్టుకుని మీదకు లాక్కున్నాడు.

"ఛీ! వదులు!" అంటూ విసిరికొట్టింది. కాని, తివారి కౌగిలినుండి బయట పడలేకపోయింది.

"సిష్టర్! ప్లీజ్ నన్ను కాదనకు" అంటూ బ్రతిమిలాడుతున్నాడు తివారి.

అరుణ గింజుకుంటుంది.

ఏదో ఆలోచిస్తూ పడుకున్న పట్టాభి ఈ గలాటాకి ఇటు తిరిగి చూసాడు.

తివారి కౌగిట్లో గింజుకుంటున్న అరుణని చూడగానే మంచంమీద నుండి ఒక్క ఉదుటన క్రిందకు దూకి తివారి బెడ్ దగ్గరికి పరిగెత్తాడు.

పట్టాభి కొట్టిన దెబ్బకి కళ్లు బైర్లుకమ్మినట్లయి అరుణని వదిలేసాడు తివారి.

ఈ హడావుడికి నిదరపోతున్న పేషెంట్లు మేలుకున్నారు.

"ఏం మిష్టర్! ఇప్పుడెలా వుంది నీ కడుపునొప్పి" గౌను సర్దుకుంటూ వెటకారంగా అడిగింది.

అరుణ వెటకారంతో చిర్రెత్తుకొచ్చింది తివారికి.

"సిష్టర్! అప్పుడే అయిపోయింది అనుకోకు. నా సంగతి నీకు పూర్తిగా తెలియదు."

"ఓరి దౌర్భాగ్యుడా! సిష్టర్ అనే పదానికి అర్థంతెలుసా నీకు" అన్నాడు పట్టాభి.

"ఏం మిష్టర్! నీకు ఇంట్లో అక్కలు చెల్లెళ్లు లేరా....అంది వ్యంగ్యంగా అరుణ.

"అక్కలు చెల్లెళ్ళు వున్నారు. కానీ, నీలాంటి ప్రియురాలే లేదు" అంటూ తన మాటలతో అరుణని గొప్ప దెబ్బతీసాను అనుకున్నాడు తివారి.

"అయితే వాళ్ళలోనే ఒకర్ని ప్రియురాలిగా చేసుకోలేకపోయావా" అని అరుణ అనడంతో గొడవ చూస్తున్న పేషెంట్లు గొల్లుమని నవ్వారు.

తివారికి తల తీసేసినట్లయింది.

"మీ పని రేపు చెప్తాను" అంటూ మంచమెక్కి దుప్పట్లోకి దూరిపోయాడు.

అది చూసి పేషెంట్లు మరోసారి పగలబడి నవ్వుకున్నారు.

అరుణ పట్టాభివైపు కృతజ్ఞతాపూర్వకంగా చూసింది.

పట్టాభి అది గమనించకుండా తలదించుకుని తన బెడ్ వైపు వెళ్ళిపోయాడు.

ఇంతకుముందు పట్టాభి విషయంలో తొందరపడి నోరుజారానే అని బాధపడుతూ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది అరుణ.

ఏం జరుగుతుందో వింత చూడాలనుకున్న పేషెంట్లు నిరుత్సాహంగా నిద్రలోకి జారిపోయారు.

3

పట్టాభి నిద్ర లేవగానే తివారి బెడ్ వైపు చూసాడు. అది ఖాళీగా వుంది.

మొఖం చెల్లక రాత్రికిరాత్రే వెళ్ళిపోయివుంటాడు అనుకుని తనలో తనే నవ్వుకున్నాడు.

పట్టాభి పక్కబెడ్ మీద ముసలాయన ఆవేళ ఖాళీచేసి వెళ్ళిపోయాడు. కొబ్బరిచెట్టు నుంచి జారిపడి కాలు విరగ్గొట్టుకున్న కొత్త పేషెంటు ఆ స్థానాన్ని భర్తీ చేసాడు.

"పేరుకు మాత్రం ధర్మాసుపత్రి! ఇదేమి ధర్మమో ఏమిటో."

కాలిరిగిన పేషెంటుకి అమ్మమ్మో నాయనమ్మో వరసమ్మో ఒక ముసలావిడ వచ్చినదగ్గిర్నుండి గణగణలాడుతూ గొణుక్కోవడం చూసి "ఏం జరిగిందేమిటి బామ్మగారు." అని పలకరించాడు పట్టాభి.

"ఏముంది బాబు! రెక్కాడితేనే గాని డొక్కాడని మనుష్యులం. కష్టం చేసి కుటుంబమంతటికి కాసిని గంజినీళ్లు పోసే కుర్రాడు కాలిరిగి మూలపడ్డాడే అని కొండంత దుఃఖంతో ఇక్కడికొచ్చిపడ్డాం. ముందు, మంచాలు కాళీలేవ

న్నారు. పోన్లే బాబు, ఏదో మూల పడుంటాం అంటే అలా వీల్లేదన్నారు. ఒక యాభై రూపాయిలు మావి కాదనుకునేసరికి లేదన్న మంచం వచ్చేసింది. ఈ కుర్రోడి కాలు నయమయ్యేసరికి ఇంకా ఎన్ని చదివింపులు చదివించాల్సొస్తుందోనని భయంగా వుంది" అని చిత్రంగా చేతులు తిప్పుకుంటూ బామ్మగారు అక్కడ్నుంచి బయటికి వెళ్ళిపోయారు.

నైట్‌డ్యూటీలోంచి రిలీజై ఇంటికి వెళ్ళిపోతున్న అరుణ పట్టాభి పిలుపు విని "పిలిచారా" అంటూ అతని బెడ్‌దగ్గరకి వచ్చి స్టూలుమీద కూర్చొంది.

"నాకు సర్దాగా మాట్లాడటం అలవాటు. నా మాటలతో రాత్రి మీ మనస్సు నొప్పించినట్లున్నాను, క్షమించండి."

పట్టాభి అలా సంజాయిషి ఇవ్వడంతో అరుణ చాలా నొచ్చుకుంది.

"ఛఛ! అలాంటిదేమీ లేదు. ఏదో ఆవేశంలో నేనే కంగారుపడ్డాను. మీ రదేమీ మనసులో పెట్టుకోకండి" అంటూ పట్టాభి దగ్గర శలవు తీసుకుని వెళ్ళిపోయింది.

అరుణ రాత్రలా పెడసరంగా మాట్లాడినందుకు రాత్రంతా ఎంతో మధన పడిన పట్టాభికి ఇప్పుడు అరుణ మాటలు ఎంతో హాయినిచ్చాయి.

అరుణ ఏదో పెడసరంగా మాట్లాడిందని తాను బాధపడటం, ఆ విషయమై తాను నిష్ఠూరంగా మాట్లాడటం, తనలా మాట్లాడినందుకు ఆవిడ నొచ్చుకుని సంజాయిషీ ఇవ్వడము, ఆవిడ సంజాయిషీతో మళ్ళీ తనలో కొత్త వుత్సాహం రావడము, ఇదంతా తలుచుకుంటుంటే పట్టాభికి చాలా ఆశ్చర్యమనిపించింది.

తనకి తెలియకుండానే తాను అరుణ ఆకర్షణలో పడిపోవడం జరిగింది అనుకున్నాడు. అలా అనుకుంటున్నప్పుడు అతనికి తార గుర్తుకొచ్చింది. తన తల్లి మేరీ అత్తకి ఇచ్చిన వాగ్దానం గుర్తుకొచ్చింది.

## 4

బాధగా నిట్టూర్చాడు.

డ్యూటీలో జాయినవ్వగానే అరుణ జనరల్ వార్డులోకివచ్చి పట్టాభి మంచంవైపు చూసింది.

అది ఖాళీగా వుంది.

'ఎక్కడికి వెళ్లాడు చెప్మా' అని మనసులో అనుకుంటుండగా గార్డెన్ లోంచి పట్టాభి దగ్గుతెరలు వినిపించాయి. అటువైపు నడిచింది.

నందూరివారి ఎంకిపాటలా వుంది వెన్నెల.

పచ్చికబయలుమీద కూర్చొని ఏవో ఆలోచిస్తున్న పట్టాభి అరుణ రాకను గుర్తించలేదు.

చేతిలోని సిగరెట్ వేళ్లను కాల్చడంతో ఆలోచనల్లోంచి బయటపడి సిగరెట్ పారేస్తూ పక్కకి తిరిగిచూసాడు.

తనకు కొద్ది దూరంలో పచ్చికబయలుమీద కూర్చొని తనవైపే తదేకంగా చూస్తున్న అరుణని చూసి ఆశ్చర్యపోతూ "ఎంతసేపయింది మీరొచ్చి" అన్నాడు.

"చాలా సేపయింది. ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు."

"మీ గురించే."

అప్రయత్నంగా వచ్చేసిన ఆ మాటకు అరుణ ఏమనుకుంటుందో అని నాలిక కొరుకున్నాడు.

"నా గురించా" అంది ఆశ్చర్యంగా.

"మీరు నన్ను అపార్థంచేసుకోనంటే ఒక విషయం చెబుతాను."

పట్టాభి అలా అనగానే అరుణకి శ్రీహరి గుర్తుకొచ్చాడు. ఒకసారి పట్టాభి వైపు పరిశీలనగా చూసింది.

చన్నీటిలాంటి అతని కళ్లు స్వచ్ఛమైన శాంతికపోతాల్లా వున్నాయి. 'ఛఛ. ఇతను అటువంటివాడు కాదు' అనుకుని "ఏమిటో చెప్పండి" అంది.

"ఇంతకుముందు మిమ్మల్ని ఎప్పుడూ ఎక్కడా చూడలేదు. హాస్పిటల్‌లో జాయినయ్యిన రోజునే మిమ్మల్ని తొలిసారిగా చూసాను. మిమ్మల్ని మొదటసారి చూసినప్పుడే నాలో ఏదో గొప్ప స్పందన ప్రారంభమైంది. ఆ అనుభూతిని నేను మాటల్లో ఇమడ్చలేకపోతున్నాను. మిమ్మల్ని ఎప్పుడో ఎక్కడో చూసినట్లు, ఇంతకుముందే మన మధ్య ఏదో బలీయమైన అనుబంధం వున్నట్లు, ఆ గతమంతా నేను మర్చిపోయినట్లు అనిపిస్తుంది. నిత్యం మీ గురించే ఆలోచన... మీరు నవ్వితే చాలు- నాలో ఏదో చెప్పలేని ఆనందం. మీరు ముభావంగా వుంటే- ఆ రోజంతా నాకు నరకమే.... అప్పుడప్పుడు అనుకుంటుంటాను. అసలు మీరెవరూ? మీ గురించి నేనెందుకింత పిచ్చిగా ఆలోచిస్తున్నాను? నా ప్రశ్నకి సమాధానం లభించదు. మళ్లీ ఆలోచన. తెగని ఆలోచన...."

అరుణ ఆశ్చర్యంగా ఆలకిస్తుంది.

"అనారోగ్యంవలన నా నరాలు బలహీనమై మీ ఆకర్షణ మూలంగా

ఏర్పడుతున్న భావసంచలనమా ఇది అనిపిస్తుంది" అంటూ చెప్పడం ఆపి సిగరెట్ ముట్టించుకున్నాడు.

స్త్రీకి పురుషుడి హృదయాన్ని స్పందింపచేయడంకంటే గర్వకారణం మరొకటి వుండదు. పట్టాభి మాటలు అరుణమీద చాలా గట్టి ప్రభావం చూపాయి. ప్రేమగా పట్టాభివైపు చూసింది. తన హృదయ సంచలనాన్ని అమాయకంగా బయటపెట్టిన పట్టాభి మొఖంలో నిర్మలమైన పసిహృదయం ప్రతిఫలించింది.

"మీకు పెళ్ళయిందా."

అలా అంటున్నప్పుడు వీణ వాయించినట్లుండే అరుణ గొంతులో సిగ్గు రాగమై ధ్వనించింది.

"లేదు" అన్నాడు పట్టాభి.

"అయితే ఇది ప్రేమ పైత్యం అన్నమాట" అంటూ నవ్వుకుంది. అరుణ నవ్వులో పట్టాభి కూడా చోటుచేసుకున్నాడు.

సరిగా అదే సమయంలో అక్కడికి వచ్చిన డాక్టర్ శ్రీహరికి వొంటిమీద జెర్రులు పాకినట్లయింది వాళ్ళ నవ్వు.

"ఇదేమైనా హాస్పిటల్ అనుకుంటున్నారా ? వ్యభిచార గృహం అనుకుంటున్నారా?"

శ్రీహరి మాటలకు దెబ్బతిన్న పక్షిలా గిలగిల్లాడింది అరుణ మనస్సు.

అప్పటివరకు నవ్వుతూవున్న అరుణ మొఖంలో రంగులు మారడం గమనించి పట్టాభి చాలా బాధపడ్డాడు.

"డాక్టర్! కొంచెం సభ్యతగా మాట్లాడటం నేర్చుకోండి."

"అలాగే, ఈసారి ఖాళీ అయినప్పుడల్లా మీ దగ్గరకి ట్యూషన్‌కి వస్తుంటాను." అని విసవిసలాడుతూ అక్కడ్నించి వెళ్ళిపోయాడు శ్రీహరి.

అరుణ కళ్ళనుండి జారిపడిన నీటిబొట్లు ఆ వెన్నెట్లో తళుక్కుమన్నాయి. అరుణని ఆ పరిస్థితుల్లో చూసి పట్టాభిహృదయం కలుక్కుమంది.

## 5

వంటచెయ్యడం పూర్తయింది.

స్నానంచేసి బట్టలు మార్చుకునేసరికి కడుపులో ఆకలి కరకరలాడుతుంది. కాఫీ, భోజనం చెయ్యాలనిపించడంలేదు అరుణకి. కొంచెం మజ్జిగ తాగి మరల కుర్చీలో జారగిలబడింది.

పక్కింటి రేడియోలోంచి- సైగల్ గొంతులో విషాదం హృదయాన్ని పిండుతుంది.

జానెడు పొట్టలో పూటకి పిడికెడు మెతుకులకోసం దినదిన గండం నూరేళ్ళాయుష్షులాంటి వుద్యోగం.

వండుకోవడం, తినడం, పడుకోవడం!

క్రమం తప్పని కార్యక్రమం.

గానుగెద్దులాంటి జీవితం!

ఎందుకోసం! ఎవరికోసం!

తాను మొదట్నుంచి దురదృష్టవంతురాలే! వూహ తెలిసిన దగ్గర్నుంచి వేటకుక్కలా పరిమితంగా వెంటాడిన ఒంటరితనంనుండి పారిపోవాలనే ప్రయత్నంలోనే, జారిపోయిన ఇరవై రెండు సంవత్సరాల సుదీర్ఘ కాలంలో నేడు ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే ఏముంది, తన జీవితంలో ఇది జరిగింది అని చెప్పుకోడానికి?

గతాన్ని తవ్వకుంటే ఎక్కడో జ్ఞాపకాల పొరల అట్టడుగున లీలగా అస్పష్టంగా మినుకుమినుకుమనే తండ్రి రూపం తప్పించి, తండ్రి ప్రేమ ఎలా వుంటుందో తాను ఎరగదు.

తల్లి ప్రేమామృత జల్లులో తడిసి పునీతం కావలసిన బాల్యం విద్యాభ్యాసం పేరుతో గురుకులానికి అంకితమైపోయింది. స్కూలు ఫీజులు హాస్టలు ఫీజులు కట్టడానికి ఎప్పుడో నెలకి ఒక శెలవురోజున తల్లి దర్శనం. మనస్సులోనే గూడుకట్టుకుపోయిన మహోన్నతమైన తమ ప్రేమను మినహాయించుకుంటే భౌతికంగా తల్లితో తనకున్న పదహారేళ్ళ అనుబంధం అదే.

క్షణికమైన ఆవేశంలో తరతరాల పురుషాధిక్యపు అహంకారాన్ని ధిక్కరించి ప్రశ్నించిన తప్పుకి జీవితాన్ని మోడుచేసుకున్న తల్లి గుర్తుకు రావడంతో అరుణ కళ్ళు చెమ్మగిల్లాయి.

మనసు వికలమైపోయింది.

కుర్చీలోంచి లేచి పుస్తకాల షెల్ఫ్ దగ్గరికివెళ్ళి తన జీవితంలో అదే ఆఖరి సంవత్సరమని తెలియక ఎన్నో ఆశలు కలలు కాగితాల్లో నింపుకున్న తల్లి ఆఖరి డైరీ షెల్ఫ్‌లోంచి తీసి మంచంమీద వాలిపోయింది.

ఆ డైరీలో ముత్యాలవంటి దస్తూరిలో తల్లి రూపం కనిపిస్తుంది. ఆ కాగితాల్లోవున్న ప్రతి అక్షరం వెనుక తన తల్లి హృదయం కనిపిస్తుంది.

అందుకే, యాంత్రికమైన జీవితంతోను, ఒంటరితనంతోను విసిగెత్తిపోయే అరుణ హృదయాన్ని సేదతీరుస్తుందా డైరీ!

అరుణ కళ్ళు డైరీలోవున్న అక్షరాల వెంట పరిగెడుతున్నాయి.

డైరీ చదువుతూనే నిద్రలోకి జారిపోయింది.

మళ్ళీ మెళకువొచ్చేసరికి సాయంత్రం అయిదు గంటలయ్యింది.

ఆ వేళ ఆదివారం.

మొఖం కడుక్కొని రెండు మెతుకులు తిని చర్చికి బయలుదేరింది; రాబర్ట్ని కలుసుకోవడం కోసం.

* * *

ఆ సాయంకాలపు నీరెండలో శిలువదారి ఆలయం రెక్కలిప్పుకున్న శాంతికపోతంలా వుంది.

చర్చి ఎదురుగావున్న తోటలో పచ్చికబయలుమీద కూర్చుని ప్రభుధ్యానంలో వున్న ఫాదర్ రాబార్ట్ పరలోకంనుండి ప్రభువు పంపిన దేవదూతలా వున్నాడు.

"అంకుల్."

అరుణ పిలుపుతో ఈ లోకంలోకి వచ్చిన రాబర్ట్ "రా అమ్మా రా! ఇలా కూర్చో" అంటూ అరుణని సాదరంగా ఆహ్వానించాడు.

"అంకుల్! నువ్వు నాకో సహాయం చెయ్యాలి."

"ఏమిటో చెప్పమ్మా."

"జోసెఫ్ ట్యుటోరియల్ కాలేజిలో ఒక ఇంగ్లీషు లెక్చరర్ కావాలని పేపర్లో అడ్వర్టైజ్మెంటు చూసాను."

"అవునమ్మా! ఆ మధ్య జోసెఫ్ నాతో కూడా చెప్పాడు."

"మేనేజ్మెంట్కి నా క్వాలిఫికేషన్స్ తృప్తినిస్తే ఆ వుద్యోగం నా కొచ్చేటట్లు సహకరించాలి మీరు."

"మరి నువ్వు ఇప్పుడు చేస్తున్న వుదోగ్యమో" అరుణవైపు ఆశ్చర్యంగా చూసాడు రాబర్ట్.

ఇన్నాళ్ళుగా తన వుద్యోగంలో ఎదుర్కొంటున్న అవమానాన్ని గాని, మానసికక్షోభనుగాని ఇప్పటివరకు ఎప్పుడూ కూడా రాబర్ట్కి చెప్పలేదు అరుణ; చెప్పి ఆయన మనసు పాడుచెయ్యడం ఇష్టంలేక. కానీ, ఇప్పుడు చెప్పక తప్పింది కాదు.

అరుణ వుద్యోగానుభవాలు విని చాలా బాధపడ్డాడు.

"దురదృష్టవంతురాలివి. మీ అమ్మే కాని బ్రతికుంటే నీ భవిష్యత్ మరో రకంగా వుండి వుండును.... సరే అయ్యిందేదో అయిపోయింది. మానసికంగా ఇంత క్షోభ అనుభవిస్తూ కూడా ఇన్నాళ్లు నాతో చెప్పకుండా ఎలా వుండ గలిగావమ్మా."



"మగవాడివి కాబట్టి కొండంత దుఃఖాన్ని గుండెల్లో దాచుకుని మళ్లీ మనిషిలా తిరగ్గలుగుతున్నావు. మళ్లీ నా గొడవతో నీ మనసు మరింత పాడు చెయ్యడం ఇష్టంలేక చెప్పలేదు అంకుల్."

"ఏ జన్మలో ఏ పాపంచేసానో, ఈ జన్మలో నా కింత దారుణమైన శిక్ష

విధించాడు ప్రభువు" అలా అంటున్నప్పుడు రాబర్ట్ కళ్ళనుండి రెండు కన్నీటిబొట్లు జలజలా రాలిపడ్డాయి.

గొడ్లు కాచుకునే కుటుంబంలో పుట్టి స్వయంకృషితో చదువుకుని అతి కష్టంమీద వున్నతస్థితికి చేరుకున్న ప్రజ్ఞావంతుడు రాబర్ట్. తన కులంకంటే వున్నత కులంలో పుట్టి, ఆర్థికంగా తనకంటే ఎంతో వున్నత స్థితిలో వుంటూ, తన ప్రేమకోసం సర్వాన్నీ త్యాగంచేసి తన గుడిసెకు నడిచివచ్చిన భార్యను చూసుకుని లోకంలో తనకంటే గొప్ప అదృష్టవంతుడు మరొకరుండరని మురిసిపోయాడు. ప్రాణసమానంగా ప్రేమించిన భార్య తొలికాన్పులో ఒక మగబిడ్డను మిగిల్చి ఈ లోకంనుండి శాశ్వితంగా నిష్క్రమించడంతో, తన ప్రేమకు చిహ్నంగా గత పాతికేళ్ళనుండి ప్రభుధ్యానంలో తనును తాను శిలువ వేసుకున్నాడు రాబర్ట్.

పాతికేళ్ళ క్రితం తను కేవలం తన భార్యను మాత్రమే పోగొట్టుకున్నాడు. కానీ, ఈ పాతికేళ్ళుగా తను ఏ బిడ్డలో అయితే తన భార్యను చూసుకుని బ్రతుకుతున్నాడో, ఆ బిడ్డ అకాలమృత్యువుకి ఎరకావడంతో భార్య, బిడ్డ కూడా ఒకేసారి తన కన్యాయంచేసి పోయినట్లనిపించిందతనికి.

ప్రేమకి సంకేతంలా, మనిషిలోని దైవత్వానికి ప్రతీకగా కనిపించే రాబర్ట్ కళ్ళల్లో నీళ్ళు చూసి అరుణ స్త్రీహృదయం బాధతో విలవిల్లాడింది.

"మరిచిపోతున్న గతాన్ని కెలికి మళ్ళీ నీ మనసు వికలం చేసాను. నన్ను క్షమించు అంకుల్."

"ఛ.ఛ. అదేమిలేదమ్మా. అయినా, నువ్వు నా బిడ్డ చచ్చిపోయాడను కుంటున్నావు కదూ! లేదమ్మా లేదు. వాడు చచ్చిపోలేదు.... అదిగో అటు చూడు.... ఆ ప్రభువు.... ఆయనే వాడిని తన దగ్గరికి తీసుకుపోయాడు.... మరి ఆయనెక్కడున్నాడో తెలుసా నీకు? ఇదిగో, ఇక్కడ.... నా హృదయంలో.... మీ ఆంటీపోయిన రోజునే ఆయన్ని నా హృదయంలో శిలువ వేసేసానమ్మా. అయినా, ఈ అజ్ఞానంలోంచి బయటపడలేక ఈ వెధవ కళ్ళు అప్పుడప్పుడూ నీళ్ళు కారుస్తుంటాయి" అంటూ జేబురుమాలుతో కళ్ళు వొత్తుకుంటుంటే ఆ పరిస్థితుల్లో ఆయన్ని చూడలేక, మరోక్షణం అక్కడ వుండలేక "వెళ్ళొస్తాను అంకుల్" అంటూ అక్కడ్నుంచి లేచి వెనక్కి తిరిగింది.

## 6

"వుద్యోగానికి రాజీనామ ఇచ్చేస్తున్నాను."

అరుణ మాటలకు వులిక్కిపడ్డాడు పట్టాభి.

"ఏం."

"ఈ వారం రోజుల్నుండి ఇక్కడ జరుగుతున్నదంతా మీరు కళ్లారా చూస్తూనే వున్నారు. కత్తిమీద సాములాంటి వుద్యోగం. ఏ క్షణాన ఏం జరుగుతుందో చెప్పలేం."

"ఇలాగని వుద్యోగం మానుకుంటారా."

"మరేం చెయ్యమంటారు."

"మానేసి ఏం చేస్తారు."

"జోసెఫ్ ట్యుటోరియల్ కాలేజిలో ఒక లెక్చరర్ పోస్టు ఖాళీగా వుందని తెలిసింది. అందులో ట్రై చేస్తాను."

"అక్కడ కూడా ఇలాంటి పరిస్థితులే ఎదురైతే."

ఏం సమాధానం చెప్పాలో పాలుపోలేదు అరుణకి.

"సముద్రంలోకి దిగిన తర్వాత మంచినీళ్లు ఏమూల దొరుకుతాయా అని వెదకడం వెర్రితనమే అవుతుంది. ఇది పురుషాధిక్యత ప్రపంచం. మీరు ఏ మూలకి వెళ్లినా ఇదే సంఘం. ఇదే మనుష్యులు. ఈ రోజులలో ఆడపిల్లలకి కావలసింది భద్రతనిచ్చే ప్రదేశం కాదు. భద్రత కల్పించుకునే ఆత్మవిశ్వాసం. అది మీలో లేనినాడు ఎక్కడికి వెళ్లినా ఇవే పరిస్థితులు మిమ్మల్ని నీడలా వెంటాడుతాయి. నిజంగా మీ మీద మీకు విశ్వాసం వుంటే మీరిక్కడనుండి పిరికిదానిమల్లే పారిపోవలసిన అవసరం లేదు."

ఆలోచిస్తే 'అవును నిజమే' అనిపించాయి పట్టాభి మాటలు.

"ముసలిపీనుగులా సలహాలిస్తున్నందుకు మీరు మరోలా భావించక పోయినట్లయితే నాదొక చిన్నమాట"

ఏమిటన్నట్లు చూసింది అరుణ.

"పంటకొచ్చిన చేలు కంచె లేకపోతే పశువులకి, వయసొచ్చిన ఆడపిల్ల తాళి లేకపోతే లోకానికి లోకువంటారు. మీకాళ్లమీద మీరు నిలబడి స్వతంత్రంగా జీవిస్తున్నారు. మీకు నచ్చిన వ్యక్తిని ఎన్నుకుని వివాహం చేసుకుంటే మీ కిన్ని ఇబ్బందులు వుండవు కదా!"

"నర్సులంటే చిన్నచూపు చూసే దౌర్భాగ్యపు లోకంలో లోకం మెచ్చే సాంప్రదాయాలన్నీ ధిక్కరించి భ్రష్టుపడిన కుటుంబం నుండి వచ్చిన నన్ను చేసుకోడానికి ఎవరొస్తారండి ముందుకి!"

"అంటే, నర్సులందరూ అవివాహితులుగానే వుండిపోతున్నారనా మీ ఉద్దేశం?"

"అలాగని కాదు-సంస్కృతి పేరుతో జీవితాన్ని కలుషితంచేస్తున్న సంఘదౌష్ట్యం నా కుటుంబ చరిత్ర మీద చల్లిన బురదవల్ల ఈ సభ్య సమాజం నన్ను ఇల్లాలిగా అంగీకరించదు."

"నాకు అర్థంకాలేదు. మీకు అభ్యంతరం లేకపోతే వివరంగా చెప్పండి."

"ఈ హిందూసమాజం నిర్దాక్షిణ్యంగా వూరిచివరికి విసిరేసిన మాలగూడెంలో పుట్టింది మా అమ్మ. ఆవిడ తండ్రి ఒక పాలేరు. అద్వితీయమైన తెలివి. అపురూపమైన సౌందర్యంతో వెలిగిపోయే తన కూతుర్ని చూసుకుని మురిసిపోయే ఆ పేదతండ్రి తన కూతుర్ని కలెక్టర్ని చెయ్యాలనుకున్నాడు. రెక్కలు ముక్కలు చేసుకుని అమ్మాయిని చదివించాడు."

"..............................."

"ఆవిడ కాలేజిలో చదువుతుండగా అగ్రకులస్థుడు, ఆస్తిపరుడు, ఆదర్శవాది అయిన ఒక యువకుడి ప్రేమలో పడింది. అతన్ని వివాహం చేసుకుంది. అల్లుడ్ని చూసుకుని ఆ ముసలితండ్రి తన కూతురు అదృష్టానికి ఎంతో పొంగిపోయాడు. కానీ, అతని కూతురు కులాన్ని మంటగలిపిందని, వెలిగావింపబడిన ఆతని కులం అతన్ని ఎలా వెలివెయ్యాలో తెలియక అమ్మను చూసి బరితెగించిన పిల్ల అని ముక్కుమీద వేలేసుకుంది."

కుతూహలంగా ఆలకిస్తున్నాడు పట్టాభి.

"మా అమ్మ వివాహాన్ని నాన్నవైపువాళ్లు అంగీకరించలేదు. మా నాన్న తనవాళ్లతో తెగతెంపులు చేసుకోలేక, అమ్మను విడవలేక వేరే వూరులో మా అమ్మతో వేరేకాపురం పెట్టాడు. ఈ సాంప్రదాయ సమాజం అమ్మని కేవలం నాన్న వుంపుడుకత్తెగానే గుర్తించి ముద్రవేసింది."

"నేను పుట్టిన రెండేళ్లకి అమ్మకి నాన్నకి అభిప్రాయ బేధాలు రావడం, విడిపోవడమూ జరిగింది. దానితో ఈ లోకం అమ్మని చెడిపోయినదానిగా చిత్రించింది. నేను మాత్రం అటు అమ్మకులానికి ఇటు నాన్నకులానికి కూడా చెందకుండా చెడిపోయినదాని కూతురుగా చరిత్రహీనురాలిగా మిగిలిపోయను.

"ఈసారి చెప్పండి. కులంమతం పునాదుల మీద నిర్మించబడిన ఈ సాంప్రదాయ సమాజంలో నన్ను భార్యగా స్వీకరించడానికి ఏ యువకుడు




ముందుకు వస్తాడు? నన్ను కోడలిగా స్వీకరించడానికి ఏ తల్లితండ్రులు అంగీకరిస్తారు?"

"అరుణగారు! రోజులు మారాయి-మనుష్యులు మారారు. మీరు చెబుతున్న మతం కులం మొదళ్లు బలహీనమై కదిలిపోతున్న కాలంలో జీవిస్తున్నాం మనం. నిన్నటి పెళ్లిళ్లలో ప్రేమకు ఆస్కారం లేదు. కులం మతం వంశ చరిత్రలు నేటి ప్రేమకి అవసరంలేదు. అయినా మీకేం తక్కువని? కళ్లు చెదరగొట్టే అందం వుంది. మీ కాళ్ల మీద మీరు నిలబడి ఎవరికి తలవొంచకుండా స్వతంత్రంగా జీవించేందుకు వుద్యోగం వుంది. మీరే కనుక పెళ్లికి "వూఁ" అంటే క్యూలో కోటిమంది నిలబడతారు."

ఆ మాటలకు అరుణ నిర్లిప్తంగా నవ్వుకుంది.

"నా అందం చూసో నేను చేసే వుద్యోగం చూసో నావెంటపడేవాళ్ళేకానీ, నాహృదయం తెలుసుకుని నన్ను నన్నుగా ప్రేమించే హృదయమున్న మనుష్యులెవరూ నా కింతవరకు ఎదురుపడలేదు పట్టాభిగారు"

"జీవితం యొక్క అన్ని గొప్ప విలువలను అంగట్లో వస్తువులుగా మార్చిన అమ్మకాల వ్యవస్థలో జీవిస్తున్నాం మనం. ప్రతీ విషయాన్ని లాభం నష్టం అనే సూత్రాలకి అన్వయించుకోవడమే ఇప్పటి జీవన సిద్ధాంతం. ఇందుకు వ్యతిరేకంగా ఆలోచించడం వేపచెట్టుకి తీపికాయలు కాయాలను

కోవడం లాటిదే. అయినా అరుణగారు! కాల మాన ఆర్థిక భౌతిక పరిస్థితులకు అతీతమైన ప్రేమ మనకి కేవలం కథల్లోను సినిమాల్లో మాత్రమే కనిపిస్తుంది"

"అంటే, నిజమైన ప్రేమకు ఈ లోకంలో స్థానంలేదనా మీ ఉద్దేశం"

"లేదని కాదు! ఈ వ్యక్తి సార్థవ్యవస్థలో మాత్రం అది తప్పనిసరిగా గగనకుసుమమే."

"అయితే ప్రేమలేదని, మనం ప్రేమ అనుకుంటున్నది ప్రేమ కాదని తెలిసికూడా ఈ ప్రేమలేని ప్రేమను ప్రేమ అనుకోవడం ఆత్మవంచన కాదంటారా?"

"మన భౌతిక జీవితంలోంది ప్రేమను ప్రత్యేకించి విడదీసి చూడక పోయినప్పటికి, మనం జీవించి వుండటమే పెద్ద ఆత్మవంచన అరుణగారు. అంతా ఎందుకు, మీరెటువంటి ప్రేమను కోరుకుంటున్నారో అంత గొప్ప ప్రేమను మీ జీవితంలో ఎవ్వరికైనా పంచివ్వగలిగేరా."

అవును, తాను తన జీవితంలో ఎవర్నని ప్రేమించింది! తాను ఎన్నడూ చూడని కృష్ణని తప్పించి.

ఎక్కడున్నాడో, ఏంచేస్తున్నాడో అసలు వున్నాడో లేదో తెలియని కృష్ణ కోసం హృదయాన్ని దోసిళ్ళలో వుంచుకుని ఎదురుచూసిం దింతకాలం,

పడమట దిక్కున సూర్యోదయం కాదని తెలిసి కూడా, ఎలా వుంటాడో కూడా తెలియని కృష్ణ తనకోసం వస్తాడనే నిరీక్షణలో "నిన్ను ప్రేమిస్తున్నాను అరుణ" అంటూ వెంటపడిన రాబర్ట్ కొడుకు ప్రేమని తిరస్కరించింది,

అందరూ అనుకుంటున్నట్లు రాబర్ట్ కొడుకు యాక్సిడెంటల్‌గా చావ లేదన్న ఆలోచన అరుణ స్త్రీహృదయంలో ఏమూలో పెద్ద గాయంచేసి వదిలింది. ఇప్పుడు మళ్ళీ పట్టాభి మాటలతో ఆ గాయం కెలికినట్లయింది.

బాధగా నిట్టూర్చి అక్కడ్నుంచి కదలింది.

అర్థంకాని అరుణ అంతరంగానికి ఆశ్చర్యపడుతూ వెళ్ళిపోతూన్న అరుణవైపు చూస్తూ వుండిపోయాడు పట్టాభి.

## 7

"వారంరోజుల్నుండి చూస్తున్నాను. నిన్ను చూడటానికి ఒక్కరు రాలేదు. మీవాళ్ళెవరూ ఇక్కడలేరా బాబు" పక్కమంచం దగ్గర బామ్మగారు పలకరించ డంతో ఏం సమాధానం చెప్పాలో వెంటనే పాలుపోలేదు పట్టాభికి.

కొన్ని క్షణాల తర్వాత.

"మీరంతా నావాళ్లే. కానీ! నన్ను తనవాడిగా చెప్పుకునే వాళ్లెవరూ ఈ లోకంలో నాకు లేరు బామ్మగారు" అన్నాడు.

సరిగా అదే సమయానికి అక్కడికి వచ్చిన అరుణ ఆ మాటలు వింది. అలా అంటున్నప్పుడు అతని కళ్లల్లో నీలినీడలు గమనించి చాలా బాధపడింది.

"అయ్యో! పాపం! అలాగా బాబు! నా మాటలతో నీ మనసు నొప్పించానేమో" అంటూ బాధపడిన బామ్మగారు "అప్పుడేంచేస్తున్నావు బాబు" అని అడిగింది.

"బ్యాంక్‌లో వుద్యోగమండి" అని, అలా అబద్ధమాడవలసి వచ్చినందుకు తనలో తానే నొచ్చుకున్నాడు పట్టాభి.

"అయితే ఇంకేం బాబు! ఒక మంచి అమ్మాయిని చూసి పెళ్లిచేసుకోలేకపోయావా" అన్న బామ్మగారి మాటలను వెటకారంగా తీసుకుని "అదే ప్రయత్నంలో వున్నాను బామ్మగారు, నాకు నచ్చిన అమ్మాయి ఎక్కడా కనిపించడంలేదు" అన్నాడు.

"వెనకటి కెవడో నీలాంటివాడే తనక్కావలసింది ఇంట్లోనే పెట్టుకుని దానికోసం వూరంతా వెతికాడంట. ఈడుజోడు చిలకాగోరింకల్లా వున్నారు. మీకు ఇష్టమైతే ఈ నర్సమ్మని చేసుకోరాదు బాబు" అరుణ పట్టాభితో చాలా ఆప్యాయంగా మసలడం గమనించిన బామ్మగారు తన మనసులో వుద్దేశాన్ని నిస్సందేహంగా బయటకి చెప్పేసారు.

"నా కయితే ఇష్టమే! కానీ, నన్ను చేసుకోడానికి ఆవిడ ఇష్టపడాలి కదండీ" అంటూ నవ్వుతూ అరుణవైపు దొంగచూపులు చూసాడు.

ఆ మాటలకు అరుణ చెక్కిళ్లు ఎర్రబడ్డాయి.

డాక్టరు నాగార్జున వార్డు చూడటానికి రావడంతో ఆ సంభాషణ అంతటితో ఆగిపోయింది.

నాగార్జున వార్డంతా చూసుకుని బామ్మగారి మనవడి బెడ్‌దగ్గరకివచ్చి అతన్ని పరీక్షచేసి "నా డబ్బు తెచ్చారా" అని బామ్మగార్ని అడిగాడు.

బామ్మగారు తన మొలలోంచి రూపాయిల దొత్తుతీసి నాగార్జున చేతిలో పెట్టింది.

నాగార్జున వాటిని లెక్కపెట్టుకుని "ఇదేమిటి? రెండువందలే వున్నాయి" అంటూ చిరాగ్గా మొఖంపెట్టుకున్నాడు.

"బాబు! అది నా బిడ్డ తినీతినక కూడబెట్టుకున్న రెక్కల కష్టం. అంత కంటే ఎక్కువ ఇచ్చుకోలేం" అంటూ బ్రతిమిలాడడంతో "సరే, సరే" అంటూ పట్టాభి బెడ్ దగ్గరకి వచ్చి "ఎలాగుంది మిస్టర్" అన్నాడు.

"వచ్చి వారం రోజులవుతుంది. ఇంకా రోగ నిర్ధారణే కాలేదు. ఎవరెవరో వస్తున్నారు. ఏవేవో ఇంజక్షన్లు చేసిపోతున్నారు. ఇదేం వైద్యం డాక్టర్?"

"చూస్తే బాగా చదువుకున్నవాడివిలా కనిపిస్తున్నావు! మన ప్రభుత్వ ధర్మాసుపత్రుల తంతు ఏరకంగా వుంటుందో తెలియదా? ఇక్కడి వైద్యం నీకు నచ్చకపోతే నా ప్రైవేటు నర్సింగ్ హోమ్‌లోకి వచ్చిచేరు. స్పెషల్ ట్రీట్‌మెంటు ఇచ్చి నీ రోగం వారం రోజులలో నయం చేస్తాను. కాకపోతే కాస్త డబ్బెక్కువవుతుంది.

"ఎంత"

"అయిదు వందలు. అంత డబ్బు నువ్విచ్చుకోలేకపోతే నీకు స్పెషల్ ట్రీట్‌మెంటు ఇస్తాను. రెండు వందలవుతుంది డబ్బుముందిచ్చెయ్యాలి.

"ఇక్కడే ట్రీట్‌మెంట్ చేయించుకుంటాను. కాని, నాకు డబ్బురెండు రోజులలో అందుతుంది"

"సరే, అలాగే" అంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు నాగార్జున.

నైట్‌డ్యూటీ నుండి రిలీజైన అరుణ "వెళ్తాను" అని పట్టాభితో చెప్పి వెళ్ళిపోయింది.

పట్టాభి ఆలోచనలో పడ్డాడు.

ప్రపంచంలో అవినీతి ఎంత నగ్నంగా విలయతాండవం చేస్తుందో తెలుసుకోడానికి ధర్మాసుపత్రుల కంటే సరైన స్థలాలు వేరే ఏముంటాయి!

ఒక్కొక్క డాక్టరుని తయారు చేయడానికి ప్రభుత్వానికి లక్ష రూపాయిలు పైన ఖర్చవుతుంది.

దేవుడ్ని నమ్మనివాడు సైతం చెయ్యెత్తి కొలిచే మహోన్నతమైన వ్యక్తులు డాక్టర్లు. కానీ, అటువంటి డాక్టర్లే ఏ ప్రజల సొమ్ముతో విద్యనభ్యసిస్తున్నారో ఆ విద్యనే ప్రజలను దోచుకోడానికి సాధనంగా వినియోగించుకుంటున్నారు.

చదువు "కొన్న" డాక్టరు తన చదువుని అమ్ముకుంటాడు. ఇందులో అతని తప్పులేదు. అది ఈ అమ్మకాల వ్యవస్థ లక్షణం. కానీ, ఉచిత వైద్య

నీ బొంద వున్నది వున్నట్టుగా చెప్తానని
అంతా సొద చెప్తావేంటి?



శంకర్
సాగర్

శాలలు అనే ప్రభుత్వ హాస్పిటల్స్‌లో ఉద్యోగంచేస్తూ అందుకు తగిన ప్రతి ఫలం పొందుతూ కూడా రోగులవద్ద డబ్బు గుంజడం ఎంత దారుణం?

చదువు కున్నవాడు, సమాజం గురించి తెలిసున్నవాడు అయిన తను సైతం కళ్లముందు జరుగుతున్న అక్రమాన్ని చూస్తూ వూరుకున్నాడే తప్ప అది తప్పని ఖండించలేకపోయాడు. కారణం? తనెవరో తానే చెప్పుకోలేని దుస్థితి. కానీ, బామ్మగారు కానీ మరొకరు కానీ తమకు జరుగుతున్న అన్యాయాన్ని వ్యతిరేకించలేకపోడానికి కారణం? నలుగురుతోపాటు మనం అనుకునే సంకుచిత పరిధిలోంచి మనుష్యులు బయటపడలేకపోవడమే.

ఈ సంకుచిత పరిధిని బద్దలుకొట్టుకొని ఎవరికి వారే బయటపడాలి. తమకు జరుగుతున్న అన్యాయానికి ఎవరికి వారే ఎదురుతిరిగి పోరాడాలి. అంతేకానీ, ఎవరో ఎప్పుడో కొంతమంది వీరులు వచ్చి ఈ సమాజాన్ని మార్చరు. ఇప్పుడున్న వ్యత్యాసాల సామాజిక వ్యవస్థ క్రూరత్వానికి బలి అవుతున్నది ప్రజలు. ఈ వ్యవస్థను మార్చుకునేది కూడా ప్రజలే. ప్రజలు చైతన్యవంతం కావాలి. అప్పుడే మార్పు.

“బాబూ! కాస్త ఈ కాఫీ త్రాగు” అంటూ బామ్మగారు పిలవడంతో ఈ లోకంలోకి వచ్చాడు పట్టాభి.

కాఫీ త్రాగి ఆ గ్లాసు బామ్మగారికిచ్చేసి ఒక్కసారి చుట్టూ చూసాడు. వార్డంతా కీసరబాసరమంటూ ఎవరి గొడవలో వారున్నారు.

అరుణ రాత్రివరకు రాదు.

బ్యాగ్‌లోంచి ఓ ఎర్రట్టి పుస్తకంతీసి కొంచెంసేపు చదువుకున్నాడు.

మధ్యాహ్నం హాస్పిటల్‌బోయ్ హోటల్ నుండి తెచ్చిన కారేజి భోజనం తిని ఒక అరగంట కునుకుతీసాడు. నిద్రలేచిన తర్వాత బామ్మగారిచ్చిన కాఫీ తాగి కాసేపు గార్డెన్‌లో అటూ ఇటూ తిరిగాడు. తర్వాత తన బెడ్‌దగ్గరకి వచ్చి తలగడక్రింద వున్న తెల్లకాగితాల దొంతర తీసి ఏదో వ్రాయడం ప్రారంభించాడు.

# 8

సాయంత్రం అయిదు గంటలకు డాక్టర్ శ్రీహరి వార్డులో రౌండ్‌వేసి వెళ్ళిపోయిన తర్వాత పట్టాభి భోజనం చేసి అరుణ కోసం ఎదురుచూస్తున్నాడు. అరుణ రావడం లేదు. పట్టాభి మనస్సు సిగరెట్ మీదకు పోయింది. పట్టాభి సిగరెట్లు చాలా విపరీతంగా కాలుస్తాడు కానీ, ఆరోగ్యం కోలుకునే వరకు సిగరెట్లు కాల్చకూడదని అరుణ మాట తీసుకుంది. అరుణ మాట మీద గౌరవం కొలదినో, ఆవిడ ఒక్క క్షణం కూడా తనను విడువకుండా వుండటంవలన అవకాశం చిక్కకో, గత రెండు రోజుల నుండి పూర్తిగా సిగరెట్లు కాల్చడం మానేసాడు. కానీ, ఈ వేళ సిగరెట్ కాల్చాలనే కోర్కె విపరీతమవ్వడం వలన ఎలాగు అరుణ లేదుకదా అని బ్యాగ్‌లోంచి సిగరెట్ ప్యాకెట్ తీసి ఒక సిగరెట్ ముట్టించాడు. రెండు పీల్పులు పీల్చే సరికల్లా అరుణ డ్యూటీలో జాయినయ్యి వార్డులోకి రావడంతో కంగారుగా ఆ సిగరెట్ గోడకి రాసి ఆర్పేస్తుండగా నోటిలో పొగతోను చేతిలో సిగరెట్ పీకతోను అరుణ కంటపడిపోయాడు.

"నాతో మాయమాటలు చెప్పి మీరు మామూలుగా దొంగచాటున కాల్చేస్తున్నారన్నమాట" మామూలుగానే అన్నప్పటికి అరుణ మాటలలో పట్టాభి ఆరోగ్యం పట్ల తీసుకునే జాగ్రత్తవలన కాస్త బాధ వ్యక్తమైంది.

చాలా చిన్న చిన్న విషయాలే అవతల వ్యక్తి మనపై చూపే గొప్ప ప్రేమను చాలా స్పష్టంగా వ్యక్తంచేస్తాయి. తన ఆరోగ్యంపట్ల తనకంటే

ఎక్కువగా శ్రద్ధచూపే అరుణకి తనిచ్చినమాట తప్పినందుకు సిగ్గుపడటమే కాకుండా చాలా బాధపడ్డాడు పట్టాభి.

"సారీ అరుణ! రెండురోజుల్నుండి పూర్తిగా మానేసాను. ఇప్పుడెందుకో కాల్చాలనే కోర్కె చంపుకోలేక ఒక్కటి ముట్టించాను"

"సిగరెట్లు కాలిస్తే చాలా ప్రమాదమని డాక్టరు చెప్పారు. నామాట గౌర వించాలని కాకపోయినా, మీ ఆరోగ్యం కోసమైనా మీరు తప్పనిసరిగా సిగరెట్లు మానెయ్యాలండి."

"ఆరోగ్యం కోసమే అయితే నా జీవితంలో నేను సిగరెట్లు మానకపోదును. నిజంగా చెబుతున్నాను ఈ వేళటినుండి నేను బ్రతికుండగా మళ్లీ సిగరెట్ ముట్టుకోను అరుణా" అంటూ సిగరెట్ ప్యాకెట్ తీసి కిటికీలోంచి బయటికి దూరంగా విసిరేసాడు.

మానవ జీవితంలో ఆకర్షణ అనేది చాలా గొప్ప విషయం. ఇది స్త్రీ పురుషుల మధ్య మరీను. పట్టాభిని సిగరెట్ కాల్చడం మానెయ్యమనడం నర్సుగా అరుణ బాధ్యత. సిగరెట్ మానెయ్యడ మనేది పేషెంటుగా పట్టాభి కర్తవ్యం. ఇది డాక్టర్‌కి రోగికి మధ్యవుండే సహృదయత ఒప్పందం. కానీ, అరుణ మానెయ్య మనడంలోను, పట్టాభి మానెయ్యడంలోను వాళ్ల ఒప్పందం కంటే అతీతమైన గొప్ప ప్రేమ మిళితమైవుంది. ఈ సంఘటన మానసికంగా వాళ్లిద్దరి హృదయాలను మరింత దగ్గరచేసింది.

"పురుషుడి ప్రతీ విజయం వెనుక ఒక స్త్రీహస్తం వుంటుందని చలంగా రన్నారు. కానీ ప్రతీ పురుషుడి ఆరోగ్యం వెనుక కూడా ఒక స్త్రీ హస్తం వుంటుందని మీరునిరూపించారు. చాలాథాంక్స్"

అరుణ మాటలకు పగలబడి నవ్వాడు పట్టాభి. ఆ నవ్వు దగ్గులోకి దించింది. దగ్గి దగ్గి మనిషి వుండచుట్టుకుపోతుంటే అరుణ కంగారుగా డాక్టర్ దగ్గరికి పరిగెట్టింది.

శ్రీహరి అయిష్టంగానే వచ్చి ఒక ఇంజక్షన్‌చేసి వెళ్లిపోయాడు. పట్టాభి గుండెలమీద చేత్తో రాస్తూ కూర్చుంది అరుణ. కాసేపటికి అతను నిద్రలోకి జారిపోయాడు. అతను నిద్రపోయిన కాసేపటికి అరుణ మంచంమీదనుండి లేచి పక్కనేవున్న కుర్చీలో జారగిలబడింది.

వార్డులో పేషెంట్లు నిద్రపోడానికి ప్రయత్నిస్తున్నారు.

సమయం పదిగంటలు కావస్తుంది.

అరుణ పట్టాభి గురించే ఆలోచిస్తుంది.

పట్టాభి సన్నంగా ఎర్రగా సాగదీసిన చైతన్యంలా పొడవుగా వుంటాడు. వయస్సు ఇరవై ఎనిమిదేళ్లకంటే ఎక్కువ వుండదు. వచ్చి వారం రోజులవుతుంది. ఇంకా రోగ నిర్ధారణ జరుగలేదు. ఒక్కొక్కసారి దగ్గి దగ్గి దగ్గుతో ప్రాణాలు విడుస్తాడేమో అన్నంత భయంకరమైన దగ్గుతో బాధ పడుతుంటాడు. ఒక్కొక్క సారి విపరీతమైన గుండెనొప్పితో విల విల్లాడతాడు.

పట్టాభి హాస్పిటల్‌లో జాయినయ్యిన తొలిరోజునే అతనంటే ఒక సదభిప్రాయం ఏర్పడింది అరుణకి. అతని మొఖంలో ప్రతిఫలించే అతని మేదస్సు యొక్క తేజస్సు. పున్నతమైన అతని వ్యక్తిత్వపు ఆకర్షణలనుండి ఎంత ప్రయత్నించినా తప్పించుకోలేకపోతుంది. అసలే దయాహృదయం గల అరుణ ఏ రోగినైనా సరే తల్లిలా చూసుకుంటుంది. అది వుద్యోగ ధర్మంగా కాక తన బాధ్యతగా భావిస్తుంది. అటువంటిది, జీవితంలో తొలిసారిగా తన స్త్రీత్వాన్ని చలింపజేస్తున్న యువకుడు పట్టాభి ఆరోగ్య విషయంలో మరింత జాగ్రత్త తీసుకోవడంలో ఆశ్చర్యంలేదు.

అతని ఆరోగ్యం కోసమని ఓవర్ డ్యూటీలు చేస్తుంది. వేరే నర్సులెవరైనా అయితే అతని ఆరోగ్య విషయంలో తగినంత శ్రద్ధచూపరనే భావంతో కావాలని నైట్‌డ్యూటీలు వేయించుకుంటుంది. కానీ, ఈ ఆకర్షణలో పడి తను ఎటువైపు కొట్టుకుపోతుందో అనే భయం అప్పుడప్పుడు అవిడ్ని హెచ్చరించి అదుపులో వుంచుతుంది.

పట్టాభి ఎటువంటివాడు అనేది వూహించడానికి ప్రయత్నిస్తున్న అరుణ "అమ్మా" అని పట్టాభి మూలగడంతో అటు చూసింది.

పట్టాభి ఒకవైపు నుండి మరొకవైపుకు వొత్తిగిల్లి పడుకోవడంలో తలగడ క్రిందనుండి కాగితాల కట్ట ఒకటి క్రిందపడింది.



అరుణ ఆశ్చర్యంగా వాటిని తీసి చూసింది.

అదొక రాతప్రతి.

'పట్టాభి కూడా ఒక రచయితన్నమాట' అనుకుంది ఆశ్చర్యంగా.

అరుణకి సాహిత్యమన్నా సాహిత్యకారులన్నా గొప్ప అభిమానం.

ఒకసారి వార్డంతా కలయజూసింది.

పేషెంట్లు అందరూ నిద్రలో వున్నారు.

ఇక తాను చేయవలసిన పనేమీలేదు. పట్టాభి ఫ్లాస్కులోంచి ఒక కప్పు టీ పోసుకుని తాగి ఆ రాతప్రతి చదవడం ప్రారంభించింది.

* * *

పొరపాటు చేయడానికి ఒక్క క్షణకాలం సరిపోతుంది. ఆ పొరపాటు సరిదిద్దుకోడానికి ఒక్కొకసారి ఒక జీవితకాలం కూడా సరిపోకపోవచ్చు.

నాకు నా జీవితం నేర్పిన పాఠం ఇది.

గొప్పవాళ్లు దేశప్రముఖులు తమ జీవితాల్ని కథలుగా వ్రాసుకుంటారు. పదిమందికి అది మార్గదర్శక మౌతుందేమో నన్న ఉద్దేశంతోటి. నా జీవితంలో పదిమందికి మార్గదర్శకమయ్యే గొప్ప విషయాలేమీ లేవు. కానీ, ఆవేశమే కాని ఆలోచనలేని మార్పు కోరే యువతరానికి ఏది మార్గం కాదో

తెలియచేయడానికి నా జీవితం కొంతయినా ఉపకరిస్తుందని నా నమ్మకం. ఆ నమ్మకంతో నేనా జీవితాన్ని కాగితాలపై సంక్షిప్తపరుస్తున్నాను.

చదువుతున్న అరుణకి అది పట్టాభి జీవిత కథేమో అని అనుమానం వచ్చి చదవడం ఆపివేసింది. అతని అనుమతి లేకుండా దాన్ని చదవడం సభ్యతకాదు. తిరిగి దాన్ని యదాస్థానంలా వుంచాలనుకుంది. కానీ, పట్టాభి ఎటువంటివాడో ఏమిటో తెలుసుకోవాలనే కుతూహలం ఆమె ప్రయత్నాన్ని విరమింప జేసింది. దానితో, తిరిగి మళ్ళీ చదవడం ప్రారంభించింది.

* * *

రెండు ఎరాలు మార్చొని తిన్నా తరగని ఆస్తి మాది. కాని, తన ఆస్తిని తన జీవితాన్ని కూడా పార్టీకి అంకితంచేసిన కమ్యూనిస్టు యోధుడు మానాన్న. ఫుల్‌టైమ్ పార్టీ వర్కర్‌గా మా నాన్నకి నెల నెలా పార్టీ ఇచ్చే కొద్దిపాటి జీతమే మా కుటుంబ పోషణకు ఆధారమయ్యింది. ఈ రకంగా చాలా భయంకరమైన పేదరికంవలన నేను నా బాల్యంలో ఎన్నో ఇబ్బందుల నెదుర్కోవలసి వచ్చింది.

అంతర్జాతీయంగా చైనా రష్యాల సిద్ధాంత విభేదాలు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమాన్ని చావుదెబ్బ తీసాయి. దాని ఫలితంగా భారత్ కమ్యూనిస్టు పార్టీ కూడా రెండు ముక్కలుగా చీలిపోయింది. లెక్కకందని ఎందరో మహనీయుల ప్రాణత్యాగ ఫలితంగా ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ వాళ్ళ నెత్తురుతో తడిసి ఎగిరిన ఎర్రజెండా రెండు ముక్కలు కావడం నాన్నను చాలా కృంగ దీసింది. శ్రామికజన సంక్షేమరాజ్య నిర్మాణం కోసం సర్వాన్ని త్యాగంచేసే కమ్యూనిస్టుల కంటే ఆశాజీవులు ప్రపంచంలో మరెవ్వరు వుండరు.

పార్టీ చీలిక నాన్నను కృంగదీసిందే కాని, నిరాశావాదిని చెయ్యలేదు. సమ సమాజ నిర్మాణానికి తప్పటడుగు వేసిన కమ్యూనిస్ట్ పార్టీ తిరోగమన విధానాన్ని వ్యతిరేకించి మార్కిస్ట్ కమ్యూనిస్ట్ పార్టీ అనే కొత్త పార్టీ నిర్మాణానికి నడుంకట్టాడు నాన్న.

కమ్యూనిస్ట్ పార్టీ తప్పుడు విధానాన్ని వ్యతిరేకిస్తూ కట్టుగుడ్డలతో బయట పడిన పార్టీ కార్యకర్తలు మళ్ళీ కొత్తగా మార్కిస్ట్ పార్టీకి పునాదులు నిర్మిస్తున్న కాలం అది. మా నాన్నలాంటి కార్యకర్తల కుటుంబాలకి చాలా భయంకరమైన గడ్డురోజులు అవి.

కొత్త పార్టీకి ఏ రకమైన నిధులు లేవు. మా నాన్నకి పార్టీపనే తప్ప

ఆదాయంవచ్చే మరో పనేదీ లేదు. కుటుంబం గడవడం చాలా కష్టంగా వుండేది. పార్టీ సానుభూతిపరులు చిన్న చిన్న సహాయాల వల్ల కాస్త ఏర్పడి నప్పటికి, వారంలో రెండు రోజులు ఇంటిల్లిపాది పస్తులుండవలసివచ్చేది. అటువంటి పరిస్థితులలో కూడా నాన్న చలించలేదు.

మా నాన్నలాంటి కార్యకర్తల శ్రమ వృధాపోలేదు. దేశం నలుమూలలా మళ్లీ కొత్త కమ్యూనిస్ట్ పార్టీ బలం పుంజుకుంది. మా వూర్లో కూడా మానాన్న వలన పార్టీ బాగా బలపడింది.

మా వూరి భూస్వాములకి రైతుకూలీలకి జరుగుతున్న హక్కుల పోరాటానికి నాయకత్వం వహించిన మా నాన్నపై పోలీసులు దొంగకేసులు బనాయించి జైల్లో పెట్టారు.

మా ఇంటి పరిస్థితి చాలా అధ్వాన్నమై పోయింది. అప్పటికే అంతంత మాత్రంగా వున్న మా అమ్మ ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది.

మానాన్న కమ్యూనిస్ట్ కావడం, శ్రామికవర్గ ప్రయోజనాలకోసం బంధువర్గంతో కూడా తగదాలుపడటం వలన బంధువులంతా కట్టకలిసి మా కుటుంబాన్ని వెలివేసారు.

నేను మా అక్క మా అమ్మ-మా ముగ్గురికి ఆ వూర్లో అండగా నిలిచింది రైతుకూలీలైన కొందరు కమ్యూనిస్ట్ యోధులు మాత్రమే.

మా వూరి రైతు కూలీలంతా కూడి చందాలు వేసుకుని మా అమ్మని మావూరి ప్రైవేటు హాస్టల్‌లో జాయిన్ చేసారు.

మనలాంటి ప్రజాస్వామ్య దేశాలలో కొంతమంది ప్రైవేటు డాక్టర్లకి జలగలకి పెద్ద భేదం లేదు. కాకపోతే, ఒక్కొక్కసారి జలగలే చాలా నయ మనిపిస్తాయి వీళ్లు.

రెక్కాడితేనే గాని డొక్కాడని రైతుకూలీలు తిని తినక తిండి మాను కుని పోగుచేసిన వెయ్యి రూపాయిలలోను ఆరువందలు కట్టడం ఫీజుకింద, మిగిలినవి మందులకి అయిపోయాయి. అమ్మ రోగం మాత్రం నయంకాలేదు

అమ్మ కడుపులో పేగు పాడయిందని ఆపరేషను చెయ్యకపోతే బ్రతకదని డాక్టర్ చెప్పాడు. ఆపరేషన్ చెయ్యాలంటే ముందుగా రెండువేలు టేబుల్‌మీద పెట్టమన్నాడు.

రెండువేలు ఎక్కడ్నుంచి తెచ్చేది?

శ్రీకాకుళంలో వున్న మావయ్యకి విషయమంతా తెలియజేస్తూ అక్క ఉత్తరం వ్రాసింది.

మావయ్య వచ్చాడు.

మావయ్య కూడా మా నాన్నలాగే తన ఆస్తినంతా పార్టీకి విరాళంగా ఇచ్చివేసి పార్టీనిచ్చే జీతంతో మనుగడ సాగిస్తున్న పార్టీ కార్యకర్త.

క్రిందామీదా పడి ఒక వెయ్యి రూపాయిలు మాత్రం తేగలిగాడు.

తాను అడిగిన డబ్బులో ఒక రూపాయి తక్కువయినా ఆపరేషన్ చెయ్యనన్నాడు డాక్టరు. మావయ్య డాక్టరుతో గొడవపడి అమ్మను పట్నంలో ధర్మాసుపత్రిలో జాయిన్ చేసాడు.

అమ్మను హాస్పిటల్లో జాయిన్ చేసేసరికే మా మావయ్య దగ్గరున్న వెయ్యి రూపాయిలలోను మూడువందలు జారిపోయాయి. అదే మరోసమయంలో అయితే అక్కడ జరుగుతున్న అవినీతిపై మావయ్య తప్పకుండా పోరాడి వుండేవాడే. కానీ, అమ్మ పరిస్థితి చాలా ప్రమాదకరంగా వుండడంవలన మావయ్య అక్కడ అవినీతికి తలవొంచక తప్పింది కాదు.

అప్పుడు శ్రీకాకుళంలో రైతు పోరాటాలు వుధృతంగా జరుగుతున్న రోజులు. అమ్మ హాస్పిటల్లో జాయినయ్యిన మరుసటిరోజు మావయ్యను అర్జంటుగా రమ్మనమని శ్రీకాకుళం నుండి కబురొచ్చింది. మళ్లీ వస్తానని చెప్పి మావయ్య వెళ్లిపోతూ అక్కడ మేరి అనే నర్సుకి మా బాధ్యత అప్పగించాడు.

ధర్మాసుపత్రులలో అవినీతి ఇప్పటికంటే అప్పుడు మరింత దారుణంగా వుండేది.

ప్రభుత్వం నుండి శాంక్షనయిన మందులు ఎన్నో చేతులు మారి హాస్పిటల్‌కి వచ్చేవే చాలా తక్కువ. ఆ వచ్చిన మందుల్లోనే ఎవరికి చిక్కినవి వారు అమ్ముకుని డబ్బుచేసుకునేవారు. ఈ పరిస్థితులు ఇప్పటికి ఏ మాత్రం మారకపోయినా కొన్ని విషయాల్లో మాత్రం అప్పటికంటే ఇప్పుడు చాలా నయం.

ఇంజక్షన్లు చెయ్యడంలేదని ఎవరైనా గొడవపడితే ఏ రంగు నీళ్లో ఏ డిస్టిల్ వాటరో ఇంజక్షన్లు చెయ్యడం నేను కళ్లారా ఎరుగుదును. ఈ రకమైన వైద్యం మా అమ్మ విషయంలో జరగకుండా వుండటానికి మేరీ చాలా కష్టపడేది.

మేరీ ఎవరో కాదని, మా శంకరం మావయ్య భార్య అని మాకు అత్త అవుతుందని మా అమ్మ చెప్పడంతో మేము ఆశ్చర్యపోయాము. మాకు తెలిసున్నంతవరకు శంకరం మావయ్య బ్రహ్మచారి.

శంకరం మావయ్య మానాన్న మా అమ్మ కుడా తాము నమ్మిన ఆశయాల కోసం సమాజాన్నే ధిక్కరించి నిజమైన ప్రజాసంక్షేమ రాజ్యంకోసం తమ జీవితాన్నే త్యాగం చేసిన మహోన్నతమైన వ్యక్తులు.

కాలేజిలో చదువుకునే రోజుల్లో మా అమ్మ, శంకరం మావయ్య, మా నాన్న, మేరీ అత్త చాలా మంచి స్నేహితులట.

ఆ స్నేహం ప్రేమగా మారి మేరీఅత్తను శంకరం మావయ్య, మా అమ్మను మానాన్న కాలేజీలో చదువుకునే రోజుల్లోనే రిజిష్టర్ మారేజీ చేసుకున్నారట.

మానాన్న ఆర్థికంగా బాగా వున్నవాడే. కానీ, మా అమ్మ కులం వేరు, మానాన్న కులం వేరు. మేరీ అత్త ఒక సామాన్య హరిజన రైతుకూలీ కూతురు. ఈ పెళ్లిళ్ల విషయాలు తెలిసి. పరమ చాంధసుడు మోతుబరి రైతు అయిన మా తాత మండిపడ్డాడట.

మా తాతయ్యకి మా అమ్మ శంకరం మావయ్య ఇద్దరే పిల్లలట.

తనని కాదని కులాన్ని మంటగలిపిన మాఅమ్మతో సంబంధాన్ని పూర్తిగా తెగతెంపులు చేసుకొన్నాడే కానీ, తలకొరివి పెట్టి వంశాన్ని వుద్ధరించే ఒక్కగా నొక్క కొడుకైన శంకరం మావయ్య విషయంలో నిస్పృహుడై పోయాడు మా తాత. శంకరం మావయ్య చేసిన పనిని క్షమించాగలిగాడే కాని మేరీ అత్తతో వివాహాన్ని మాత్రం అంగీకరించలేకపోయాడు. దీనితో శంకరం మావయ్య మేరీ అత్తకు పట్నంలో ఒక ఇల్లు కొని అక్కడే కాపురం పెట్టి రెండు రోజులు అక్కడ రెండు రోజులు తండ్రి దగ్గర కాలం గడుపుతుండే వాడట.

శంకరం మావయ్యకి ఆవేశం ఎక్కువ. తనకు తోచిందే సత్యమని నమ్మేమనిషి. అలాగే మేరీ అత్త కూడాను. మేరీ అత్తకు శంకరం మావయ్యకు ఒక ఆడపిల్ల జన్మించిన తర్వాత వాళ్ళిద్దరి మధ్య ఏవో అభిప్రాయ బేధాలు వచ్చి విడిపోవడమే కాకుండా తమ వివాహబంధాన్ని పూర్తిగా తెగతెంపులు చేసుకున్నారట.

అమ్మ చెప్పేవరకు ఈ విషయాలేమి మాకు తెలియవు. అమ్మ ఎప్పుడయితే తన తండ్రిని కాదని నాన్నకూడా వచ్చేసిందో ఆ రోజునే పుట్టింటిలోవున్న సంబంధాన్ని పూర్తిగా త్రెంచుకుంది. ఆ తర్వాత ఆవిడ జీవితంలో మళ్ళీ ఎప్పుడూ తన పుట్టింట అడుగు పెట్టలేదు.

మావయ్య మాత్రం అప్పుడప్పుడూ వచ్చి చూసిపోతుండేవాడు.

తాతయ్య పోయినతర్వాత మావయ్య తన ఆస్తినంతా పార్టీకి ఇచ్చివేసి తన జీవితాన్ని పార్టీకి అంకితంచేసాడు.

* * *

మావయ్య మళ్ళీ పెళ్ళిచేసుకోలేదన్న వార్త హాస్పిటల్‌లో మాఅమ్మ ద్వారా విని మేరీ అత్త చాలా బాధపడింది.

తప్పు శంకరం మావయ్యదైనా, మేరీ అత్తదైనా వాళ్ళు చేసిన పొరపాటు వాళ్ళ నిండుదాంపత్య జీవితాన్ని నిస్సారం చేసింది.

జరిగినదానికి అత్తచాలా పశ్చాత్తాప పడుతుండేది. తన తొందరపాటు తనబిడ్డ భవిష్యత్‌ను బలితీసుకుంటుదేమోనని కుమిలిపోతుండేది.

మగవాడైతే బాధ లేకపోను. ఆడపిల్ల అందరూవుండి కూడా ఎవరూ లేని అనాదగా మిగులిపోయింది. రేపు దాని బ్రతుకు ఏరకంగా వుంటుదోనన్న

వాదే నాకో పెద్ద సమస్యగా మిగిలిపోయింది" అంటూ ఒకరోజు మా అమ్మ దగ్గర కంటతడి పెట్టుకుంది.

"నీకు కూతురు పుట్టగానే అది నా కోడలని చెప్పాను. మర్చిపోయావేమిటి మేరీ" అని అమ్మ అనడంతో మేరీఅత్త కళ్ళు ఆనందంతో మెరిసాయి.

"మీరు పొరపాటున మానవులుగా జన్మించిన దేవతలు. ఏ జన్మలో చేసిన పుణ్యమో మీ సాన్నిధ్యంలో బ్రతికే అదృష్టాన్ని పొందికూడా దాన్ని దూరంచేసుకున్న దురదృష్టవంతురాల్ని. నన్ను క్షమించండి వదినా" అంటూ అమ్మను కౌగలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది అత్త.

నిండైన వెన్నెల విగ్రహంలా వుండేది మేరి అత్త. చూపరుల హృదయాలలో మాతృప్రేమామృతాన్ని చిలికించే దయాచక్షువులు, ఆమె హృదయంలో కొండంత విషాదం గూడుకట్టుకుని వుందంటే నమ్మశక్యంగాని ఆమె పెదవులపై ఎప్పుడూ చెరగని చిరునవ్వు, తెల్లటి హాస్పటల్ దుస్తుల్లో శాంతి సంకేతంలా వుండే ఆమెరూపం ఇప్పటికీ నాకళ్ళల్లో మెదులాడుతుంటుంది. ఇటువంటి దయామయితో జీవితాన్ని పంచుకునే అదృష్టాన్ని త్రుంచుకున్న శంకరంమావయ్య ఎంతటి దురదృష్టవంతుడో కదా అనిపిస్తుంది.

మేరి అత్త కూతురు పేరు తార.

మా అమ్మను హాస్పిటల్‌లో జాయిన్‌చేసిన తర్వాత ఏ ఒక్కరోజుని కూడా తార హాస్పిటల్‌కి రాలేదు.

తారని చూడాలనే కుతూహలాన్ని చంపుకోలేక ఒకరోజు అత్తయ్యను అడిగేసాను "తారను ఇక్కడకు ఎందుకు తీసుకురావడంలేదు" అని.

అత్తయ్య నన్ను చూసి నవ్వుకుని తార రాజమండ్రి గురుకులంలో చదువుకుంటుందని, వేసవిశెలవులకు వస్తుందని చెప్పింది.

అమ్మ హాస్పటల్‌లో వుండగానే భారత కమ్యూనిస్టు మార్క్సిస్ట్ పార్టీలో మరో విషాదకరమైన మార్పు సంభవించింది.

శ్రీకాకుళం గిరిజన రైతాంగ పోరాటాన్ని నగ్జల్బరి రైతాంగ పోరాటాన్ని దీర్ఘకాలిక సాయుధపోరాటంగా కొనసాగించాలని మార్క్సిస్ట్ పార్టీ నుండి కొంతమంది మేధావులు పార్టీ నిర్ణయాన్ని త్రోసిపుచ్చి మరో కొత్త విప్లవ పార్టీని ఏర్పరుచుకున్నారు.

శంకరం మావయ్య అతని అనుచరులు కూడా తుపాకులు పట్టుకుని రహస్య జీవితంలోకి వెళ్ళిపోయారు.

ఈ వార్త విని అమ్మ, అత్తయ్య కూడా చాలా షాక్ అయ్యారు.

* * *

జీవితంలో యాదృచ్ఛికంగా జరిగే చిన్న చిన్న సంఘటనలకు జీవితాన్ని మనం వూహించని మలుపులు తిప్పుతాయి. దీన్నే ఆస్తికులు విధివ్రాత అంటే నాస్తికులు పరిస్థితుల ప్రభావం అంటాడు.

అమ్మ ఆరోగ్యం కోలుకోలేదు.

మంచంమీద మగతలో పడివుంది.

ఇటువంటి పరిస్థితులలో మేరీ అత్తకు వైజాగ్ నుండి కాకినాడకు ట్రాన్స్‌ఫరైంది.

అమ్మను ఆ పరిస్థితుల్లో వదిలివెళ్ళడం ఆమెకు ఎంతమాత్రం ఇష్టం లేదు. అలాగని ఆమెను జీవనోపాధి అయిన వుద్యోగాన్ని వదులుకోలేదు.

మాకేం పర్వాలేదని నేను మా అక్క, అత్తయ్యకు ధైర్యం చెప్పి ప్రయాణం చేయించాం.

అవిడ మెడలో వున్న బంగారుగొలుసు అమ్మి ఆ డబ్బు అక్కయ్య చేతిలో పెట్టి మా బాధ్యత మరో నర్సుకి అప్పగించి విడువలేక విడువలేక విడిచి వెళ్ళింది.

* * *

వారం రోజుల క్రితం అత్తయ్య ఎవరో ఏమిటో మాకు తెలియదు. చాలా విచిత్రంగా అవిడ్ని కలుసుకున్నాం. అవిడ్ని కలుసుకున్నప్పుడు ఎంత సంతోషించామో, విడిపోయేటప్పుడు అంతకు రెట్టింపు బాధను అనుభవించాం.

అత్తయ్య మళ్ళీ వస్తుంది.

అమ్మ ఆరోగ్యం కోలుకుంటుంది.

అత్తకూతురు తారని కలుసుకుంటాం.

ఇవన్నీ రేపటి గురించి ఈ వేళటి వూహలు.

వాస్తవానికి ఇవి వూహలు కావు.

ఈ వేళ జరిగిన వాస్తవ పరిస్థితుల్ని బేస్‌చేసుకుని రేపటి గురించి వేసుకునే అంచనాలు.

ఈ అంచనాలు రేపు వాస్తవం కావచ్చు లేక తలక్రిందులు కావచ్చు.

ఇది ఎందుకు ఇలా జరుగుతుంది? ఇది ఎందుకు అలా జరగడం లేదు? అని ఆలోచించి అన్వేషించేవారు మహాప్రవక్తలు, మార్గదర్శకులు అవుతారు.




అలా చెయ్యలేనివారు ఇదంతా మాయ అని ఒక్క ముక్కలో తేల్చివేస్తారు. లేదా, విసిగిపోయి వ్యగ్రవాదులవుతారు.

జీవితం అనేది రాయని గ్రంథంలాంటిది. అందులో అనుభవాలే అక్షరాలు. ఆ గ్రంథం ఎలా వుంటుంది? ఏమిటి అనేది ముందుగా మనం చెప్పలేం. ఆ గ్రంథం పూర్తయేసరికి మనం వుండం. ఇదే జీవితం.

పాపం అక్కయ్య జీవితంపట్ల ఎన్ని కలలు కందో, ఎన్ని వూహలు అల్లుకుందో! నాన్నలాంటి వాడికి కూతురైన తప్పుకి కటిక దారిద్ర్యాన్ని అనుభవించింది. ఏనాడు నాకిది కావాలని అడుగలేదు. ఇది లేదేమిటని ఎప్పుడూ ఎవ్వరిమీదా అలగలేదు. అటువంటి స్త్రీమూర్తిని నేను మళ్ళీ నా జీవితంలో చూసి ఎరగను.

*   *   *

అత్తయ్య వెళ్ళిపోయిన మరుసటి రోజు రాత్రి ఒక మిత్రుడి ఇంటి దగ్గర వుండిపోయాను. ఆ మరుసటి రోజు వుదయం హాస్పిటల్‌కి వెళ్ళేసరికి హాస్పిటల్ నూతిలోంచి బయటికితీసిన అక్కయ్య శవం నాకోసం ఎదురు చూస్తుంది.

ఆ భయంకర దృశ్యం చూసి కూడా నేనెలా బ్రతికి బయటపడ్డానో తలుచుకుంటుంటే ఇప్పటికీ ఆశ్చర్యంగా వుంటుంది.

మెడికల్ కాలేజి విద్యార్థులు కొంతమంది ఆ రోజు రాత్రి అక్కను అమానుషత్వంగా బలాత్కరించి అనుభవించివుంటారని కొంతమంది గుసగుసలు వినిపించాయి.

పోలీసులు వచ్చారు.

అది ఆత్మహత్యగా నమోదుచేసుకుని వెళ్లిపోయారు.

ఎంత దారుణం!!!

ఈ దారుణం ఎక్కడో అడవుల్లో మనుష్యులెవరూ లేనిచోట రహస్యంగా జరిగివుంటే ఆశ్చర్యపోనక్కరలేదు.

కానీ, మనుషుల మధ్య.... మనుష్యులకి ప్రాణదానం చేసే మహోన్నతమైన పవిత్రస్థలంలో.... బహిరంగంగా.... అయ్యో ఎంత దారుణం!!

ఈ దారుణవార్త విని అమ్మ కన్నుమూసింది.

* * *

పదిరోజుల క్రితం,

అమ్మ ప్రాణాలు రక్షించుకోవాలని

కొండంత ఆశతో

అమ్మ నేను అక్క ఇక్కడికి వచ్చాం.

ఈ వేళ—

అమ్మ లేదు.

అక్క లేదు.

పదిరోజుల్లో అంతా మాయలా జరిగిపోయింది.

జరిగింది మాయ కాదు.

మోసం, దగా, అమానుషత్వం.

ఈ ప్రపంచమే ఒక పెద్ద అరణ్యం.

అరణ్యంలో పులు లుంటాయి. జింక లుంటాయి.

పులులు జింకల్ని తింటాయి. జింకలు పులుల్నుండి తమను తాము రక్షించుకోడానికి ప్రయత్నిస్తాయి.

మానవారణ్యం అలా కాదు.

అందరూ మనుష్యులే!

పులుల్లాంటి మనుష్యులు!

జింకల్లాంటి మనుష్యులు!




పులితోలు కప్పుకున్న జింకల్లాంటి మనుష్యులు!

జింకతోలు కప్పుకున్న పులుల్లాంటి మనుష్యులు!

ఏది పులో? ఏది జింకో! తెలియదు!

ఎవరి నుండి ఎవరు రక్షించుకోవాలో తెలియదు!

అంతా మోసం!

అంతా దగా!

అంతా ముసుగు!

ఆ ముసుగుల్ని చీల్చాలి!

ఈ సమాజాన్ని మార్చాలి!

నాలో పగ! ద్వేషం! క్రోధం!

అమ్మ అక్క అనాధ ప్రేతాలయ్యారు.

అమ్మ శవాన్ని హాస్పిటల్‌వారు, అక్క శవాన్ని మున్సిపాల్టీవారు తీసుకుని పుణ్యం కట్టుకున్నారు.

రెండు నెత్తురు బొట్లు కన్నీళ్లుగా మార్చుకుని మావూరు ప్రయాణమయ్యాను.

* * *

నాన్న వుద్యమానికి నాయకత్వం వహించాను.

నాన్న జెయిల్లో మరణించాడన్న వార్త పేపర్లో చూసి మావయ్య, అతని అనుచరులు మారువేషాల్లో మావూరు వచ్చారు. అప్పటికే మావయ్య మీద ఎన్నో హత్యకేసులు, కుట్రకేసులు మోపబడివున్నాయి.

మావయ్య నాయకత్వంలో ఆ రాత్రికి రాత్రే మావూరి భూస్వామిని రెండు ముక్కలుగా నరికి, ప్రజలచేత రాయించుకున్న ప్రోనోట్లు తగులబెట్టి ఇనప్పెట్టెలో వున్న డబ్బు, బంగారం తీసుకుని మా వూర్నుండి పరారయ్యాం.

ఈ రకంగా నేను కూడా వుగ్రవాదినై ఆయుధం పట్టుకుని అడవిలోకి వెళ్లిపోయాను.

మేరీ అత్తను మర్చిపోయాను.

అత్త కూతురు తార సంగతి మర్చిపోయాను.

నన్ను నేనే మర్చిపోయాను.

నాకు గుర్తున్నదల్లా ఒక్కటే:

లోక క్రూరత్వానికి అమానుషత్వానికి బలైపోయి అనాదప్రేతాలుగా మారిన అమ్మ అక్కల రూపాలు!

లోకంలో ఏ అమ్మకూ, ఏ అక్కకూ మళ్లీ ఇటువంటి దుస్థితి పట్టకూడదు.

ఇదే నా ధ్యేయం!

ఇదే నా జీవితాశయం!

నా నాయకత్వంలో ఎందరో భూస్వాముల్ని నరికాను. ఎందరో రాక్షసుల్ని వధించాను.

మా వుద్యమానికి ప్రజల సానుభూతి కనిపించింది. కవుల జేజేలు వినిపించాయి.

రెండు మాసాలపాటు వుద్యమం చాలా వుధృతంగా కొనసాగింది.

ఆ తర్వాత –

మా స్థావరాల చుట్టూ పోలీసులు.

మాకు సహకారం లభించిన ప్రతీ గ్రామంలోను పోలీసు స్థావరాలు.

కనిపించిన నక్సలైటునల్లా కాల్చి చంపారు

అనుమానం వచ్చిన ప్రతీవారిని ఊచకోత కోసారు.

మళ్లీ మా వుద్యమంలో మాలో మాకే అభిప్రాయ భేదాలు; సిద్ధాంత ఘర్షణలు!




పార్టీ వంద ముక్కలయ్యింది!
ప్రతీ ఇద్దరికి ఒక నాయకత్వం!
ఒక్కొక్కరిది ఒక్కొక్క సిద్ధాంతం!
ఎవరి అనుచరులతో వారు ప్రత్యేక గ్రూపుల నేర్పరుచుకున్నారు.

ఉద్యమం విఫలమైంది.

"ప్రజల్ని చైతన్యవంతం చేసి ప్రజారాజ్యం నిర్మించవలసిన మనం ప్రజల్ని విస్మరించి నేల విడిచి సాము చేస్తున్నాము. ఆవేశంలో పార్టీని చీల్చి పార్టీకి ప్రజలకి కూడ ద్రోహంచేసినవాళ్లమయ్యాం" అని శంకరం మావయ్య చాలా బాధపడ్డాడు.

శంకరం మావయ్యను ఎవ్వరూ లెక్కచెయ్యలేదు సరికదా, అవకాశ వాది, పిరికివాడు అని గేలిచేసారు.

మావయ్య విషయంలో నేనూ అలాగే అభిప్రాయపడ్డాను.

ఒక రోజున ఒక గ్రామంలో ఒక భూస్వామి ఇల్లు కొల్లగొడుతూ శంకరంమావయ్య అతని అనుచరులు పోలీసులకు పట్టుబడ్డారు.

"ప్రముఖ నక్సలైటు నాయకుడు శంకరం ముఠాకి పోలీసులకి జరిగిన కాల్పుల్లో శంకరంతోపాటు పదిమంది నక్సలైట్లు మృతి."

ఆ మరునాడు పెద్ద హెడ్డింగుతో పేపరు వార్త!

అతిరధ మహారదుల వంటి ప్రముఖ నాయకులు ఒక్కొక్కరే రాలి పోతున్నారు.

మా వుద్యమం పట్ల ఆకర్షితులై ఎందరెందరో కొత్త యువకులు ఆయుధాలు ధరించి రహస్య జీవితంలోకి వస్తున్నారు.

"ఒక వీరుడు మరణిస్తే నేలనుంది ప్రభవింతురు."

కవివాక్కు నిజమౌతుంది.

భారతమాత విముక్తి కోసం నేలకొరిగే ప్రతి వీరుడి మరణం మా వుద్యమానికి కొత్త వూపిరి పోస్తుంది. మాలో పట్టుదలను రెట్టింపు చేస్తుంది. కొత్త వీరులు పుట్టుకురావడం మాకు మరింత వుత్తేజాన్నిస్తుంది.

పోరాటం మా ప్రాణం!

మార్పు మా వూపిరి!

కాలగర్భంలో ఆరేళ్లు గడిచిపోయాయి.

* * *

ఆరోగ్యం సన్నగిల్లింది.

ఆవేశం స్థానంలో ఆలోచన చోటుచేసుకుంది.

ఏం చేసాం?

ఏం చేస్తున్నాం?

ఏం సాధించాం?

ఏం సాధించగలం?

ఆవేశం ఆలోచనని మింగేస్తుంది.

ఆలోచన వాస్తవాన్ని ముందు పెడుతుంది.

ఈవేళ ఒక భూస్వామిని చంపుతున్నాం. రేపు ఆ భూస్వామి స్థానంలో అతని వారసుడు మరొకడు తయారవుతున్నాడు. పరిస్థితులు మామూలే!

చంపవలసింది వర్గశత్రువుని కాదు.

వర్గ వ్యవస్థని.

* * *

వుద్యమం విఫలమైంది; అది నిర్వివాదాంశం!

కానీ ఎవరూ ఒప్పుకోడంలేదు.

ఎవరి ఆలోచన వారిది!

ఎవరి మార్గం వారిది!

అంతా అయోమయం! అగమ్యం!

అడవులే ఆశ్రయం!

ప్రజలకు దూరమయ్యాం!

మనిషి జీవితం డబ్బుచుట్టూ పరిభ్రమిస్తుంది.

మనిషి ఎక్కడున్నా ఏంచేస్తున్నా డబ్బు అవసరం.

గ్రామాల మీదపడి ధనికుల్ని కొల్లగొడుతున్నాం.

మామీద ప్రజలకు సానుభూతి పోయింది.

మాకు బందిపోట్లకి మధ్య బేధం మరుగై పోయింది.

* * *

ప్రపంచంలో రెండే వర్గాలు.

దోచుకునేవాడు, దోచికోబడుతున్నవాడు.

కవులలో కూడా రెండు రకాలు.

ఒకరు దోపిడిని సమర్థిస్తూ దోపిడివర్గం కొమ్ముకాస్తూ ప్రజల్ని అజ్ఞానంలో ముంచేవారు, మరొకరు దోపిడిని వ్యతిరేకించి ప్రజల్ని చైతన్యవంతం చేసేవారు.

సామాజిక పరిశీలన, చారిత్రక వాస్తవికత ప్రజాకవికి ప్రాణం.

ప్రజలని చైతన్యవంతం చెయ్యడం, సంఘటితపర్చడం ప్రజాకవి బాధ్యత.

కవి క్రాంతిదర్శి. మార్పుకి ఏది మార్గమో ఏది అమార్గమో ప్రజలకి దారిచూపే రెక్కమాను వంటివాడు.

విప్లవకవికి విప్లవికారుడుకి మధ్య వుండే ఈ విభజనగీతను విప్లవ నిర్వాహకులు చెరిపివేసారు.

దారిచూపవలసిన కవి తప్పుదారి తొక్కాడు.

"అన్నలారా! ఆకలితో చావకండి. ఆయుధాలు పట్టండి"

"భూస్వామిని చంపుదాం. భూమి మనం దున్నుదాం"

నినాదాలు కవితలయ్యాయి.

హీరోయిజంపట్ల మక్కువచూపే, ఆవేశమే కాని ఆలోచనలేని యువతరాన్ని అవి ఆకర్షించాయి.

* * *

నాలో సంఘర్షణ ప్రారంభమైంది.

విప్లవం అంటే ఏమిటి?

అదొక మహత్తరమైన గొప్ప సామాజిక మార్పు. కొంతమంది వ్యక్తులు తుపాకులు పట్టుకుని ఎక్కడో అడవుల్లో కూర్చొని ఈ మార్పుని సాధించగలరా?

సాధించలేరు. ఇప్పటివరకు జరిగిన సామాజిక పరిణామ క్రమచరిత్రలో ఎప్పుడూ ఎక్కడా కొంతమంది వ్యక్తులు కలిసి సామాజికవ్యవస్థలను మార్చిన దాఖలాలు లేవు.

చరిత్ర ఆమోదించని పుద్యమం మాది.

మేము నమ్మే మార్క్సిజం - లెనినిజం సైతం అంగీకరించని తప్పుడు విధానం మాది.

సమాజాన్నిమార్చేది, చరిత్రను నిర్మించేది కూడా శ్రామికవర్గం.

ముందువాళ్లను చైతన్యవంతంచేసి సమైక్యపర్చాలి. అప్పుడే మార్పు.

నా అభిప్రాయంతో పుద్యమకారులెవ్వరూ ఏకీభవించలేదు.

తిరోగమనవాదినని, ప్రజాద్రోహినని నిందించారు.

నాకు శంకరంమావయ్య గుర్తుకొచ్చాడు.

అప్పుడు నేను ఇలాగే అన్నాను.

ఆవేశం ఆలోచనని ఎలా నశింపజేస్తుందో ఇప్పుడు అవగతమయింది.

నేను నడిచేది దారికాదని రుజువయ్యింది.

ఆరోగ్యం చెడింది.

ఆరోగ్యం బాగుపడి తిరిగి కోలుకుంటే, ప్రజలలో పనిచేస్తూ ప్రజలను చైతన్యవంతం చెయ్యడానికి మిగిలిన జీవితం అంకితం చెయ్యాలని నిర్ధారణ చేసుకుని అడివిలోంచి బయటపడ్డాను.

* * *

జీవితంలో ఇక మళ్లీ కనిపిస్తాడో కనిపించడో అనుకుంటున్న కృష్ణ కనిపించాడన్న సంతోషం పట్టలేక, కష్టాల కడలివంటి జీవనవాహినిలో అతనెదుర్కొన్న బాధలగాధలకి హృదయం తల్లడిల్లి ఆరుణకళ్లనుండి కన్నీటి బొట్లు జలజలారాలిపడ్డాయి.

చేతిలోని కాగితాలు మడత పెట్టి వాటిని మళ్లీ యదాస్థానంలో వుంచి నిదుర పోతున్న పట్టాభివైపు తేరిపార చూసింది.

లోకమాలిన్య మెరుగని పసిపాపలా నిశ్చింతగా నిదురపోతున్నాడతను.

'భగవాన్! ఇతను త్వరగా కోలుకునేటట్లుచేసి సంపూర్ణ ఆరోగ్యాన్ని ప్రసాదించు తండ్రి.'




మనసులోనే రాముడికి మొక్కుకుంది.

అల్లాని వేడుకుంది.

వొంటిమీద శిలువ గీసుకుని ప్రభువుని ప్రార్థించింది.

తన హృదయాన్ని దోచుకున్న పట్టాబే తన బావ కృష్ణచైతన్య అన్న విషయం కలోనిజమో అర్థంకాని సందిగ్ధావస్థలోవున్న అరుణ ఆనందానికి అవధుల్లేకుండాపోయాయి.

డ్యూటీ పూర్తి చేసుకుని ఇంటికిపోవడానికి సిద్ధమవుతుండగా పట్టాభి పిలవడంతో అతని దగ్గరకి వెళ్ళింది.

అరుణమొఖంలో మునుపెన్నడూలేని నూతనోత్తేజాన్ని గమనించి "ఏమిటి విశేషం" అంటూ ఆశ్చర్యంగా చూసాడు పట్టాభి.

ఆ శుభవార్తను హస్పిటల్ రొదలో చెప్పడం ఇష్టంలేక మౌనంగా వుండిపోయింది అరుణ.

"నువ్వు నాకో చిన్న సహాయం చెయ్యాలి అరుణ"

"అందుకేకదా నేనిక్కడవున్నది. ఏమిటో చెప్పండి" అంటూ నవ్వుతూ చూసింది

పట్టాభి తనవేలునున్న వుంగరాన్ని బయటకు లాగి "దీన్ని మీరెక్కడైనా తాకట్టుపెట్టి ఒకరెండువందలు సంపాదించాలి" అంటూ అరుణకి ఇవ్వబోయాడు.

అరుణ దాన్ని తీసుకోలేదు.

"డబ్బు నాదగ్గర వుంది. రాత్రికి తెస్తానులెండి" అంది.

"అయితే దీన్ని నీదగ్గర వుంచు"

"అక్కర్లేదు. మీరు కోలుకున్న తర్వాత నాడబ్బు నాకిచ్చివేద్దురుగాని"

అలా వీల్లేదని పట్టాభి బలవంత పెట్టడంతో "అయితే నా షరతుకి మీరొప్పు కుంటేనే దీన్ని తీసుకుంటాను" అంది.

"ఏమిటో చెప్పండి"

"ఈ వుంగరం మీకింక తిరిగిఇవ్వను"

"సరే అలాగే చెయ్యండి. ఒక వేళ అది మీకే చెందుతుందేమో" అంటూ వుంగరం అరుణకి ఇవ్వబోయాడు.

అరుణ అది తీసుకోకుండా చెయ్యి పట్టాభివైపు సాచి చూపుడు వేలు చూపించింది.

పట్టాభి నవ్వుకుంటూ వుంగరం అరుణవేలికి తొడిగాడు.

ఆదేసమయంలో పట్టాభి పక్కబెడ్‌దగ్గరున్న ట్రాన్సిష్టర్‌లోంచి మంగళంపల్లి బాలమురళీకృష్ణ మంగళవాయిద్యాలు వినిపించడంతో అరుణ కన్నెహృదయంలో కోటివీణలు మ్రోగాయి.

ఆ దృశ్యంచూసి పక్కబెడ్‌దగ్గర బామ్మగారు మనసారా నవ్వుకున్నారు.

## 10

డాక్టర్ నాగార్జున వార్డంతా చూసుకుని పట్టాభి దగ్గరకు వచ్చాడు.

"గుడ్‌మార్నింగ్ డాక్టర్" అంటూ మంచంమీదలేచి కూర్చున్నాడు పట్టాభి.

"బాగున్నారా."

"అది మీరే చెప్పాలి" అంటూ రాత్రి అరుణ ఇచ్చిన రెండువందల రూపాయిలు తలగడ క్రిందనుండి తీసి నాగార్జునచేతిలో పెట్టాడు."

ఆ డబ్బు జేబులోపెట్టుకుని పదినిమిషాలుపాటు పట్టాభిని పరీక్షచేసి "సాయంత్రం ఎక్స్‌రేలు తీయించి దాన్నిబట్టి ట్రీట్‌మెంట్‌ఇస్తాను" అని చెప్పి అక్కడ్నుంచి పక్క బెడ్‌దగ్గరకి వెళ్ళాడు.

పట్టాభి పక్కబెడ్‌మీద పడుకున్న కొత్తవ్యక్తిని చూసి "కొత్తగా జాయినయ్యారా" అంటూ స్టూలుమీద కూర్చొని ఆయన కార్డుని అందుకున్నాడు.




"అవున్సార్! రాత్రి జాయినయ్యాను" అంటూ ఆ కొత్తవ్యక్తి లేచి కూర్చోబోతుంటే, ఆయన చాలా ఖరీదైన వ్యక్తని గమనించిన నాగార్జున "పర్వా లేద్సార్! పడుకోండి" అంటూ వారించాడు.

కార్డు చూడటం పూర్తిచేసి "ఓ మైగాడ్! మీకు బ్రెయిన్‌ట్యూమరా" అంటూ ఆశ్చర్యంగా చూసి "మీరు చూస్తే బాగా వున్నవారిలా కనిపిస్తున్నారు. ఇంత పెద్దరోగం పెట్టుకుని ధర్మాసుపత్రిలో జాయినయ్యారేమిటి?"

ఈ రోగానికి ప్రైవేటు నర్సింగ్‌హోమ్‌లో కంటే జనరల్ హాస్పిటల్‌లోనే అన్ని ఎక్యూప్‌మెంట్లు వుండి సరైన ట్రీట్‌మెంట్ దొరుకుతుందనే నమ్మకంతో వచ్చాను, అఫ్‌కోర్సు కాస్త డబ్బెక్కువైనా సరే."

"మీరు జనరల్ హాస్పిటల్‌కి రావడం ఇదే తొలిసారిలా వుంది, అందుకే డబ్బు ఖర్చయినా ఇక్కడ సరైన ట్రీట్‌మెంట్ దొరుకుతుందని అపోహపడు తున్నారు."

నాగార్జున మాటలకు ఆ కొత్తపేషెంటు చిన్నగా నవ్వుకుని "జనరల్ హాస్పిటల్ తీరుతెన్నులు గురించి చాలా రకాలుగా వింటుంటాం కానీ హాస్పిటల్‌లో పన్జేస్తూకూడా హాస్పిటల్ అవకతవకల్ని ఇంత ధైర్యంగా బయట పెడుతున్నారు అంటే మీ నిజాయితీని అభినందించకుండా వుండలేకపోతున్నాను" అని ఒక చిన్న కాంప్లిమెంట్ పారెయ్యడంతో డాక్టర్ నాగార్జున వుబ్బితబ్బిబ్బయిపోయాడు.

"సార్ మీ బ్రెయిన్‌ట్యూమర్‌కి సరైన వైద్యం లభించాలంటే ఈ హాస్పిటల్ పక్కనే నా ఫ్రెండు ప్రైవేటు నర్సింగుహోమ్ ఒకటి వుంది. నేను లెటరు వ్రాసిస్తాను. అందులో జాయినవ్వండి. అవ్‌కోర్సు, మందులన్నీ ఇక్కడివే అనుకోండి. అవసరమైతే నేనుకూడా వచ్చి చూసిపోతుంటాను."

"థాంక్స్ డాక్టర్" అంటూ ఆ కొత్తవ్యక్తి కోటుజేబులోంచి విజిటింగ్ కార్డుతీసి నాగార్జున చేతిలో పెట్టాడు.

ఆ విజిటింగ్ కార్డులోని అడ్రసు చదవగానే అప్పటివరకు నవ్వుతున్న నాగార్జునమొఖం నెత్తురుచుక్క లేకుండా పాలిపోయింది.

"మిస్టర్ నాగార్జునః ఆ డబ్బు ఇలా ఇవ్వండి."

"ఏ డబ్బు" నాగార్జున గొంతు వొణికింది.

"అదే మీరు పట్టాభిదగ్గర తీసుకున్న రెండువందలూను."

వొణుకుతున్న చేతులతో జేబులోంచి రెండు వందకాగితాలు తీసి ఆయన చేతుల్లో పెట్టాడు.

అప్పటివరకు బయటనించున్న ఇద్దరు కానిస్టేబుల్స్ లోనికివచ్చారు.

"అవినీతి నిరోధక చట్టంక్రింద నిన్ను అరెస్టుచేస్తున్నాం డాక్టర్" అంటూ కానిస్టేబుల్స్‌వైపు చూసాడు ఆయన.

నాగార్జున అంతమందిలోను సిగ్గుతో తలదించుకున్నాడు.

"మిస్టర్ నాగార్జునః ప్రభుత్వానికి ప్రజలకి మధ్య వారధిలాంటివారు ప్రభుత్వోద్యోగులు-ప్రభుత్వం కల్పించే సౌకర్యాలను ప్రజలకు అందజేయడంలో అధికారదుర్వినియోగం చేయడమనేది ప్రజాద్రోహం. ఒకరకంగా దేశద్రోహం కూడాను. దేవుడి తర్వాత దేవుడిగా భావించబడే మీలాంటి డాక్టర్లు కూడా ఈ రకమైన అవినీతికి పాల్పడటం ఎంతమాత్రం క్షమించరాని నేరం" అంటూ పట్టాభి దగ్గరకువచ్చి "మిస్టర్ పట్టాభిః మీలాంటివారు నూటికి ఒక్కరున్నా నమాజంలో ఇప్పుడున్న అవినీతిని చాలావరకు నశింపచెయ్యవచ్చు" అంటూ అక్కడ్నుంచి కదిలాడు. నాగార్జునని తీసుకుని కానిస్టేబుల్స్ ఆయన్ని అనుసరించారు.

వార్డులో వున్న పేషెంట్లు అందరు పట్టాభివైపు భక్తిభావంతో చూసారు.

పట్టాభి తలదించుకుని తన బెడ్‌వైపు నడిచాడు.

రెండురోజులక్రితం పట్టాభి తనను టెలిఫోను డైరెక్టరీ ఎందుకు అడిగాడో ఇప్పుడు అర్థమైంది అరుణకు.




'అవినీతికి అవకాశాలు కల్పించే ఈ సామాజికవ్యవస్థే అవినీతి నిర్మూలనకి కూడా మార్గలు చూపెడుతుంది. వాటిని వినియోగించుకోడం మన చేతుల్లోనేవుంది' అని మనసులో అనుకుంటూ అక్కడ్నుంచి కదిలింది అరుణ.

## 11

"హలో కృష్ణచైతన్యగారు!"

తోటలో వెన్నెట్లో సిమెంటుబెంచీమీద కూర్చుని అరుణ గురించే ఆలోచిస్తున్న పట్టాభి వులిక్కిపడి చూసాడు.

"ఏమిటి, అంత కంగారుపడ్డారు" పట్టాభి అదురుపాటుకి నవ్వుకుంటూ అంది అరుణ.

"కృష్ణచైతన్య ఎవరు" అర్థంకానట్లు చూసాడు పట్టాభి.

ఇప్పుడు వులిక్కిపడటం అరుణ వంతయింది.

కొంపతీసి ఇతను కృష్ణచైతన్య కాదా అనుకుంటూ "మనసిచ్చిన ఆడదాని దగ్గర కూడా మాయామాటలేనా" అంది.

"నువ్వేం మాట్లడుతున్నావో నా కర్థంకావడంలేదు అరుణ"

గాలితీసిన బుడగలా అయిపోయింది అరుణ పరిస్థితి.

"నామీద ఏమాత్రం ప్రేమవున్నా దయచేసి మీరెవరో నిజం చెప్పండి"

అరుణ ప్రాధేయపడుతున్నట్లు అడగటంతో ఆశ్చర్యంగా "నా గురించి నీ కెలా తెలుసు" అన్నాడు.

ఆ మాటలకు అరుణ తేలిగ్గా వూపిరిపీల్చుకుంది.

"మీ అనుమతి లేకుండా మీ తలగడ క్రింద కాగితాలు తీసి చదివాను. నన్ను క్షమించండి."

"ఓహో అదా సంగతి" అని తేలిగ్గా వూపిరిపీల్చుకుని "నా సంగతి నీకెలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాను. నా కా శ్రమలేకుండా చేసావు" అన్నాడు.

"అయితే నాతో వివాహానికి మీకేరకమైన అభ్యంతరం లేనట్లేనా"

"ఈ ప్రశ్న నేను వెయ్యవలసింది అరుణ."

"మన ఇద్దరి ప్రశ్నలకికూడా సమాధానం మీరు చెప్పేదాంట్లోనే వుంది."

"నాతో వివాహం నీ కేరకమైన ఆనందం ఇవ్వలేదు సరికదా కోరి కొత్త కష్టాలు కొనితెచ్చుకున్నదాని వవుతావు"

"స్త్రీకి కోరుకున్న భర్త లభించడంకంటె గొప్పవరం మరొకటుండదండి. ఇక పోతే, కష్టాలంటారా? మీతో జీవితం పంచుకొవడంకోసం ఏ కష్టాలనెదుర్కొడానికైనా సంతోషంగా సిద్ధపడతాను."

"నా కథంతా నీకు పూర్తిగా తెలుసు. ఇకముందు జీవితమంతా కూడ నాపేరు నేనే చెప్పుకోడానికి వీల్లేని దొంగబ్రతుకు బ్రతకవలసినవాడ్ని. వుద్యోగమా లేదు. ఇకముందు వస్తుందనే ఆశ లేదు. ఏ రకంగా చూసిన నాతో వివాహం నీకు నరకప్రాయమే. బాగా ఆలోచించుకో అరుణ."

"అన్నీ ఆలోచించుకునే ఈ నిర్ణయానికి వచ్చాను."

"సరే నీ ఇష్టం."

అరుణ కళ్లల్లో మెరుపు మెరిసింది.

ఆ మెరుపు పట్టాభి మనసుకి ఎంతో తృప్తినిచ్చింది.

"ఒకవేళ మన పెళ్లయిన తర్వాత మీ మరదలు తార వచ్చి "బావా నా సంగ ఏంజేసావు" అని అడిగితే ఏంజేస్తారు."

"అసూయ ముందుపుట్టి ఆడది తర్వాత పుట్టింది అంటారు. ఒకవే తారే కనుక రావడం జరిగితే నీతోపాటే ఆవిడికూడా ఒక తాళికట్టేస్తాను" అ నవ్వుతూ చూసాడు

అరుణ కూడా అతని నవ్వులో శృతికలిపింది.

... ఎలా వుంటుందో నాకు తెలియదు. నే నెలా వుంటానో తారకు తెలియదు. ఒకవేళ పక్కపక్కనే వున్నా ఆవిడెవరో నాకు, నేనెవరో ఆవిడకు తెలియని దుస్థితి. నేను ఫలానా అని తారకు, తార ఫలానా అని నాకు తెలియజేసే ఒక వ్యక్తి మేరీ అత్త. ఆవిడిప్పుడెక్కడుందో, ఏంజేస్తుందో, అసలు బ్రతికే వుందో కాలంచేసిందో కూడా తెలియదు."

అలా అంటున్నప్పుడు అతని గొంతు విషాదంతో జీరపోయింది. అప్పటి వరకు నవ్వుతున్న అరుణకి ఆ సమయంలో దుఃఖమాగిందికాదు.

వెక్కి వెక్కి ఏడుస్తున్న అరుణనుచూసి చాలా ఆశ్చర్యపోయాడు పట్టాభి.

"నా గురించి నువ్వు బాధపడుతున్నావా అరుణ! అసలు నేనంటే నీ కెందు కింత ప్రేమ."

"నీ మేరిఅత్త కూతుర్ని నేనే బావా" దుఃఖాన్ని దిగమింగుకుంటూ అంది.

పట్టాభి నమ్మలేనట్లు చూసాడు.

"మా అత్త కూతురు పేరు తార, అరుణ."

"ఆ అరుణతారని నేనే బావా."

జీవితంనుండే కథలు పుడతాయి; కాస్త కల్పనతోటి. కాని, కృష్ణచైతన్య జీవితం మొదట్నుంచికూడా నమ్మశక్యంగాని అభూతకల్పనల కథలా కొనసాగింది. ఎలాగుంటుందో, ఎక్కడుంటుందో, అసలు వుందో లేదోకూడా తెలియని తార తనకి కనిపించాలని ఆశించాడే తప్ప, తప్పనిసరిగా కనిపిస్తుందని మాత్రం మనస్ఫూర్తిగా విశ్వసించలేకపోయాడు. అందుకే, ఈ అరుణే తన అత్తకూతురు తార అన్న విషయం తెలిసి పట్టలేనిసంతోషం మరోక్షణంలో విషాదంగా మారిపోతుందేమోనన్న భయంతో "నిజంగా నువ్వు నా తారవేనా" అన్నాడు వొణుకుతున్న కంఠంతో.

"హృదయాన్ని దోసిళ్ళలోవుంచి ఇంతకాలం నిరీక్షిస్తూ బ్రతుకుతున్నది నువ్వు కనిపిస్తావేమోనన్న ఆశతోనే బావా."

"తారా! నిజంగా నేనెంత అదృష్టవంతుడ్ని."

పట్టలేని సంతోషంతో పట్టాభి వురఫ్ కృష్ణచైతన్య తన రెండు చేతుల్లోకి అరుణతారను తీసుకుని ఆకాశంలోకి ఎత్తి గువ్వను తిప్పినట్లు తిప్పి తన హృదయానికి హత్తుకున్నాడు.

ఆ ఆనందసమయంలో, నింగి నేల కలిసే రమ్య భ్రమామార్గంలో విహరిస్తున్నవాళ్లు, అప్పటివరకు పొదలమాటున నిలబడి వాళ్ల సంభాషణలు విని అక్కడ్నించి కదలి వెళ్లిపోయిన డాక్టర్ శ్రీహరిని గుర్తించలేదు.

## 12

వెండిజలతారు వెన్నెల చీరకట్టుకున్న ఆకాశబాల నవవధువులా వుంది. వెన్నెట్లో తోట వసంతరాగం వినిపిస్తుంది అరుణ హృదయంలాగ.

అరుణ వొడిలో తలపెట్టుకుని ఆకాశంలో జాబిలివైపు చూస్తూ అరుణ చెప్పే విషయాలు వింటున్నాడు కృష్ణ చైతన్య.

"....మీరు హాస్పిటల్‌లో వున్నప్పుడు మీ విషయాలన్నీ తెలియజేస్తూ వుత్తరాలు రాస్తుండేది అమ్మ. అప్పుడు నాకు పరీక్షలు. పరీక్షలు అయిపోయిన తర్వాత వేసవిశలవులకు విశాఖపట్నం మీదగ్గరకు రావాలనుకున్నాము. ఈ లోపునే అమ్మకి ట్రాన్స్‌ఫరుకావడం,ఆరెండో రోజునే ఆ దారుణం జరిగిపోవడం జరిగింది. అమ్మ మళ్లీమీకోసం విశాఖపట్నం వచ్చినప్పుడుగాని ఆ విషయంమాకు తెలియలేదు అ తర్వాత మా అమ్మ నీకోసమని మీవూరు వచ్చేటప్పటికి నువ్వు నక్సలైట్లలో కలిసిపోయి రహస్యజీవితంలోకి వెళ్లిపోవడం జరిగింది."

"ఆ తర్వాత రెండేళ్లకి మా అమ్మ నాగురించి బెంగతో నే కన్ను మూసింది."

కృష్ణ చైతన్య ఆలకిస్తున్నాడు.

అరుణ ఇంక ఏదో చెప్పబోతుంది. ఇంతలో,

"హేండ్సాప్ మిష్టర్ కృష్ణచైతన్య.? కదిలితే కాల్చేస్తాం" అన్నమాటలు వినిపించడంతో ఇద్దరు వులిక్కిపడి ఈ లోకంలోకి వచ్చారు.

గురిపెట్టబడిన తుపాకులతో వాళ్లిద్దరిచుట్టూ పోలీసులు దడికట్టి నించున్నారు.

కృష్ణచైతన్యకి ఏంచెయ్యాలో పాలుపోలేదు.

కృష్ణకి ఏ అపాయం వాటిల్లుతుందోనన్న భయంతోటి నిలువెల్లా వొణికి పోతుంది అరుణ.

"నువ్వేం కంగారుపడకు అరుణ. మళ్లీ తొందరలో తిరిగివచ్చేస్తాను. అనిచెప్పి పోలీసులకి లొంగిపోయాడు కృష్ణచైతన్య.

ఆరేళ్లపాటు పోలీసుశాఖను ప్రభుత్వాన్ని ముప్పుతిప్పలు పెట్టిన భయంకర నక్సలైటునాయకుడు అంత సులువుగా లొంగిపోవడం పోలీసులను ఆశ్చర్యంలో ముంచెత్తింది.

పోలీసులు తీసుకుపోతున్న కృష్ణచైతన్య వైపు అచేతనంగా చూస్తూవుండి పోయింది అరుణ.

*    *

ఆ మరునాడు వుదయం పేపర్లో—

"శ్రీకాకుళం అడవుల్లో పోలీసులకి నక్సలైట్లకి మధ్య జరిగిన తుపాకీ కాల్పుల్లో ప్రముఖ నక్సలైటు నాయకుడు కృష్ణచైతన్య మృతి" అన్న వార్త చదివి నిలువునా కుప్పకూలిపోయింది అరుణతార.



# కాకులు అరుస్తున్నాయి

పొట్లూరు
సుబ్రహ్మణ్యం



ఇంటి ముందు కాకులు గోలగా అరుస్తున్నాయి. గుంపుగా చేరి ఏవో రహస్యాలు చెప్పుకొంటున్నట్లు ముక్కుకు ముక్కు ఆనించి మరీ అరుస్తున్నాయి. కాకి భాష మనుష్యులకు అర్థంకాదని కాబోలు పెద్దగా చెప్పుకొంటున్నాయేమో. ఇంటిముందు వరండాలో పిల్లలకు ట్యూషను చెబుతున్న

రాజారావుకు విసుగ్గా ఉంది. కాకిగోల అనుకొన్నాడు. వెళ్తాయేమోనని పాఠం ఆపి ఒక అయిదు నిముషాలు చూసాడు. కాని వాటిధ్యాస వాటిది. ఏమాత్రం ఖాతరు చేయకుండా కావుకావుమని అరుస్తూనే ఉన్నాయి. రాజారావు విద్యార్థులవైపు దృష్టిసారించాడు దాని భావం అర్థం అయినట్లుగా ఒక విద్యార్థి వెళ్ళి కాకుల్ని దూరంగా తరిమాడు. అవి ఎగిరిపోయాయి.

"సార్! ఇలా కాకులరిస్తే ఏదో అరిష్టం జరుగుందట. మా అమ్మమ్మ చెప్పింది" కాకుల్ని తరిమివచ్చిన విద్యార్థి వినయంగా చెప్పాడు, రాజారావు దగ్గర కొచ్చి.

"ఏడిసావ్. వెళ్ళి కూర్చో."

ఆ కుర్రవాడు ముఖం చిన్నబుచ్చుకొని వెళ్ళాడు. రాజారావు పుస్తకం తెరిచి పాఠం చెప్పబోతుండగా పరుగెత్తుకు వచ్చాడు మురళీ. వాడికి పదేళ్ళ వయిసుంటుంది. మనిషెందుకో వణకుతున్నాడు.

"మావయ్యా! మావయ్యా ప్రమాదం జరిగింది. మా అమ్మ బావిలో పడింది" అదుర్దాగా చెప్పాడు.

రాజారావు గుండె ఒక్కసారి ఆగి కొట్టుకోసాగింది "అయితే... అయితే.." అని మాత్రమే అనగలిగాడు. ఇంకేం మాట్లాడలేకపోయాడు.

"ప్రక్కింటి నాగభూషణం అన్నయ్య వాళ్ళు బావిలో దూకి అమ్మని తీసారు. ఇప్పుడు బయట మంచంమీద పడుకో బెట్టి నీళ్ళు కక్కిస్తున్నారు"

దాంతో రాజారావుకు కొంత ధైర్యం వచ్చింది, "ఇప్పుడేం ప్రమాదంలేదు కదా" అని అడిగాడు.

"మరేం ఫరవాలేదంటున్నా రంతా. డాక్టరుకోసం అన్నయ్య వెళ్ళాడు. మీకు చెప్పమని నన్ను పంపాడు" ఆయాసం తీర్చుకొంటున్నాడు మురళీ.

రాజారావు వెంటనే పిల్లల్ని ఆ రోజుకు వెళ్ళమని చెప్పి, ఇంట్లోకి వెళ్ళి భార్యకు విషయమంతా చెప్పాడు. ఆమె చేతిలోనిపని కూతుర్లకు ఒప్పజెప్పి హడావుడిగా బయలుదేరింది. ఇద్దరు దంపతులూ మురళిని వెంటబెట్టుకొని వాళ్ళింటికి బయలుదేరారు.

రాజారావు మనసంతా ఆలోచనలతో నిండిపోయింది. వసుంధర బావిలో ఎలా పడుంటుంది! నీళ్ళు తోడుతూ తాడు జారి పడిందా. తాడు జారితే చేద బావిలో పడాలిగాని ఆమె ఎందుకు పడుతుంది. లేక గట్టుమీద ఎక్కి బాదంఆకులో మరేవయినా కోస్తుంటే కాలుజారిపడిందా? ఆలోచనలు తెగడం లేదు ఈ సందేహంతో.

ఆమెకు తాము బంధువులు కాకపోయినా ఆమె భర్త సత్యనారాయణ తన తోటి టీచరు. సహృదయుడు. అతని పత్నిగా వచ్చిన నాటినుండి వసుంధరను కూడా తన చెల్లెలుగా

స్వీకరించాడు రాజారావు. తన వయసును గౌరవించో లేక స్నేహానికి విలువనిచ్చో తన సలహా లేందే ముందుకు కదలరు. తనూ అంతే.తనకుటుంబ విషయాల్లోనూ వాళ్ళు జోక్యం చేసుకొంటూంటారు. అందుకే ఏ ఇబ్బందివచ్చినా ఒకరి కొకరు దిక్కు.

రాజారావు దంపతులు ఇంటికొచ్చే సరికి ఇంటిముందు జనం పల్చగా ఉన్నారు. ఇంతలో డాక్టరు వచ్చాడు. ఒక ఇంజెక్షనిచ్చి, ఏవో కొన్ని టాబ్లెట్లు వ్రాసిచ్చాడు.ఆమెకుబాగా గాలి తగలాలని, విశ్రాంతిని మించిన వైద్యం లేదని, భయపడవద్దని చెప్పి వెళ్ళి పోయాడు.

రాజారావు భార్య అక్కడే ఆ రోజంతా ఉండిపోవాలనుకొని పిల్లల్ని స్కూలుకు వెళ్ళనుంది. రాజారావు కూడా ఆరోజుకు సెలవుపెట్టాడు.సత్యనారాయణ ఏదో ఊరికిపోవాలని రెండురోజులు సెలవు పెట్టాడు. అతనుంటే ఈ దుర్ఘటన జరిగేదికాదేమో అనుకొన్నాడురాజారావు.

వసుంధర తేరుకొన్న తరువాత అడిగాడు. "అమ్మా ఒంట్లో ఎలా ఉంది. సత్యనారాయణ ఊరునించి ఇంకా రాలేదా?"

ఆమె గుండెల్లోంచి దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది. చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. రాజారావుకు పరిస్థితి ఏమీ అర్థంకాలేదు.

"సత్యనారాయణ కేమయింది?" అడిగాడు అదుర్దాగా.

"ఆయనకేం జరగలేదు. జరిగిన అన్యాయం నాకే" కళ్ళు తుడుచుకొంటూ చెప్పింది.

"ఏమిటమ్మా అదుర్దా. డాక్టరు ఫరవా లేదన్నాడుగా. అసలింతకూ ఎలాజరిగింది బావిగట్టుమీద నిలబడి ఏవైనా కోస్తూంటే కాలుజారిందా?"

"కాలు జారిపడలేదు అన్నయ్యా! నేనే చావాలని బావిలో దూకేను. చావక పోవడం నా ఖర్మ" అంది ఏడుస్తూ. తరువాత క్రమేణా తన కడుపులోని బాధనంతా వెళ్ళగక్కింది.

"అన్నయ్యా! ఇంత జరిగిన తరువాత నేనెందుకు బ్రతకాలి. ఆయనంటే నాకెంత అభిమానమో నీకు తెలియంది కాదు" ముఖం పిండులో దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. ఈ విషయం విన్న తరువాత రాజారావు భార్యకుకూడా మనసు మొద్దుబారిపోయింది. ఇంత జరుగుతున్నా వసుంధర తన కెందుకు చెప్పలేదు. ఆడవాళ్ళు సిగ్గువిడచి ఇటు వంటి విషయాలు ఎవరికీ చెప్పుకోరేమో అనుకొన్నాడు రాజారావు.

సత్యనారాయణ స్కూల్లో తన తోటి టీచరు విమల వలలోపడి ఇంటికి రావడం లేదా. ఈ రెండురోజులుఎక్కడికో పోవాలని సెలవుపెట్టి విమల ఇంట్లో గడుపుతున్నాడా. రాజారావుకు కడుపులో

దేవినట్లయింది. ఆయనకు నమ్మబుద్ధి పుట్టడంలేదు.

"ఇవన్నీ నీ కెవరు చెప్పారమ్మా" అనడిగాడు లాలనగా.

"ఎవరు చెప్పడమేమిటి అన్నయ్యా ఇది చాలారోజులుగా జరుగుతుందట. ప్రక్కింటి పార్వతమ్మ, బాంకులో పని చేసే సత్యవతి 'మీ ఆయన ఎవరో అమ్మాయిని వెంటేసుకుని రోజూ పార్కుల్లో తిరుగుతుంటాడమ్మా, అని ఎప్పట్నుంచో చెబుతున్నారు కాని నేను నమ్మలా. అయితే ఈరోజు ఉదయం సత్యవతి మా ఇంటికివచ్చి, పసుందని సెలవుపెట్టి విజయవాడకు పోయాడని చెప్పావే మీ ఆయన, ఇప్పుడు హిందీ టీచరు విమల ఇంట్లో ఉండే చూసా'నని చెప్పింది. దాంతో మన మురళిని పంపాను. వాడు వీధివాకిట్లోంచి చూస్తే, ఆయన, విమల ఎదురెదురుగా కూర్చొని నవ్వుకొంటున్నారట. అంతే వాడు పరుగెత్తుకు వచ్చి నాకీ విషయం చెప్పాడు" ఏడవడం మొదలుపెట్టింది వసుంధర.

సత్యనారాయణ విశాల హృదయం తనకు తెలుసు. ఏ పరిస్థితుల్లో వసుంధరను చేసుకున్నాడో కూడా తెలుసు. తన స్వంతఊరు ఇదే కావడంతో వసుంధర కుటుంబం చరిత్ర తెలుసు. వసుంధర తల్లి వసుంధరకు పదేళ్ళప్రాయంలో ఇంకొకడితో లేచిపోయింది. వసుంధర తండ్రి మరల పెళ్ళి చేసుకోలేదు. వసుంధర యుక్తవయసు వచ్చేసరికి చాల అందగత్తెగా తయారయింది. ఆమె అందం చూసి యువకులు పెళ్ళిచూపులకు రావడం, లేచిపోయినదాని కూతురని తెలియగానే వెళ్ళిపోవడం జరుగుతూండేది. ఈ పరిస్థితిలో ఆ ఇంటి ప్రక్కనే గది అద్దెకు తీసుకొన్న సత్యనారాయణ మొదటి చూపులోనే ఆమెని ప్రేమించాడు. ఎంతమంది చెప్పినా వినక ఆమెనే చేసుకొన్నాడు. లోకుల కారుకూతలు విని భరించలేని భార్య కోసం అతను ఇష్టంలేకున్నా వేరేచోటుకు ట్రాన్స్ఫరు పెట్టుకొన్నాడు. అలా పన్నెండేళ్ళు ఊళ్ళుపట్టుకు తిరిగాడు. కాని ఈ లోపల వసుంధర తండ్రి మరణించడంతో మళ్ళీ ఇదే ఊరికి ట్రాన్స్ఫరు చేయించుకొని మామగారి ఇంట్లో ఉండవలసి వచ్చింది. ఒకప్పుడు కారుకూతలు కూసిన లోకం ఈనాడు భర్త, పిల్లలతో వచ్చిన వసుంధరను చూసి జోక మూడిచారు లోకం నైజం అంతే. భయపడినవాళ్ళ వెంట తరుముతారు, ఎదురు తిరిగి నిలబడినవాడు వెంట తరిమినవారే వెనుక్కు తిరుగుతారు. అంతేకాక లేమ రక్షణకోసం ఇంద్రుడు చంద్రుడు అని ముఖస్తుతి కూడా చేస్తారు. ఇప్పటి పరిస్థితి అదే.

ఇక హిందీ టీచరు విమల సంగతి. ఆమె చాల అందమైనది. నెమ్మదస్తురాలు. వివాహం కాలేదు. ఎప్పుడూ సమస్యల

వలయంలో చిక్కుకునట్లుంటుది. సహజంగా కష్టాల్లో ఉండేవాళ్ళని ఓదార్చే అలవాటున్న సత్యనారాయణ ఆమెకు చేరువయ్యాడు. సత్యనారాయణ అంటే ఆమెకు అదొక రకమయిన అభిమాన మేర్పడింది. తన కడుపులోని దుఃఖాన్ని అతని దగ్గర వెళ్ళగక్కేది. దాంతో వసుంధర కష్టాల్ని ఆదుకోవడం తన విధి అనుకొన్నాడు సత్యనారాయణ. రెండు సంవత్సరాలనుంచి వాళ్ళస్నేహం అలా జరుగుతోంది. వాళ్ళ స్నేహంలో ఏ మాత్రమూ చెడు కనిపించలేదు తనకు.

అందుకే నిష్కల్మషంగా ఉండే సత్యనారాయణ, బేలగా కనిపించే విమల ఇంతగా తెగించారంటేనే బాధగానూ, కోపంగానూ ఉంది రాజారావుకి.

విమల ఇంట్లో కుర్చీలో కూర్చొని కాఫీ త్రాగుతున్న సత్యనారాయణ రాజారావును ఆహ్వానించి కూర్చోబెట్టాడు. విమల అయనకు నమస్కరించి చిరునవ్వుతో కాఫీగ్లాసు అందించింది. వాళ్ళ చర్యలకు కోపంతో ఉడికిపోతున్న రాజారావు, సత్యనారాయణ చెప్పింది విని అక్కడి పరిస్థితులను అకళింపు చేసుకొన్న తరువాత, సత్యనారాయణ వ్యక్తిత్వం ముందు తాను గడ్డిపోచ ననుకొన్నాడు. విమల శిరస్సున చేయించి ఆశీర్వదించేంత వరకు ఆయన మనసు ఆగలేదు. సత్యనారాయణను విమలను చెడామడా నాలుగు చీవాట్లేసి బుద్ధిచెప్పాలని వచ్చిన రాజారావు తను అలాంటి ఆలోచనలు పెట్టుకొని విమల ఇంటికి వచ్చినందుకు ఇప్పుడు సిగ్గుపడుతున్నాడు. వసుంధర బావిలో దూకిన విషయం బయట పెట్టలేదు రాజారావు.

రాజారావు తిరిగివచ్చేసరికి వసుంధర మంచంమీద కూర్చొని ఎదురు కుర్చీలో కూర్చొని ఉన్న రాజారావు భార్యకు ఏదో చెబుతూ కళ్ళు తుడుచుకొంటోంది. వసుంధర ఈ మధ్య సమయంలో బాగా తేరుకొంది. రాజారావును చూసి ఇద్దరూ లేచి నిల్చున్నారు.

"అమ్మా వసుంధరా. త్వరగా బయలు దేరమ్మా మనం వెళ్ళాలి."

"ఎక్కడికి అంది వసుంధర ఏదో చేస్తాడని పంపిస్తే ఏదో చేసుకొనివచ్చా డన్నట్లు తనను ఎక్కడికో బయలు దేరమంటున్నాడు. అసలు విషయం చెప్పకుండా అనుకొంది.

"విమల ఇంటికి"

"దాని ఇంటికా" వసుంధర కళ్ళు తీక్షణంగా మారాయి. "అన్నయ్యా నువ్వేదో దాన్ని నాలుగు మాటలడిగి విషయం తేల్చుకోమంటే నన్నే దాని ఇంటికి రమ్మంటావా. నేను దాని ఇంటికి రాను. అవసరమయితే నా శవమే వస్తుంది అక్కడికి" గోడనానుకొని వెక్కివెక్కి ఏడ్చింది వసుంధర.

అప్పటివరకు ఏమీ అర్థంకాక ప్రేక్షకురాలిలా చూస్తున్న రాజారావు భార్య

"ఛీ! ఏమిటమ్మా పాడు మాటలు...." అంటూ మందలించింది.

"అయితే వదినా. నా కింత అన్యాయం చేసిన దానిఇంటికి నన్నే రమ్మనడం ఏం న్యాయం. నువ్వే చెప్పు."

"వసుంధరా నా మాటవిను ఇందులో అవమానం పొందేది ఏమీలేదు. నువ్వు అక్కడికి రా. నామీద గౌరవంఉంటే నా మాట విను."

"నీ మాట ఎప్పుడు వినలేదు అన్నయ్యా. నా చిన్నతనంనుంచీ నన్ను నువ్వేరుగుదువు. మా మంచిచెడ్డల్లో, మాకష్టసుఖాల్లో మాకు అప్పుడివి, తండ్రివి అన్నీ నువ్వే కాని ఇట్లాంటి విషయాల్లో ఏ ఆడదీ తండ్రి మాట కాదుకదా దేవుడి మాటకూడా వినదు"

"నాకు తెలుసు వసుంధరా ఆడదాని మనసు. చూస్తూ చూస్తూ తన భర్తను ఇంకొకరికి అర్పించుకోలేదు. కాని ఈ ఒక్క విషయంలో నా మాట విని నాతోరా. అతనిది తప్పయితే నీముందే అతన్ని చీవాట్లేస్తాను."

"అంత బ్రతిమాలాల్సిన అవసరం లేదు అన్నయ్యా. నేనువస్తాను. అయితే ఆయన్ను నా ముందు తిట్టకండి. ఎంత తప్పుచేసినా ఆయన నా భర్త నా ముందు ఆయన్ను మందలించడంవల్ల నాకు గౌరవం ఏముంటుంది."

రాజారావు నవ్వుకొన్నాడు. ఇంత తెలివిగలది, భర్తమీద ఇంత ప్రేమగలది నిజంతెలిస్తే ఏమవుతుందో అనుకొన్నాడు.

"సరే ఇక బయలుదేరు. మీ వదిన ఇంట్లో ఉంటుందిలే" అన్నాడు. వసుంధర తల సరిచేసుకొని. చీర మార్చుకొని ఏదో నిశ్చయానికి వచ్చినదానిలా బయలు దేరింది.

విమల ఇంటిముందు రిక్షాలు దిగే సరికి, విమల వీళ్ళకోసమే ఎదురు చూస్తున్నట్లుగా బయట గుమ్మందగ్గరే నిలబడి ఉంది. సన్నగా, నాజూగ్గా, పొడవుగా ఉంది. తెల్లని శరీరచ్ఛాయ. విశాలమైన కళ్ళు, కోటేరులాంటి ముక్కు రెండు చేతులకు నిండుగా సాదాగాజులు. వాయిల్ చీర, కాటన్ జాకెట్టు ధరించి ఉంది. వసుంధర చూపులు త్రిప్పుకోలేక పోయింది. ఇంత అందగత్తె కనుకనే ఆయన్ను తేలిగ్గా వల్లో వేసుకొంది. ఆడవాళ్ళకే ఇలా ఉంటే. మగవాళ్ళకు ఇంకెలా ఉండాలి అనుకొంది.

"లోపలికి రా అక్కా" అంటూ ఎంతో చనువుగా వసుంధరచేయి పట్టుకొంది.

'ఛీ... దరిద్రపుముండ, వరుసకలుపుతోంది. విడిచింది వీధికి పెద్ద అన్నారు. దీనికి సిగ్గేమిటి! అనుకొన్నవాళ్ళు సిగ్గుపడాలిగాని' మనసులో తిట్టుకొంటూనే ఆమెను అనుసరించింది. ప్రక్కన రాజారావు ఉండటంతో ఏం మాట్లాడాలన్నా ఆమెకు భయంగా ఉంది. విమల చేతి స్పర్శ కంపరమెత్తుతున్నా మౌనంగా రాజారావు వెనుకనే హాల్లోకి నడిచింది వసుంధర.

రాజారావు హాల్లో కుడివైపు గది కర్టెన్ తొలగించి "అదుగోనమ్మా మీ ఆయన. వెళ్ళి మాట్లాడు" అన్నాడు. ఆ దృశ్యాన్ని చూసి కెవ్వున అరచింది వసుంధర. సత్యనారాయణ మంచంమీద కూర్చొని ఉన్న కుష్టువ్యాధిగ్రస్తురాలకి గ్లాసుతో మందు త్రాగిస్తున్నాడు. కుష్టువ్యాధిగ్రస్తురాలు శరీరమంతా కురుపులతో అసహ్యంగా ఉంది. సత్యనారాయణ మందు త్రాగించిడం పూర్తి చేసి, ఆమెకు సమీపంలో ఉన్న కుర్చీలో కూర్చొన్నాడు.

"ఏమండీ! దూరంగా వచ్చేయండి. మనం పిల్లలుగలవాళ్ళమండీ. అది మనకు అంటుకొంటుందండీ" బిగ్గరగా అంది వసుంధర అన్నీ మరచిపోయి.

ఆమె వెనకవైపు దిండ్లొకసారి సరిచేసి కూర్చోబెట్టి, "అదే మీ అమ్మాయితే ఆ మాట అనగలవా" అన్నాడు సత్యనారాయణ భార్యవైపు నవ్వుతూ చూస్తూ.

"మా అమ్మా! ఆమెకు ఇలాంటి ఖర్మ ఎందుకుపడుతుంది" కంగారుగా అంది వసుంధర.

"అవును, ఈమె మీ అమ్మ! విమల నీ చెల్లెలు."

"ఏమిటండీ మీరు మాట్లాడేది. ఈమె నా అమ్మ ఎలా అవుతుంది. నా కాపురంలో నిప్పులు చల్లిన ఇది నాకు చెల్లెలా" కోపం పెట్టుబికగా అరచింది.

"అవును. ముమ్మాటికీ."

వసుంధర కుష్టువ్యాధిగ్రస్తురాలు వైపు, విమలవైపు మార్చి మార్చి చూసింది. కుష్టువ్యాధిగ్రస్తురాలు తల తిప్పుకొంది. విమల కళ్ళలో నీళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. ముక్కుపుటాలు అదురుతున్నాయి. ఏడుపును ఎంతో నిగ్రహంతో నొక్కిపట్టినట్లు ఆమె మెడదగ్గర నరాలు తెలియజేస్తున్నాయి. మాటిమాటికీ వసుంధర వైపు చూస్తూ పిలిస్తే వళ్ళో వాలిపోవాలన్నంత ఆదుర్దాగా ఉంది. మౌనంగా చూస్తున్నాడు రాజారావు.

సత్యనారాయణ చెప్పుకుపోతున్నాడు. "విమల మా స్కూల్లో హిందీటీచరుగా చేరింది. ఆమె అందమైన ముఖంలో ఎప్పుడూ చీకటినీడలు తారట్లాడుతూ ఉండేవి. ఇంత లేత వయసులో ఈమెకు ఎన్ని కష్టాలు అనుకొన్నాను. ఆమెను ఓదార్చాలనుకొని ఆమెకు దగ్గరయ్యాను. పరిచయం పెంపొందింది. పర్యవసానంగా ఆమె తన కుటుంబ సమస్యలు నాతో చర్చించింది. నేను ఆశ్చర్యపోయాను. కారణం ఆ సమస్యలు నాకు ముడిపడి ఉండటమే. వసుంధర తల్లి, వసుంధర పదేళ్ళ ప్రాయంలో ఒక నీచుని మోసానికి గురై కాపురాన్ని కాలదన్ని వెళ్ళిపోయింది. తరువాత ఆ నీచుడి వలన ఆమెకు విమల పుట్టింది. విమల పుట్టిన కొంతకాలానికి ఆ దుర్మార్గుడు

వసుంధర తల్లిని వదలి ఎటో వెళ్ళిపోయాడు. ఆ పరిస్థితుల్లో బిడ్డను ఎన్నో కష్టాలుపడి చదివించింది. కాని దేవుడు ఆమె మీద కనికరం లేకుండా కుష్ఠు వ్యాధిని ప్రాప్తింపజేసాడు. ఇదీ విమల వెనుక చరిత్ర. ఎలాగో ఉద్యోగం దొరికిందన్న ఆనందమేగాని, ఆప్తులు లేక తన కష్టాల్ని కన్నీరుగా చేసుకొని విలపిస్తూ ఉంది. ఈ విషయం వెంటనే వసుంధరకు తెలియజేయాలనుకొన్నాను. కాని ఆమె తల్లి ఒప్పుకోలేదు. తన పెద్దకూతురు ఎడల ఎంతో ద్రోహం చేసిందని, ఇప్పుడు తనను చూస్తే ఆమె అసహ్యించుకొంటుందని భయపడింది. తను చనిపోయేముందు కడసారిగా చూస్తే చాలు అంది. విమలకూడా అక్కతో చెప్పవద్దు అంది. కారణం మీరుపిల్లా, పాపగలవారు అక్కని చూసి అక్కయ్య ఇంటికి తీసుకొనిపోవచ్చు. పిల్లలు భయపడతారు. అదీగాక వాళ్ళ ఆరోగ్య దృష్ట్యాకూడా ఇది మంచిది కాదు అంది. అందువలన నేను నా భార్యకు నిజం చెప్పలేక, ఇటు విమలను ఒంటరిగా వదలలేక రోజూ సాయంత్రం వచ్చి మా అత్తగారిని చూసి కబుర్లు చెప్పి పోతూ కాలంగడుపుతున్నాను. అంతేగాక రాజారావుగారికి కూడా ఈ విషయం తెలియనివ్వలేదు. ఇప్పుడు చెప్పండి, నేనుచేసింది తప్పంటారా?" ప్రశ్నించాడు సత్యనారాయణ.

వసుంధర గుండెల్లోంచి ఉవ్వెత్తున తన్నుకువచ్చిన దుఃఖం కట్టలుతెంచుకొని ప్రవహించింది. ఒక్కఉదుటున వెళ్ళి అమ్మా అంటూతల్లిని కౌగలించుకొంది. అప్పుడు ఆమెకు కుష్ఠువ్యాధిగాని దాని తీవ్ర పరిణామం గాని ఆమెకు అర్థం కాలేదు. ఎంతో బలవంతంమీద వసుంధరను ప్రక్కనున్న కుర్చీలో కూర్చోపెట్టగలిగాడు సత్యనారాయణ. విమల "అక్కా" అంటూ వచ్చి నేలమీద కూర్చొని అక్కవళ్ళో తలదాచుకొని బోరున ఏడ్చింది. ఒంటరిగా ఎన్నో ఏళ్ళు ఆమె పడ్డ కష్టాలకు ఫలితంగా ఇప్పుడు తనవాళ్ళంటూ కొంతమంది ఆప్తులు బంధువులు దొరికారు. అందుకే ఆమెకు అంత దుఃఖం. వసుంధర తన ఒడిలో ఉన్న చెల్లెలు తలను ప్రేమగా నిమురుతోంది. ఆమెకు ఈ లోకంలో ప్రియమైన వస్తువేదో దొరికినట్లుంది.

"తల్లీ, నన్ను క్షమిస్తావు కదూ! నేను నీకు ఒకప్పుడు చేసిన ద్రోహానికి ఈనాడు ఫలితం అనుభవిస్తున్నాను" పశ్చాత్తాప హృదయంతో అంది వసుంధరతల్లి రాజమ్మ.

"అమ్మా! అలా అనకమ్మా. ఎంతో కాలానికి కలుసుకొన్నాం. నా కెంతో ఆనందంగా ఉంది. ఇక ఈ జబ్బు అంటావా అది మన అందరి దురదృష్టం. అంతమాత్రంచేత నిన్ను వదులు కొంటామా" అంటూ అంతవరకు తననే

గమనిస్తున్న భర్తను చూసేసరికి ఆమె హృదయం ద్రవించిపోయింది.

తనలో మొలకెత్తిన అనుమానం, తద్వారా బావిలో దూకడంవంటి నీచ కార్యం చేయడం గుర్తుకొచ్చి చెల్లెల్ని విడిపించుకొని లేచి భర్తకాళ్ళదగ్గర వంగి పాదాలను కళ్ళకద్దుకొంది.

"ఛ.... ఛలే వసుంధరా. ఏమిటిది." అంటూ ఆమెను ఆప్యాయంగా లేవ నెత్తాడు సత్యనారాయణ.

"నన్ను క్షమించండి. మీమీద లేని పోని అనుమానాలు పెట్టుకొని మిమ్మల్ని అవమానించాను. దేవుడులాంటి మీరే నన్ను వివాహం చేసుకొని ఉండకపోతే ఈ స్థితిలో ఉండేదానినా" అంది కృతజ్ఞతాపూర్వకంగా,

తనను పెళ్ళి చేసుకొవడానికి ఎవరూ ముందుకు రాకపోవడం, సత్యనారాయణ చేసుకోవడం అన్నీ చెప్పడం మొదలు పెట్టింది తల్లికి.

"ఇంకేం చెప్పకు తల్లీ. అబ్బాయి ద్వారా మన కుటుంబ విషయాలన్నీ తెలుసుకొన్నాను" అంది ఆమె కూతురి వైపు ప్రేమగా చూస్తూ.

"చెల్లెమ్మా పిల్లలు స్కూలునుంచి వచ్చేటయిమయింది. నీవు కనిపించక పోతే కంగారుపడుతుంటారు" అన్నాడు రాజారావు రంగంలోకి దిగి.

"నిజమే అన్నయ్యా.అమ్మా నీ ఇద్దరు మనవళ్ళను, మనవరాల్ని తీసుకొని వస్తాను చూద్దువుగాని. నువ్వూ రా విమలా."

"ఇప్పుడొద్దులే అక్కా. అమ్మ దగ్గర ఉంటాను. బావ ద్వారా నేను అశోక్‌ను, మురళిని, జయను ఎప్పుడో చూసాను. నిన్నుకూడ. కాని నే నెవరైంది ఎవరికీ తెలియదనుకో" నవ్వుతూ అంది విమల.

సత్యనారాయణను అక్కడే ఉండమని రాజారావు, వసుంధర ఇంటికి బయలు దేరారు.

"ఏయ్ రిక్షాఅబ్బీ ఇలా రా" రిక్షా పిలు స్తున్నాడు రాజారావు

"వద్దు అన్నయ్యా.నా కిప్పుడు ఒంట్లో వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. నడిచే వెళ్దాం" అంది వసుంధర.

ఇద్దరూ నడవడం మొదలుపెట్టారు. దారిలో కాలువమీద కట్టిన వంతెనను సమీపించారు. వంతెనకు సమీపంలో కాలువగట్టుమీద కాకులు గుంపుగా చేరి అరుస్తున్నాయి.

"ఎందుకు కాకులు అలా అరు స్తున్నాయో చెప్పగలవా వసుంధరా!"

"అక్కడేదో వింత విషయం జరిగుంటుంది అన్నయ్యా!"

"సరే చూస్తాం రా" అంటూ వాటిని సమీపించి తరిమాడు. అవి ఎగిరి పోయాయి.

"ఇప్పుడేం కనిపించిదమ్మా నీకు."

"ఏమీ కనిపించలేదు."

"అంతేనమ్మా. లోకమూ అంతే. అందుకే లోకులు పలుగాకులు అన్నారు. లేని విషయాన్ని సృష్టించి దాన్ని పెద్దది చేస్తారు. చివరకు నిజం తరచి చూస్తే అక్కడ ఏమీ ఉండదు. అదే నీ విషయంలోనూ జరిగింది. సత్యవతి, పార్వతమ్మలాంటివాళ్ళు చేసిన ప్రచారం నీ మనసును విషతుల్యం చేసింది. అది ఈ సంఘంలో మనుషుల నైజం తల్లీ."

"నిజం అన్నయ్యా."

"అందుకే ఇప్పుడు మీ అమ్మను తీసుకొచ్చి నీ ఇంట్లో పెట్టుకొంటే ఇదే లోకం నిన్ను దుమ్మెత్తిపోస్తుంది" అన్నాడు రాజారావు ఉడికిస్తూ.

"హూ.... నన్ను తొమ్మిది నెలలు మోసి, అష్టకష్టాలు పడి నన్ను కన్నది ఈ లోకం కాదు. మా అమ్మ. మా అమ్మ కోసం ఈ లోకాన్ని లెక్కచేయాల్సిన అవసరం లేదు. రేసే నా చెల్లెల్ని, మా అమ్మను తీసుకొచ్చి మా దగ్గరే పెట్టుకొంటాం" అంది రోషంగా.

"అదీ మనిషికి ఆ మాత్రం ధైర్యం ఉండాలమ్మా. లేకపోతే ఈ లోకంలో బ్రతకలేం."

రాజారావు మనసిప్పుడు నిర్మలంగా ఉంది. కాకు లరిస్తే అరిష్టం అని అన్నాడొక విద్యార్థి. కాని ఇప్పుడు అరిష్టం కాదుగదా, ఒక సమస్యకు పరిష్కారం దొరికింది అనుకొన్నాడు. కాలువ ఇవతలి గట్టున లేచిపోయిన కాకులు మరల అవతలి గట్టున గుంపుగా చేరి అరుస్తున్నాయి.



# నాకు నచ్చిన నా కథ



కె. వి. యస్. వర్మ

నేను రాసిన చిన్నా, పెద్దా వంద కథలో నుంచి నాకు నచ్చిన కథను ఎంపికచేయడానికి నేనేమాత్రమూ ఇబ్బంది పడలేదు. ఈ కథ అంటే నాకెంతో ఇష్టం. బహుశా ఇది 'నాకథ' కావడం వల్లేమో, ఒక రకంగా 'యుద్ధం' కథలోని ప్రకాశరావు నేనే. అందుకేనేమో ప్రకాశరావంటే నాకు ప్రాణం. ప్రకాశరావువంటి పిల్లలన్నా నాకు చాలా మోజు. మూఢ విశ్వాసాలు, కాలం చెల్లిన సంప్రదాయాలకు సంబంధించిన స్పృహ నాకు నా పదహారో ఏట కలిగితే, ప్రకాశరావుకు ఆ చైతన్యం తన పదకొండో ఏటే కలగటమే కాకుండా, కార్యోన్ముఖుడు కూడా అయ్యాడు. అంటే అతను నాకంటే అయిదేళ్ల ముందున్నాడు. అలాగ ప్రకాశరావు నాకు హీరో అయ్యాడు.

ఓ సంవత్సరం క్రితం రాయగడలో జరిగిన ఓ సాహితీ సమావేశంలో నేను 'యుద్ధం' కథను చదివినప్పుడు ముఖ్య అతిధిగారు శివమెత్తిపోయారు. నా కథ ధ్యేయం నెరవేరుతోందని నా కప్పుడు అనిపించింది. కథకు ప్రయోజనం వుండాలని నమ్మేవాళ్లలో నేనొకణ్ని. అలాంటివారికి నాకు నచ్చిన 'నా కథ' తప్పక నచ్చుతుందని ఆశిస్తున్నాను. ఈ కథ యువజన సంచికలో ప్రచురితమైంది.

# యుద్ధం

ప్రకాశరావుకు నోరు తిరగడంలేదు. ఉదయం వేద పాఠాలలోనూ అంతే మళ్లీ ప్రయత్నించాడు. విసుగొచ్చింది. గోడమీది కేలండర్‌వంక చూశాడు. అందులోని బాబు ఎంత అందంగా వున్నాడు. అతని క్రాపు ఎంత చక్కగా వుంది!

అద్దంలో ముఖం చూసుకుందామని గబుక్కున లేచాడు. బిగించిన అంగోస్త్రం గోచీ వూడిపోయింది ఊడిపోయిన గోచీని చేత్తో చిరాగ్గా పైకిలాగి, రెండోచేత్తో గట్టిగా బిగించాడు. తర్వాత, గూటిదగ్గర కెళ్లాడు. అద్దాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు ప్రకాశరావు.

కేలండరులోని బొమ్మ ముఖంలాగానే తన ముఖమూ అందంగా కన్పించింది. అయితే మాత్రం, అంత అందమైన క్రాపు తన కేదీ! తల మీద గుండు సూదులు సగానికి దిక్కొట్టినట్టుగా వున్నాయి వెంట్రుకలు. ప్రకాశరావు ముఖాన్ని అసహ్యంగా పెట్టాడు. 'ఛీ' బాగోలేదనుకుంటూ, అప్పుడే గుర్తుకు వచ్చినట్టుగా ఒక చేత్తో అద్దం పట్టుకుని, రెండో చేయి తలమీదుగా వెనక్కు దొర్లించాడు. పిలక చేతికి తగలగానే పామును పట్టుకున్నట్టుగా ఒళ్లు జలదరించింది. ఇంకొంచెం కిందకు పోనిచ్చాడు చేతిని. పాంపదగలా ముడి. వెంటనే చెయ్యి తీసేశా అద్దాన్ని గూటిలో పెట్టబోతుండగా, ప్రకాశరావు తండ్రి కోపంగా చూస్తూ గుమ్మందగ్గర నిలబడ్డాడు.

"ఏరా ప్రకాశం. వెధవ షోకులేనా! చదువేమైనా వుందా" అన్నాడు సత్యనారాయణరావు.

పదకొండేళ్ల ప్రకాశం మాట్లాడకుండా నేలను చూస్తూ నిలుచుండిపోయాడు.

"ఈవేళ్టి పాఠం వచ్చిందా" అంటూ నేలమీద పడివున్న పుస్తకాన్ని తీశాడు సత్యనారాయణరావు.

ప్రకాశం మూగవానిలా చూస్తుండిపోయాడు.

"ఈ శ్లోకం చెప్పుచెప్పు"

"అవి చదువుదామంటే నోరు తిరగడంలేదు నాన్నా."

"జట్టీపట్టగా పట్టగా అదే తిరుగుతుందిరా వెధవా. నువ్వేమన్నా నీచు తినే శూద్రుడి వేమిటిరా నోరు తిరగకపోవడానికి."

"నేనూ పక్కింటి కాంతిలా స్కూలు కెళ్తా."

"ఏడ్చావులే స్కూలు కెళ్తాడట స్కూలుకు. ఆ స్కూలు చదువు కూడు పెట్టదురా, నాలుగు మంత్రం ముక్కలు నేర్చుకుంటే నాలుగురాళ్ల సంపాదించు కోవచ్చు నాలా. బుద్ధిగా వేదపాఠశాల కెళ్ల చదవకపోయావో నీ ఒళ్ల హూనం చేసేస్తాను గ్రత్త" అని రంకె వేశాడు సత్యనారాయణరావు.

ప్రకాశానికి కన్నీళ్లొచ్చాయి. పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు. సత్య నారాయణరావు ముక్కుపొడుం డబ్బా మొలలోంచి తీసి, బయటకు నడిచాడు.

ప్రకాశం అవేళ్టి పాఠం చదవబోయాడు. నోరు తిరగలేదు. వంట గదిలోకి చూశాడు. తల్లి వంట చేస్తోంది. ఆమె కట్టిన చీరనుంచి నీళ్ల కారు తున్నాయి. వంటిల్లు బురద బురదగా వుంది. ఒంటిని అంటిపెట్టుకుని చీర బరబరలాడుతోంది. ఆ తడిచీర విప్పేసి పొడిచీర కట్టుకోగూడదూ అనుకున్నాడు ప్రకాశం చాలాసార్లగానే.

వంటింట్లోకి నడిచాడు ప్రకాశం, తల్లివంక చూశాడు. ఆమె కూర తాలింపు పెడుతూ, వచ్చిన గొంతుకు దగ్గుతూ ముక్కు తుడుచుకుంది చీర కొంగుతో.

"అమ్మా. పొడిచీర కట్టుకోకూడదూ!"

"తప్పురా ప్రకాశం. శూద్రుల్లాగ మడీతడీ లేకుండా వంటచెయ్యకూడదు. నీ కివన్నీ ఎందుకురా శుభ్రంగా చదువుకోక."

"నీ లాగానా" అన్నాడు ప్రకాశం నెమ్మదిగా.

ఆమెకు వినిపించలేదు. ప్రకాశం వీధిలోకి నడిచాడు. పిల్లలు ఆడుకుంటూ వుండటం చూశాడు. అతని ముఖం వికసించింది. పరుగెత్తుకుంటూ వాళ్ల దగ్గర కెళ్లాడు. 'కబాడీ' తనూ ఆడతానన్నాడు. ఒక జట్టులో కలిశాడు. ఆట జోరుగా సాగుతోంది. ప్రకాశం కూత కూస్తూ వెళ్లాడు. గుక్కెడి పోతుండగా పరుగెడుతూ వెనక్కు తిరిగాడు. అప్పుడో కుర్రాడు వేగంగా ప్రకాశం గోచీపట్టుకున్నాడు. ప్రకాశం బరిమీద చెయ్యిపెట్టడానికి వంగేడు. ఇంతలో మరో కుర్రాడు ప్రకాశం పిలక పట్టుకున్నాడు. ఇంకో కుర్రాడు జంధ్యం పట్టుకుని లాగేడు. ప్రకాశం ఐపోయాడు. జంధ్యం తెగిపోయింది.

"నీ కాట రాదంటూ" ప్రకాశాన్ని ఆటలోంచి తీసేశారు మిగతా పిల్లలు. ఏడుపుమొహంతో ఇంటికి వచ్చాడు. పళ్లు కొరుకుతూ కోపంగా కూర్చున్నాడు. చిరాగ్గా పుస్తకం తీశాడు చదువుదామని. దృష్టి పాఠంమీదకు పోలేదు. పుస్తకంలోని కాగితాన్ని విసుగ్గా లాగాడు. కాగితం చిరిగిపోయింది. సర్ మని చప్పుడు. ఇంకో కాగితం చింపేడు. ఇంకోటి....ఇంకోటి కాగితాలను చింపుతుంటే బాలా సరదావేసింది ప్రకాశానికి.

"ఏం చేస్తున్నావురా ప్రకాశం. మడికట్టుకుని రా, అన్నం వడ్డిస్తున్నాను" అని కేకేసింది తల్లి.

ప్రకాశం కాగితాలను వీధిలోకి గిరాటేసి, వంటింట్లోకి నడిచాడు.

* * *

తెల్లవారింది. ఇంకా చీకటి పూర్తిగా చిరిగిపోలేదు. ప్రకాశం బద్ధకంగా మంచంమీద దొర్లుతున్నాడు. సత్యనారాయణరావు స్నానంచేసి ప్రకాశాన్ని లేపాడు. ప్రకాశం లేచి మంచంమీద కూర్చున్నాడు, కళ్లు నులుముకుంటూ. తల్లి పొయ్యి వెలిగిస్తూ కనిపించింది.

"ప్రకాశం! త్వరగా స్నానంచేసి తయారవ్వు."

"కొంచెంసేపుండి చేస్తాను నాన్నా."

"రాజన్ రాజుగారింట్లో తద్దినంరా ఇవేళ. నువ్వూరా నాతో."

"నువ్వెళ్లు! నేను రాను."

"ఏద్చేవులే. కబుర్లు మాని త్వరగా తెములు." అన్నాడు సత్యనారాయణ రావు కసురుతూ.

ప్రకాశం అయిష్టంగా లేచాడు. ముడుంకడుక్కున్నాడు ప్రకాశం స్నానం చేస్తుంటే సత్యనారాయణరావు దృష్టి కొడుకు శరీరంమీద పడింది. జంధ్యాం లేకపోవడం చూశాడు. మంత్రాలు చదివి కొడుక్కు జంధ్యం వేశాడు. ప్రకాశం తండ్రిని కోపంగా చూశాడు. కొడుకు కోపంగా చూసినట్టు తండ్రికి తెలీదు.

తర్వాత, తల్లి యిచ్చిన కాఫీ తాగి తండ్రివెంట నడిచాడు ప్రకాశం.

"నాన్నా ఈ వేళ వేదపాఠాలకు వెళ్లడం మానెయ్యనా?"

"మానడం ఎందుకు, తద్దినం పెట్టడం అయిపోగానే వెళ్లువుగాని" అన్నాడు సత్యనారాయణ.

ప్రకాశం నీరసంగా నడుస్తున్నాడు. బోర్డు స్కూలులో చదువుతున్న రోజులు గుర్తొచ్చాయి. అప్పుడు పక్కింటి కాంతి, తనూ ఎంత సరదాగా

ఆడుకునేవాళ్లు. ఇప్పుడు కాంతి హైస్కూలులో చేరి చదువుకుంటున్నాడు. ఈ మధ్య తనకు కాంతితో ఆడుకోవడమే కుదరడంలేదు. తను కూడా హైస్కూలులో చదువుకుంటే ఎంత బావుండునో. నాన్నేమో 'గోవిందస్వాహా' ముక్కట్టుకో, ముక్కులో వేలెట్టుకో చదువుకో మంటాడు. 'ఛీ' అంతా తుప్పుకంపు. హైస్కూల్లో అయితే ఎన్ని రకాలు పుస్తకాలు చదువుకో వచ్చునో.

రాజన్‌రాజుగారిల్లు వచ్చింది. ఇద్దరూ లోపలికెళ్లారు. సత్యనారాయణరావు రాజన్‌రాజుగారికి పురోహితుడు. అతను నిన్ననే మరో ఇద్దరు బ్రాహ్మలకు చెప్పడంతో వాళ్లూ వచ్చారు. ఓ గంటన్నరకు తతంగం పూర్తయింది. ప్రకాశం ముళ్లమీద కూర్చున్నట్టు కూర్చున్నాడు. తండ్రితోపాటు అతనికీ తాంబూలం ఇచ్చారు. తమలపాకులు విప్పి చూసాడు. పది పైసల బిళ్ల కనిపించింది. తాంబూలం పుచ్చుకునేటప్పుడు ప్రకాశానికి తమ ఇంటిముందు అడుక్కునే ముసలమ్మ గుర్తొచ్చింది. అతనికి అదోలా అనిపించింది. అసహ్యమేసింది.

ఆ తర్వాత తండ్రీ, కొడుకు వీధిలోకి వచ్చారు. తండ్రి చూడకుండా ప్రకాశం పదిపైసలబిళ్ల యిసకలోకి విసిరేశాడు. చేతులు దులుపుకున్నాడు. ఏదో బరువు దించినట్టు తేలిగ్గా ఫీలయ్యాడు. సత్యనారాయణరావు కొడుకును వేదపాఠశాల కెళ్లమని చెప్పి, డబ్బులిలా ఇవ్వమన్నాడు. నిజం చెబితే తండ్రి కొడతాడేమోనని, డబ్బులు పడిపోయాయని చెప్పాడు. నసుగుతూ. సత్యనారాయణరావు చెడామడా తిట్టాడు. ప్రకాశం మౌనంగా తండ్రి చూస్తుండగా వేద పాఠశాలకేసి నడిచాడు.

ఆరోజు ప్రకాశం వేదపాఠశాల కెళ్లలేదు. సాయంత్రం వరకు దగ్గర్లో వున్న చెరువుగట్టుమీద కాలక్షేపం చేశాడు, రకరకాలా బుల్లిబుల్లి ఆలోచనలతో.

*       *       *

ప్రకాశం వేదపాఠశాల కెళ్లి రెండు రోజులయింది. చెరువుగట్టు దగ్గరా, కాలవగట్టు దగ్గరా పశువుల్ని మేపేకుర్రాళ్లతో సాయంత్రంవరకు ఆడుకుని ఇంటికి వచ్చేవాడు. తల్లీతండ్రీ ప్రకాశం వేదపాఠశాలకు వెళ్లివస్తున్నాడనే అనుకున్నారు.

మూడవ రోజు ఉదయం సత్యనారాయణరావు కొడుకును తన కూడా రమ్మన్నాడు. ప్రకాశం చిరాగ్గా తండ్రివెంట నడిచాడు. దారిలో తండ్రి రోడ్డు సక్కన వాకిట్లోకి వెళ్లడానికి జంధ్యం మోచేతిమీదకు తీసుకున్నాడు. ప్రకాశం తండ్రి వచ్చేదాక ఆగి,

"నాన్నా ఉచ్ఛ జంధ్యం మీద పడుతుందనా మోచేతి మీదకు తీసుకున్నావ్" అని ఎప్పటినుంచో సీకుతున్న అనుమానాన్ని అడిగాడు.

సత్యనారాయణరావుకు ప్రకాశంమీద కోపంవచ్చింది. అతనికి కొడుకు వరస నచ్చలేదు. వచ్చిన కోపాన్ని అపుకుని,

"అలా తీసుకోవాలని మన సంప్రదాయం చెబుతోందిరా, చొప్పదంటు ప్రశ్నలు మాని నడు. అవునూ, నువ్వు జంధ్యం వాకిటికెళ్ళేటప్పుడు నాలా తీసుకోవడం లేదా" అని అడిగాడు సత్యనారాయణరావు.

'చచ్చానురా' అనుకున్నాడు ప్రకాశం. మాటాడకుండా తండ్రిని అనుసరించాడు. దారిలో మరో ముగ్గురు బ్రాహ్మలు కలిశారు. ఓ పావుగంట నడిచి, "షర్మిలా" క్లాత్ సెంటర్ దగ్గర ఆగారు. ఇవేళ షర్మిలా క్లాత్ సెంటర్ ఓపెనింగు. పూజ చెయ్యడానికి ఇంకో పది నిమిషాల టైముంది. బ్రాహ్మలంతా ప్లాట్‌ఫారంమీద కూచున్నారు.

సత్యనారాయణరావు షర్మిలా క్లాత్ సెంటర్ ప్రొప్రయిటర్ వద్ద కెళ్ళాడు. అతనూ మిగతా బ్రాహ్మలతో ప్లాట్‌ఫారం మీద కూర్చునేవాడే. అయితే, షర్మిలా క్లాత్ సెంటర్ యజమాని పురోహితుడు ఊరికెళ్ళడంతో సత్యనారాయణరావుకు పూజచేయించే 'ఛాన్స్' వచ్చింది. డబ్బులు బాగా గిట్టుబాటవుతాయని అతనికి చాలా సంతోషంగా వుంది. ఇవేళ తనే 'హెడ్ పురోహితుణ్ని' కదా అని మరెంతో గర్వంగానూ వుంది.

ప్లాట్‌ఫారం మీద కూర్చున్న పురోహితులు తాము యెప్పుడు ఏ పెళ్లి ఎలా జరిపించారో, ఎప్పుడు ఏ సంవత్సరికం ఎలా చేయించారో, ఎంత ముట్టిందో లాంటి విషయాలు మాట్లాడుకుంటున్నారు. గొప్పలు చెప్పుకుంటున్నారు.

ప్రకాశం మెయిన్‌రోడ్డు మీద హడావిడిగా తిరుగుతున్న కార్లనూ రిక్షాలనూ, జనాన్నీ చూస్తూ కూచున్నాడు. తన ఈడు పిల్లలే శుభ్రమైన నిక్కర్లూ చొక్కాలూ, బెల్‌బాటమ్ పాంట్లూ వేసుకుని ఉత్సాహంగా పుస్తకాలు పట్టుకుని వెళ్తుండడం చూశాడు. అతని మెదడులో మళ్లీ ఆలోచనల పుష్పాలు వికసించాయి.

నేను కూడా హైస్కూలులో చదవాల్సిందే. నాన్నకు ఎంత చెప్పినా లాభం లేదు, అమ్మకే చెప్పాలి. అమ్మ చాలా మంచిది. కానీ, నాన్నమాట వినాలంటుంది. పేచీ పెట్టెయ్యాలి. ఏడ్చెయ్యాలి. అప్పుడు అమ్మ కొంచెం కరుగుతుంది బుజ్జగించి అమ్మ అన్నం పెడుతుంది. తను అన్నం తింటాడు. "వూరు

కున్నాడు కదా" అని తర్వాత అమ్మ, నాన్న మాట వినాలంటుంది. అప్పే అలా చెయ్యకూడదు. అమ్మ 'రానాన్నా' అంటూ అన్నం పెట్టినప్పుడు తను తినకూడదు. పొద్దుటా తినకూడదు. రాత్రీ తినకూడదు. అమ్మో, ఆకలెయ్యదూ మరి? ఆకలేసినా. సరే, ఎన్ని రోజులైనా సరే. హైస్కూల్లో చేర్పించేదాకా తనలాగే చెయ్యాలి. దెబ్బతో అమ్మ కూడలిపోతుంది. పాపం, అమ్మ మంచిది. నాన్నతో గట్టిగా చెబుతుంది. ఎలాగైనా ఒప్పిస్తుంది. ప్రకాశం ముఖంలో చిరునవ్వు మెరిసింది.

ప్రకాశం హుషారుగా రోడ్డుకేసి చూశాడు. అప్పుడే షర్మిలా క్లాత్ సెంటర్ ముందు ఓ వ్యక్తి రిక్షాలోంచి దిగాడు. రిక్షా వాడికి డబ్బులిచ్చాడు. "ఇంకో పది పైసలు వస్తాయండీ" అన్నాడు రిక్షావాలా. "నంబై పైసల కంటేనా" అన్నాడతను. "బస్‌స్టాండ్ నుంచి అర్ధరూపాయికి కూడా ఎవరూ రారండి" అన్నాడు రిక్షావాలా గట్టిగా, విసుగ్గా. అతను అటూ ఇటూ చూసి పది పైసలు యిచ్చేశాడు. రిక్షావాలా వెళ్ళిపోయాడు.

రిక్షాలోంచి దిగిన వ్యక్తిని చూడగానే సత్యనారాయణరావు గుండెలో రాయిపడింది. "రండి పంతులుగారూ రండి. మీ కోసం రారనుకున్నాను. సరిగ్గా టైముకొచ్చారు. ఇంకా ఏలోటూ రాకుండా పూజ చేయించేస్తారు. ఇది మాకు శుభసూచకం" అన్నాడు షర్మిలా క్లాత్ సెంటర్ ప్రొప్రయిటర్.

సత్యనారాయణరావు నిరాశగా నీరసంగా ప్లాట్‌ఫారం మీదకు వచ్చి కూర్చున్నాడు. ప్రకాశం తెల్లబోతూ ఇదంతా చూస్తూనే వున్నాడు. ఇందాకటి రిక్షావాలా జ్ఞాపకానికొచ్చాడు. వాడికి జంధ్యం లేదు. బెల్‌బాటమ్ పేంటు వేసుకుని వస్తున్నవాడికి జంధ్యం వుంటుందా? ఆ మాటే తండ్రి నడిగాడు.

"రిక్షావాడికి జంధ్యం వుండదురా. వాడు కులం తక్కువవాడు. దయ్యంలా జుట్టు పెంచుకున్నవాడికి జంధ్యం వుందో లేదో ఎలా తెలుస్తుంది. పెద్ద కులం వాడయితే వుంటుంది. కాకపోతే లేదు" అన్నాడు విసుగ్గా సత్యనారాయణరావు.

ప్రకాశం షర్మిలా క్లాత్ సెంటర్‌కు వస్తున్నవాళ్ళను చూస్తూ కూర్చున్నాడు. అంతలో పెద్దగొంతుతో పద్యాలు పాడుతూ, షాపు యజమానిని ఇంద్రుడూ, చంద్రుడూ అని పొగుడుతూ భట్రాజు వచ్చాడు. ప్రకాశం భట్రాజు వంక చూశాడు. ముగ్గుబుట్టలా వున్న తల, మాసిన గడ్డం, పంచెకట్టూ, భుజం మీదుగా జంధ్యం. అచ్చం నాన్నలాగే వున్నాడనుకున్నాడు. షాపు యజమాని భట్రాజుకు పావలా యిచ్చాడు. భట్రాజు "విజయీభవ, దిగ్విజయీభవ" అని దీవించి వెళ్ళిపోయాడు.

"నాన్నా, తెలిసిపోయింది. నాకు తెలిసిపోయింది" అంటూ సంతోషంగా గెంతాడు ప్రకాశం.

"ఏమిటి తెల్సిందిరా నా బొంద" అయోమయంగా కొడుకును చూస్తూ అడిగాడు సత్యనారాయణరావు.

"జంధ్యాలు అడుక్కునేవాళ్లకే వుంటాయన్న మాట" అన్నాడు చప్పట్లు కొడుతూ ప్రకాశం.

సత్యనారాయణరావుకు ఒళ్లు మండిపోయింది. మిగతా బ్రాహ్మలంతా ఇటు చూడడంతో ఒంటికి కారం రాసుకున్నట్టనిపించింది.

"దౌర్భాగ్యుడా, నోటికేదొస్తే అది అనెయ్యడమే. పిల్లిని చంకలో పెట్టుకొచ్చినట్టు నిన్ను బుద్ధిలేక తీసుకొచ్చానురా నా ఖర్మ" అంటూ సత్యనారాయణరావు కొడుకు వీపుమీద రెండు దెబ్బలేశాడు.

ప్రకాశానికి కోపమొచ్చింది. వచ్చే ఏడుపును ఆపుకున్నాడు. పూజ పూర్తవడంతో బ్రాహ్మలంతా షాపులోకి వెళ్లారు. షాపు యజమాని తన యింటి పురోహితుడికి తాంబూలంలో పదిహేను రూపాయలు పెట్టి నమస్కారం చేశాడు రెండు చేతులూ జోడించి. తర్వాత, ఒక్కొక్క బ్రాహ్మడికీ తాంబూలంతో ఒకో అర్థరూపాయి పెట్టి ఇచ్చాడు. సత్యనారాయణరావుకు రెండ్రూపాయలిచ్చాడు. అతనింకా రావాలని అడగబోయాడు. షాపు యజమాని అతని వంక చూడకుండానే వెళ్లిపోయాడు. ఇదంతా చూస్తున్న ప్రకాశానికి తండ్రిమీద జాలి కలిగింది. అప్పుడతనికి ఇందాకటి రిక్షావాడు మళ్లీ గుర్తుకొచ్చాడు. నాన్న రిక్షావాలా అంత ఖచ్చితంగా డబ్బులెందుకు అడగలేకపోయాడు! వాళ్లెంతిస్తే అంతే నోరు మూసుకుని తీసుకోవలసిందే బిచ్చగాళ్లలా.... ప్రకాశం బుర్రనిండా ఆలోచన్లు.

బ్రాహ్మలంతా ప్లాట్‌ఫారంమీద కూర్చుని షాపు యజమాని ఇచ్చిన టిఫిను పొట్లాలు విప్పుకుంటున్నారు. ప్రకాశం నెమ్మదిగా తండ్రి వెనక్కి వెళ్లి కూర్చున్నాడు. అతనికంతా అసహ్యంగా వుంది. కోపంగా వుంది. చిరాగ్గా వుంది. తన ఒంటిమీది జంధ్యం తీసిపారేశాడు. అప్పుడే స్నానం చేసినట్టనిపించింది. ప్లాట్‌ఫారం మీద తారుపోయి పైకివచ్చిన నల్ల కంకరరాళ్లను చూశాడు. రెండు రాళ్ళను చేతిలోకి తీసుకున్నాడు. నెమ్మదిగా ఒక రాయిమీద వేలాడుతున్న తండ్రి జంధ్యం పెట్టి దానిమీద మరో రాయి వుంచాడు. సత్యనారాయణరావు

పెనుమళ్లలో తను జరిపించిన వివాహం గురించి ఇప్పటి అసంతృప్తి నుంచి తప్పించుకోడానికి గొప్పగా చెప్పుతున్నాడు మిగతావాళ్ళకు.

ప్రకాశం చప్పుడుకాకుండా నెమ్మదిగా రెండు రాళ్ళనూ రాపిడి చేయడం మొదలెట్టాడు. కొన్ని నిమిషాలకు జంధ్యం తెగిపోయింది.

ఒక్క ఉదుటున ప్రకాశం ఆనందంగా లేచాడు. జంధ్యం కొసపట్టుకొని లాగాడు. జంధ్యం చేతిలో కొచ్చేసింది. సత్యనారాయణరావు ఉలిక్కిపడ్డాడు. ఒంటిమీద జంధ్యం లేదు. ప్రకాశం పగలబడి నవ్వుతున్నాడు. బుగ్గలు పొంగిపోతున్నాయి. కళ్లు మూసుకుపోతున్నాయి. నవ్వు ఆపుకోలేక పోతున్నాడు. నవ్వుతూ నవ్వుతూ తండ్రికి దూరంగా జరుగుతున్నాడు. తృప్తిగా నవ్విన నవ్వు కావడంతో కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. జంధ్యాన్ని వుండగా చుట్టి సైడు కాలవలోకి విసిరేశాడు.

సత్యనారాయణరావు అలవిమీరిన ఆగ్రహంలో ఊగిపోయాడు. కొన్ని క్షణాల దాకా నోటమాట రాలేదు. ప్రకాశాన్ని కొడదామని రెండు అడుగులేశాడు. ప్రకాశం తండ్రికి అందకుండా పరుగెత్తాడు. నవ్వుతూనే ఇంటివైపుగా పరుగెత్తాడు. అతని మనసునిండా ఆనందం నిండిపోయింది. ఉత్సాహం ఉరకలు వేసింది. ప్రకాశం పరుగెడుతూ ఒక్క క్షణం ఆగాడు. చేత్తో పిలక లాక్కున్నాడు. నొప్పి చేసింది. పిలక ముడి వూడిపోయింది. ఒక్కసారి తల పరికించి మళ్లీ పరుగుతీశాడు. పిలక కిందకూ మీదకూ ఊగుతుంది. కొంతసేపట్లో ప్రకాశం చేతిలోకి వచ్చే బ్లేడును తలచుకొని భయంతో వణికిపోతోంది.






సిస్టర్ నీలిమ 9వ నంబరు బెడ్ దగ్గరికి అదుర్దాగ వచ్చింది. ఆ పేషెంటు పిచ్చిగా అరుస్తోంది. రెస్ట్‌లెస్‌గా ఉంది. వెంటనే నీలిమ 'కాంపోజ్' లోడ్‌చేసుకు వచ్చింది. వార్డుబాయ్ ఆమెని పట్టుకున్నాడు. నీలిమ ఆమె డెల్టాయిడ్ కండరంలోనికి నీడిల్ గ్రుచ్చింది. ఎవరో తన ప్రక్కగా వచ్చి నిలబడ్డారన్న విషయం గమనించింది. ఇంజక్షన్ చేయడం పూర్తయ్యింది.

"డాక్టర్ కిరణ్! వెల్‌కమ్ టు అవర్ హాస్పిటల్!" ఉత్సాహంగా విష్‌చేసింది. నీలిమ అతన్ని చూసి డాక్టర్ కిరణే అయి ఉంటాడని భావిస్తూ.

"థాంక్యూ సిస్టర్!" డాక్టర్ కిరణ్ అన్నాడు సంభ్రమాశ్చర్యాలతో.

"మీకు నా పేరు ఎలా తెలుసో తెలుసుకోవచ్చా?" అన్నాడు అచ్చెరు వొందుతూ.

"మీ పేరే కాదు! అసలు మీరే డాక్టర్ కిరణ్ అని ఎలా గుర్తుపట్టానో అడగరే?"

"ఔను! ఎలా గుర్తుపట్టారు?" అన్నాడు ఉత్సాహంగా.

"ఈ రోజు కొత్త డాక్టరుగారు రాబోతున్నారని, వారి పేరు కిరణ్ అని నాకు తెలుసు ఇంతకుముందే. అయితే వార్డులోకి ఇంత వెలుగు ఎలా వచ్చిందీ అని ఆశ్చర్యపోతూ చూస్తే మీరు కన పడ్డారు. వెంటనే అనుకున్నాను మీరే కిరణ్ అయి ఉంటారని."

"చాలా తెలివైనవారే!" నవ్వుతూ అన్నాడు కిరణ్.

"ఇంతకీ ఆ వార్డులోకి వెలుగువచ్చిన కారణం నా పేరా? నేనా?" అన్నాడు ఆమె మరింత పొగిడితే విని ఆనందించాలను కుంటూ.

"ఊ.... ఇంకా పొగడాలంటారు! మీ పేరుకి మీరు జోడై మీకు మీ పేరు జోడై...."

"అహహా! అంతగా పొగడకండి! పొగడ్తల్లో నిజముండదని నా ఉద్దేశ్యం!" అన్నాడు మొహమాటపడుతూ.

"దెన్ ఐయామ్ ఎక్స్ట్రీమ్లీ సారీ డాక్టర్!" అంది బాధపడుతూ నీలిమ.

"అరె! దేనికండీ?" అన్నాడు విభ్రాంతిగా.

"మిమ్మల్ని ఇంతసేపు పొగిడి నందుకు!" నొచ్చుకుంటున్నట్టుగా అంది.

"హహ్హహ్హ ...." గట్టిగా నవ్వాడు కిరణ్ ఆమె చమత్కారాన్ని అర్థం చేసుకుంటూ.

"మీరు చాలా చమత్కారంగా మాట్లాడ తారే! ఐ లైకిట్!"

"కొంపదీసి మీరు కూడా నన్ను పొగ డటం లేదు కదా!"

"నాది పొగడ్త అన్న, అందులో నిజం లేదని మీరు చిటికెలో గ్రహించారు. అందుకే ముందే అన్నాను మీరు చాలా తెలివైనవారని."

"ఆ! దెబ్బకి దెబ్బ కొట్టారు! ఘటికులే మీరుకూడా!" అభినందిస్తున్నట్టుగా అంది నీలిమ.

"అది సరే! మీకు నాపేరు ఎలా తెలిసిందో చెప్పనేలేదు!"

ఆమె ముఖకవళికల్లో ఏదో మార్పు. అంతవరకు నీలిమ కళ్ళల్లో కదలాడిన చిలిపితనం, ముఖంలోని చలాకీతనం త్రుటిలో మాయమయ్యాయి.

"మీ చీఫ్ తెలుసుకోలేని విషయ ముండదులెండి!" అని బెడ్ దగ్గర్నుంచి అసమ్మతంగానె కదిలింది నీలిమ.

'డాక్టర్ చక్రపాణి! యూ చీట్! డర్టీ రోగ్!' నీలిమ హృదయం ఆయనగుర్తుకు రావటంతో ఒక్కసారిగా ఆక్రోశించింది. ఆమె కసిగా చేతిలోని సిరంజ్ కున్న నీడిల్తో అరచేతిలో పొడుచుకుంది.

'అమ్మా!' బాధతో గిలగిల్లాడింది. ఆమె రెండు కళ్ళనూ నీటిపొరలు కప్పేశాయి.

కిరణ్ నీలిమ ప్రవర్తనకు నిశ్చేష్టుడై 9వ నంబరు బెడ్ దగ్గరే నిలబడి పోయాడు. అయితే సిస్టర్‌కి తనపేరు డాక్టర్ చక్రపాణి ద్వారా తెలుసన్న మాట! కాని ఆయనకి ఈమెకు సంబంధమేమిటి? ఆ పేషెంటు వంక చూశాడు. 'కాంపోజ్' ఇవ్వడం మూలంగా ఆమె నిద్రలోకి జారుకుంది. వాట్ ఎ లవ్లీ ఫేస్! కిరణ్ హృదయానికి గిలిగింతలు పెట్టినట్టయ్యింది కాని ఈమె ఇలా ఈ మెంటల్ హాస్పిటల్లో!! ఆ పైవాడి దయ ఇలా ఉంటుందన్నమాట! అతని మనసులో ఎందుకో బాధ. కనకపు సింహాసనంలో శునకం కూర్చుండే రోజులివి! ఎవరికి ఏ చోటు అర్హనీయమైనదో అక్కడ ఆ మనిషి కనపడని కాలమిది! డాక్టర్ కిరణ్ భారంగా కదిలాడు, ఆ పేషెంట్ కేస్‌షీటు పరిశీలిద్దామని.

ఆ గదిలో నీలిమ అరచేతికి కట్టుకట్టు కుంటూ కనిపించింది కిరణ్‌కి.

"ఏం సిస్టర్! ఏమయ్యింది!" ఆత్రుతగా అడిగాడు.

"నీడిల్ గుచ్చుకుంది" ముభావంగా బదులిచ్చింది.

"అరరె! నేను కడతాను ఆగండి!" ఆమె అరచేతిని ఉన్న సగం కట్టుని తీసేసి నీట్‌గా డ్రస్‌చేశాడు కిరణ్.

"థాంక్స్ డాక్టర్!" అంది చిరునవ్వు నవ్వుతూ.

"ఇంత మాత్రానికే 'థాంక్స్' ఎందుకు సిస్టర్!" అన్నాడు అభిమానపడుతూ.

"ఇవ్వు దోంట్ మైండ్.... బెడ్ నంబర్ నైన్ కేసుషీటు కొంచం ఇస్తారా సిస్టర్!"

ఆమె విస్మయంగా చూసింది అతని వంక.

"ఇవ్వుదోంట్ మైండ్! మీరీ హాస్పిటల్లో ఉద్యోగం పెట్టింది కొన్ని నిమిషాల క్రితం! కాని అప్పుడే ఒక పర్టిక్యులర్ కేస్‌షీటు కావాలని అడుగుతున్నారు! కారణం తెలుసుకోవచ్చా!"

సమాధానం ఏం చెప్పాలో తెలియక ఓ క్షణం తటపటాయించాక "నథింగ్! అటువంటి సౌందర్యవతికి ఈ దుస్థితి కలగటానికి కారణమేమిటా అని."

"ఇటీజ్ సింపుల్!"

అర్థంకానట్టు చూశాడు ఆమెవంక.

"సమాధానం మీ ప్రశ్నలోనే ఉంది డాక్టర్!"

"అంటే ఆమె సౌందర్యమే దాని కారణమనా!"

"అంతే మరి!"

ఇంకా ఏమైనా చెబుతుందేమోనని ఆశగా చూశాడు కిరణ్ ఆమె వంక. కాని మరింకేది చెప్పేందుకు నీలిమ సిద్ధంగా లేనట్టు కనపడింది.

"ఆమె అంత అందంగా ఉందా డాక్టర్!"

"కాదంటూరా!"

"మీ ఫ్రాంక్‌నెస్‌కి అభినందిస్తున్నాను. మీరూ సౌందర్యారాధకులన్న మాట!"

"కాని వాళ్ళుకూడ ఆమె సౌందర్యానికి ముగ్ధులై ఆరాధిస్తారని అభిప్రాయ పడుతున్నాను!"

"ఉహుం!" అంది నవ్వుతూ ఆమె.

అంతవరకు అయితే ఫరవాలేదు డాక్టర్," అంది ఆమె భావగర్భితంగా. కిరణ్ విస్మయంగా చూశాడు ఆమెవంక.

"జస్టెమినిట్ డాక్టర్!" అని వెళ్ళి కేసుషీట్సు తీసుకువచ్చి అతనిముందు ఉంచింది.

కిరణ్ 9వ నంబరు కేసు షీటు కోసం వెతకబోయాడు. కాని ఆ కేసు షీట్సన్నీ ఆ పేషెంటువేనని గ్రహించ టానికి ఎక్కువ సమయం పట్టలేదు.

"ఇదేమిటి సిస్టర్!" ఆశ్చర్యంగా అడిగాడు ఆమెని.

మీరు 'కొంచం' అంటే ఈ ఆరు కేసుషీట్లేతీసుకువచ్చాను. మరో నాలుగు ఉన్నాయి, తీసుకువస్తానుండండి" అని వెళ్ళింది.

కిరణ్ ఆమె కేసుహిస్టరీ చదవ సాగాడు. షివాజ్ రేప్డ్! దారుణంగా అనుభ వించ బడింది. ఆమె మనసు తట్టుకోలేక పోయింది ఓ సుకుమారకుసుమం ఓ రాక్ష సుడి చేతుల్లో నలిగిపోయింది! భారంగా నిట్టూర్చాడు కిరణ్. నీలిమ మిగతా నాలుగు కేసుషీట్లు అతనికిచ్చింది. వాటిని పరిశీలించసాగాడు అతను. క్షణాలు గడుస్తున్నాయి. నీలిమతో డాక్టర్ కిరణ్‌తో ఏదో చెప్పాలని తపన.

"డాక్టర్...."

"........."

"డాక్టర్!"

కిరణ్ తన దృష్టి ఆమెపై పు మరల్చాడు 'ఏమిటి' అన్నట్టుగా.

"డాక్టర్ మీ ఛీఫ్.... అదే.... డాక్టర్ చక్రపాణి మీ రాకకై చాలా ఆతృతగా ఎదురుచూస్తున్నారు. మీరు చాలా మెరిటోరియస్ స్టూడెంట్‌ట కదా. సైకియాట్రిలో గోల్డ్‌మెడల్ సంపాయిం చారట.మీవంటివారి రాకతో ఈ హాస్పిటల్ మరిన్ని సత్ఫలితాలు సాధించగలదని వారు అభిప్రాయపడుతున్నారు!" అంది నీలిమ! అలా అంటునప్పుడు ఆమె కళ్ళల్లో ఏదో ఆశ, మరేదో మెరుపు!

"నాదేముంది సిస్టర్! అటువంటి ప్రొఫెసర్‌కి ఎవరు స్టూడెంటయినా గోల్డ్‌మెడల్ రాక తప్పదు" కిరణ్ వినయంగా అన్నాడు

నిజమే! డాక్టర్‌గా చక్రపాణి గ్రేట్‌మాన్! కాని మనిషిగా....హి ఈజ్ స్కౌండ్రల్! అనుకుంది నీలిమ.

రౌండ్సు పూర్తయ్యాయి. కిరణ్ 'ఇండెంట్ బుక్' మీద సంతకాలు చేస్తు న్నాడు. నీలిమ ఎదురుగుండాఉన్న కుర్చీ మీద చేతులు ఆన్చి నిలబడి ఉంది. కిరణ్ ఆఖరిపేజి మీద సైన్‌చేసి బుక్ సిస్టర్‌కి

అందించాడు. అతను బ్రీఫ్‌కేస్ తీసుకుని బయల్దేరబోతూ ఆమెవంక చూశాడు. నీలిమ కదలకుండా అక్కడే నిలబడి ఉంది.

"సిస్టర్! కుర్చీలో కూర్చోండి! మీరు నాతో ఏదైనా చెప్పదలుచుకుంటే నిర్భయంగా నిస్సంకోచంగా చెప్పవచ్చు!"

ఎంతైనా సైకియాట్రిస్ట్! ఎదుటి వారి మనోభావాల్ని ఇట్టే చదవగలడు అనుకుంది నీలిమ.

"థాంక్స్ డాక్టర్" కుర్చీలో కూర్చుంది నీలిమ.

కిరణ్‌కి ఆమె సభ్యతపై సదభిప్రాయ మేర్పడింది!

"చెప్పండి!" అన్నట్టుగా చూసాడు.

నీలిమ గొంతు సవరించుకుంది

"మీ దీపూరేనా డాక్టర్?"

"లేదండి!"

"బంధువులున్నారా?"

"లేరు!"

"పోనీ ఫ్రెండ్సు!"

"ఉన్నారు."

"వారితో ఉంటారా?"

"అబ్బే లేదండి!"

"మరెక్కడుంటారు!? మీకు అభ్యంతరం లేకపోతే మా ఇంటికి వచ్చి ఉండండి! సెపరేట్ రూమ్ ఉంది!"

"థాంక్స్ సిస్టర్! నేను హోటల్‌లో రూమ్ బుక్‌చేసుకునే వచ్చాను. చక్రపాణిగారికి ఈ విషయం తెలిస్తే మండిపడతారు. మీరుకూడ చెప్పకండి! త్వరలోనే పోర్షన్ ఒకటి తీసుకుంటాను. మీ ఎరికలో ఏదైనా ఉంటే చెప్పండి."

"తప్పకుండా డాక్టర్! కాని మీరు ఏ హోటల్‌లో ఉంటున్నారో తెలుసుకో వచ్చా? ఇలా అడుగుతున్నందుకు మీరు అన్యథా భావించనట్లయితేనే చెప్పండి!"

"హోటల్ ఉడ్‌లాండ్స్‌లో! రూమ్ నంబరు 213."

"ఔనా" అంది నీలిమ సంతోషంగ.

"మా ఇల్లు అక్కడే!రాత్రికి వస్తాను! ఉంటారా?" ఆత్రుతగా అడిగింది.

కాసేపు ఆలోచించాడు కిరణ్.

"ఓ ఫ్రెండుని కలవాలి సిస్టర్! తిరిగి వచ్చేప్పటికి రాత్రి తొమ్మిది దాటవచ్చు."

"ఫరవాలేదు డాక్టర్! మా ఇల్లు హోటల్‌కి ఎదురుగానే!"

"ఐసీ! అయితే రండి!"

"థాంక్స్ డాక్టర్!"

కుర్చీలోంచి లేచింది నీలిమ. కిరణ్ కూడా బయల్దేరాడు.

"డాక్టర్! ఒక్క నిముషం" అని బీరువాలోంచి వెడ్డింగ్‌కార్డు తీసి అతనికి ఇచ్చింది.

చక్రపాణిగారి కొడుకు దినేష్ వివాహం!

"మిమ్మల్ని మరీ మరీ ఆహ్వానించారు వివాహానికి అటెండ్ అవ్వమని! రేపే వివాహం!" అంది నీలిమ.

చక్రపాణి గురించి తనకు తెలియని దేముంది! మానాఫ్ గ్రేట్ మానర్స్! ఆయన స్టూడెంట్ అయిఉండి తానీనాడు ఆయనవద్దనే అసిస్టెంట్‌గా రావటం తన అదృష్టభాగ్యం! బ్రీఫ్‌కేసు తెరిచి అందులో వెడ్డింగ్‌కార్డు పెట్టి మూశాడు.

"థాంక్స్ సిస్టర్!" అతను బయల్దేర బోయాడు.

"డాక్టర్! వన్‌మోర్ థింగ్...." అంది సంశయిస్తూ.

"చెప్పండి!" అన్నాడు టేబిల్‌కి ఆనుకుంటూ.

"డాక్టర్! ఆ తొమ్మిదవ నెంబరు పేషెంటు పరిస్థితి మెరుగుపడుతుం దంటారా!" ఆమె గొంతులో ఏదో బాధ.

"మీరేం అనుకోకపోతే.... ఇంతమంది పేషెంట్లున్నారు. మీరు పర్టిక్యులర్‌గ ఆ పేషెంటుగురించి అడుగుతున్నారు! కారణం తెలుసుకోవచ్చా!"

"...................."

"మీ తోబుట్టువా!"

"...................."

"మీ బంధువులమ్మాయా!!"

"డాక్టర్! ప్లీజ్! అడిగిన ప్రశ్నకి సమాధానంచెప్పండి!" గంభీరంగా అంది నీలిమ.

పది కేసుషీట్లుకల పేషెంటు ఆమె. చక్రపాణిగారు చాలా ప్రయత్నిస్తున్నా రనిపిస్తోంది కాని ప్రోగ్రెస్‌నోట్సులో చెప్పుకోదగ్గ మార్పులేదు. తను అది ఒక 'ఛాలెంజ్'గ తీసుకుని గట్టిగా ప్రయత్నించాలి.

"కొంచెం క్లిష్టమయిన కేసు సిస్టర్! ఇంకా ప్రయత్నించాలి! ఫలితం గురించి చెప్పలేను" అని ఆమె రియాక్షన్ పదవటానికి ప్రయత్నించాడు.

"థాంక్స్ డాక్టర్!" ఆమెగొంతు గద్గదిక మయ్యింది. ఆమె చెక్కిళ్ళనుంచి కన్నీళ్ళు జలా జలా రాలిపడ్డాయి. కర్చీఫ్‌తో తుడుచుకుంటూ ఇంక అక్కడ ఉండలేనట్టుగ వడివడిగ వెళ్ళిపోయింది.

"సిస్టర్! సిస్టర్!" పిలిచాడు కిరణ్.

* * *

సమయం రాత్రి 9 గంటల 15నిమిషాలు. అప్పుడే భోజనం ముగించి పడక మీద వాలాడు కిరణ్. 'బ్లిట్జ్' చూశాడు కాసేపు. "దహ్యూమన్ బీయింగ్ అండ్ హిజ్‌నేచర్' అన్న పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు.

'ట్రింగ్‌గ్‌గ్....'

లేచి గదితలుపు తీశాడు.

ఎదురుగుండా వెయిటర్

"సార్! భోజనమయిందా!"

'అయింది' అన్నట్టుగా తలఊపాడు. అతని వెనక నీలిమ నిలబడి ఉంది. కిరణ్ గమనించలేదు. అతను లోనికి వచ్చాడు ప్లేటు తీసుకొవటానికి. కిరణ్ కూడా వెనుదిరిగాడు.

"డాక్టర్!"



వెనక్కి తిరిగి చూశాడు. ఎవ్వరో పోల్చుకోలేక అయోమయంగా చూశాడు.

"డాక్టరు! అప్పుడే మరచిపోయరా" నీలిమ నవ్వుతూ అంది.

"ఓ! మీరా సిస్టర్! కమిన్! అయామ్ సారీ! ఈ డ్రెస్‌లో మిమ్మల్ని వెంటనే గుర్తించలేకపోయాను!" అన్నాడు నొచ్చుకుంటూ. "ఫరవాలేదు డాక్టర్! ఇది మాకు మామూలే. ఎప్పుడూ ఆ తెల్ల యూనిఫాంలో చూడటానికి అలవాటుపడి అకస్మాత్తుగా మామూలు డ్రెస్‌లో చూసినప్పుడు ఇలాంటి కన్ఫ్యూజ్ అవడం తరచు జరిగే విషయమే!"

"లోపలికి రండి?"

వెయిటర్ ప్లేటు తీసుకుని వెళ్ళిపోతూ కిరణ్ వంక, నీలిమ వంక ఏదోలా చూశాడు. కిరణ్ తలుపు వేశాడు. ఆమెను సోఫాలో కూర్చోమని చెప్పి తను ఆమె ఎదురుగుండా కుర్చీలో కూర్చున్నాడు.

"ఇంత రాత్రయ్యింది! మీరు రాకపోవచ్చనుకున్నాను!"

"....................."

"సిస్టర్! మీ కళ్ళనుంచి కనీసం లీటరు నీళ్ళు కారిఉంటాయి కదూ! మీ కళ్ళల్లోని ఆ ఎర్రజీరల్ని చూస్తుంటే అలా అనుకోక తప్పటంలేదు. ఉదయం మీ ప్రవర్తన నన్ను చాలా కలవర పెట్టింది మీకు ఆ పేషెంటుకీ సంబంధం ఏమిటి? నిజం చెప్పండి! ఆమె మీ తోబుట్టువు కదూ!"

"ఔను డాక్టర్!"

"ఏది 'ఔను'. మీరు లీటరు కన్నీళ్ళు కార్చటమా లేక ఆ పేషెంటు మీ తోబుట్టువు కావటమా!" చిరునవ్వు నవ్వుతూ అన్నాడు కిరణ్.

"రెండూను!" నీలిమ గంభీరంగా జవాబిచ్చింది.

నిశ్శబ్దం చోటుచేసుకుంది వారిద్దరి మధ్య పోలికల్ని బట్టి నీలిమ ప్రవర్తనని బట్టి కిరణ్ ఆ పేషెంటు నీలిమ తోబుట్టువని గ్రహించాడు. తన సిస్టర్‌ని రోజూ ఆ పరిస్థితిలో చూస్తూ ఈ సిస్టర్ ఎలా భరించి ఉండగలుగుతూందో!? అతనికి నీలిమపై సానుభూతి కలుగుతోంది. తను ఏమైనా సరే ఆమెను పూర్వపు మానసికస్థితికి తీసుకురావాలి! తన జీవిత ధ్యేయమే ఈ మానసిక రోగులకు సేవచేయడం! ఎంతో కృషి చేసి ఈ స్థితికి చేరుకున్న తను, చదివిన చదువుకి న్యాయం చేకూర్చాలి! సార్థకత చే.......

"డాక్టర్"

కిరణ్ ఈ లోకంలోకి వచ్చాడు నీలిమ పిలుపుతో....

"చెప్పండి సిస్టర్! ఆమె చెప్పేది వినటానికి సంసిద్ధుడవుతూ అన్నాడు.

"డాక్టర్! అనగనగా ఓ అమ్మాయి అనగనగా ఓ అబ్బాయి! సారీ! నేను చెప్పేది కట్టుకథ కాదు! జీవితం! ఆ అమ్మాయి నా చెల్లెలు అరుణ. అంటే ఆ తొమ్మిదవ నంబరు పేషెంట్! ఆ అబ్బాయి దినేష్! అంటే మా ఛీఫ్ డాక్టర్ చక్రపాణిగారి సుపుత్రుడు! ఇద్దరూ ప్రేమించుకున్నారు! లేదు! వాడు నా చెల్లిని ప్రేమించినట్టు నటించాడు కాని నా చెల్లెలు వాడిని గాఢంగా ప్రేమించింది. కథ సాఫీగా నడవలేదు అందుకే.... వాడు రేపీపాటికి మరో అభాగ్యురాలికి మొగుడవ్వబోతున్నాడు! ఆమె చేతులు బిగుసుకుంటున్నాయి, పిడికిళ్ళు మూసుకుంటున్నాయి. పళ్ళు పటపటలాడుతున్నాయి. పెదిమలు కంపించసాగాయి.

"ఆవేశపడకండి సిస్టర్! ఒక మనిషిగా, డాక్టరుగా నేను మీకు చేయ గలిగిన సహాయం చేస్తాను."

"హూ....సహాయం!నో డాక్టర్! యూ కాంట్!" అరచింది నీలిమ. "డాక్టర్! వాడు నా చెల్లిని పెళ్ళిచేసుకుంటానని వాగ్దానాలు చేశాడు. 'మా డాడీకి మన సంగతి అంతా చెప్పాను ఆయన మన వివాహానికి ఒప్పుకున్నారు. నిన్ను మా మమ్మీ ఎప్పుడూ

చూడలేదు కదా! వెంటనే రా! ఈ శుభ ముహూర్తంలో పరిచయం చేస్తాను" అంటూ దినేష్ ఓరోజు నా చెల్లికి ఫోన్ చేశాడు. అరుణ సంతోషానికి అవధుల్లేవు ఈ ప్రపంచానికి మహారాణి అయినట్టుగ సంబరపడింది. వాళ్ళింటికి వెళ్ళింది. ఆ సమయంలో దినేష్ తప్ప వాళ్ళింట్లో మరెవ్వరూ లేరు! అది అసరాగా తీసుకునే తనకు ఫోన్ చేశాడని అరుణ అర్థం చేసుకుంది. అతని దుర్బుద్ధి గ్రహించి బయటపడదామని ప్రయత్నించింది. కాని వాడు నా చెల్లిని బంధించి దారుణంగా అనుభవించాడు ఇది తెలిసినా ది గ్రేట్ చక్రపాణిగారు కిమ్మనకుండా ఉండిపోయారు. తప్పు మాదే అన్నట్టుగా మాట్లాడారు. ఇది మామూలు అతి మామూలు కథే కదూ డాక్టర్! ఎన్నో వార్తలు వచ్చాయి, వస్తున్నాయి. మరెన్నో సినిమాలు వచ్చాయి దీనిమీద ఆధారపడి. ఇంకెన్నో కథలు చదువుతున్నాం రోజూ కాని.... కాని డాక్టర్! ఒకప్రక్క ప్రశ్న, ఓ ప్రక్క ఇటువంటి సంఘటనలను తీవ్రంగా గర్హిస్తున్నా ఇంకా ఇటువంటివి ఎందుకు జరుగుతున్నాయి?"

కిరణ్ ఆమెలో పెల్లుబుకుతున్న ఆవేశం చూసి అచేతనంగ ఉండిపోయాడు.

"ఏం డాక్టర్, అలా మౌనంగా ఉండిపోయారేం? సమాధానం తెలుసు. కాని చెప్పరు! మీరేకాదు, ఎవ్వరూ చెప్పరు. డాక్టర్! మనకి ప్రశ్నలు వేసుకోవడం అలవాటైపోయింది. సమాధానం తెలిసినా ఎవ్వరి మటుకు వారు తెలియనట్టు నటించటం పరిపాటైపోయింది."

"సిస్టర్" అంటూ మధ్యలో కలుగజేసుకుందామనుకున్నాడు కాని ఆమె వాగ్ధోరణి అతడిని అశక్తుణ్ణి చేస్తోంది. ఏం మాట్లాడాలో తెలియక తికమకపడసాగాడు.

"ఈనాడు అరుణ పిచ్చిది! ఆమె తన జీవితంలో సాధించినది ఏమిటి! ఒక మెంటల్ హాస్పిటల్లో ఆమె పేరుమీద పది కేస్‌షీట్లు! కాని దానిని మోసగించి పిచ్చిదానిగా మార్చివేసిన ఆ చక్రపాణికొడుకు మరో అభాగ్యురాలిని తనసొంతంచేసుకోబోతున్నాడు! నా చెల్లెలు ఆ మెంటల్ హాస్పిటల్లో నెలల తరబడి పడిఉంటే వాడు రేపు మరో దానిని వివాహం చేసుకోబోతున్నాడు. ఎందుకంటే నా చెల్లెలు పిచ్చిది కాబట్టి వాడు తెలివైనవాడుకాబట్టి కదూ డాక్టర్! కొడుకు తప్పులను కప్పిపుచ్చి వాడికి మరోదానితో వివాహం జరిపిస్తున్న ఆ తండ్రి మరింత తెలివైనవాడు కదూ! వాళ్ళకి ఏడాక్టర్లూ అక్కర్లేదు కదూ డాక్టర్! నా చెల్లెలే పిచ్చిది! దానికే మీలాంటి సైకియాట్రిస్ట్‌ల అవసరం ఉంది! మీరు నయంచెయ్యాల్సినది నా చెల్లెని లాంటి వాళ్ళనే కదూ డాక్టర్!"

ఆమె మాటలు శూలాల్లా దిగబడుతున్నాయి డాక్టర్ కిరణ్ గుండెలో అతని మెదడులో ఇంత కాలము తలెత్తని

ప్రశ్న ఏదో అతనిని సూటిగా ప్రశ్నించ దానికి సంసిద్ధురాలవుతోంది.

"కిరణ్! మీరు ఎంతో తెలివైన వారట. గోల్డ్ మెడలిస్టు కూడాను. మీ తెలివినంతా ఉపయోగించి, ఎంతో కృషి సలిపి నా చెల్లిని బాగుపరుస్తారు. అది డిశ్చార్జ్ చేయబడుతుంది. బయటి ప్రపంచంలోకి వెళుతుంది. అప్పుడు మరో దినేష్ ఎదురవ్వడని హామీ ఏమిటి!? నా చెల్లెలు మరల మోసగించబడితే? మరల దానికి ఈ మెంటల్ హాస్పిటలే శరణ్యం కదూ డాక్టర్! మళ్ళా మీరే నయం చేస్తారు కదూ! అవును డాక్టర్! నా చెల్లెలిలాంటి అమాయక జీవులు లేకుంటే ఈ హాస్పిటల్స్ ఎందుకు!? మీరు మాత్రం జీవించేదెలా!?"

ఒరేయ్ కిరణ్! ఆమె ఘోష అర్థం చేసుకోరా! ఆమె మాటల్లోని ఆవేదన గ్రహించరా! కిరణ్ అంతరాత్మ ఘోష చేస్తోంది.

"డాక్టర్! మన హాస్పిటల్లో ఉన్న వాళ్ళంతా పుట్టుకతో పిచ్చివాళ్ళా? కాదు డాక్టర్! పిచ్చివాళ్ళుగా ముద్రవేయబడ్డ వాళ్ళు! పిచ్చివాళ్ళుగా మార్చబడ్డవాళ్ళు! తోటి మనుషుల కుతంత్రాలకి, కుట్రలకి, మోసాలకి తట్టుకోలేక ఘోరమైన మానసిక సంఘర్షణలకు లోనై, మతి స్థిమితం తప్పగా, పిచ్చివారి పేరుతో మీచే అడ్మిట్ చేసుకోబడుతున్న అభాగ్య సాంఘిక జీవులు! కాని ఒక విషయం డాక్టర్! మీరు ఈ మానసిక రోగులను బాగుపరుస్తారు! స్వస్థత చేకూరుస్తారు. కాని దినేష్, చక్రపాణిలాంటి తెలివైన వాళ్ళు వీళ్ళని మరల పిచ్చివారిగా మార్చరని హామీ ఏమిటి? నిజానికి ఎవరు పిచ్చి వాళ్ళు! కామోన్మాదియై నా చెల్లెని బలి పశువుగా మార్చిన ఆ దినేష్ పిచ్చివాడా!? లేక వాడిని నమ్మి మోసపోయిన నా చెల్లెలు పిచ్చిదా!? ఎవరు డాక్టర్? ఎవరు పిచ్చివాళ్ళు? మీరు ఎవర్ని ట్రీట్ చెయ్యాలి? మీరు ఎవర్ని బాగుచెయ్యాలి? ఆ దినేష్‌ని అలా వదిలేస్తే అరుణలాంటి యువతులు ఎంతమంది మీ హాస్పిటల్లో అడ్మిట్ అవుతారో ఊహించండి! మీ కర్తవ్యం నిర్ణయించుకోండి!"

ఆమె కిరణ్ సమాధానం ఆశించకుండా తలుపు తీసుకుని వెళ్ళిపోయింది.

డాక్టర్ కిరణ్? ఇన్నేళ్ళుగా వైద్య విద్య నభ్యసించావ్! మానసిక రోగులను నయం చేస్తానంటూ బయల్దేరావ్? ఎవరోయ్ మానసిక రోగులు? ఎవర్నోయ్ నీవు నయం చేసేది? హ్హ హ్హ హ్హా... అంతరాత్మ వికటాట్టహాసం చేస్తోంది అతనిలో.

* * *

డాక్టర్ చక్రపాణి అతిథులను రిసీవ్ చేసుకోవటంలో బిజీగా ఉన్నారు వాతావరణం కోలాహలంగా ఉంది.

డాడీ! గ్రీటింగ్స్ ఫ్రమ్ డాక్టర్ కిరణ్!" చక్రపాణి రెండవ కొడుకు ఆయనకిచ్చి వెళ్ళాడు,

డాక్టర్ చక్రపాణి మడత విప్పి చదివాడు.

'నేను నా ఉద్యోగానికి రాజీనామా చేస్తున్నాను'

– కిరణ్

* * *

అసంతృప్తిని కలిగిస్తున్న కథ ఇంక పొడిగించదలచుకోలేదు రచయిత. అక్కడితో ఆపేశాడు. కథ అచ్చయ్యాక 'కిరణ్ రాజీనామా చేశాక ఏంచేశాడు?' అంటూ రచయితకి చాలా ఉత్తరాలు వచ్చాయి. రచయితకి కిరణ్ పాత్రకోసం గాలించక తప్పిందికాదు? అతను ఓ హాస్పిటల్లో చికిత్స పొందుతున్నాడని తెలిసి అక్కడికి పరిగెత్తుకుంటూ వెళ్ళాడు రచయిత. కిరణ్‌ని ఆ స్థితిలో చూసి నొచ్చుకున్నాడు. ఏం జరిగిందంటూ ప్రశ్నించాడు. "తెలియడంలా?" మండిపడ్డాడు కిరణ్. అతనికి ఒళ్ళంతా కట్లే బుగ్గలు బూరెల్లా వాచిపోయాయి. రచయిత అతన్ని ఓదార్చాడు. జరిగింది చెప్పమని బ్రతిమాలాడు.

"పాత్రని అక్కడితో ముగించి నన్ను దిక్కుతోచని పరిస్థితిలో పడేశావ్! నేనేంచెయ్యాలని నీ ఉద్దేశం?!" కిరణ్ గదమాయించాడు. రచయిత మౌనంగా ఉండిపోయాడు.

"అసలు పిచ్చివాళ్ళు హాస్పిటల్ బయట ఉన్నారు! ముందు వారిని నయం చెయ్యండి అంటూ పరోక్షంగా నీలిమ నా కందించిన సందేశానుసరించి సమాజంలోకి అడుగుపెట్టాను. 'మీరు చేస్తున్నది తప్పు!' అని వేలెత్తి చూపాను. 'మాకు తెలుసులేవోయ్!' అంటూ నా వేలు కోసేశారు. మంచి అంటే ఇది! మనం ఈ మార్గంలో పోవాలి అని సలహా ఇచ్చా. అందుకు ప్రతిఫలంగా నా కీ సన్మానం జరిగింది" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు కిరణ్.

రచయిత అతనివంక నిస్సహాయంగా జాలిగా చూశాడు.

"నాకు తెలుసు కిరణ్! అందుకే నీ పాత్రను అక్కడితో ఆపేశాను. కాని నీవు 'రిస్కు' తీసుకున్నావ్! నేను నీ పాత్రను పొడిగించిఉంటే నీకు జరిగిన ఈ సన్మానం నాకు జరిగిఉండేది! కాని దానికి భయపడి కాదు నేనలా చేసింది అనుకున్నాడు రచయిత మనసులో.

"కిరణ్ ఈ సమాజం నిద్రపోలేదు! నిద్రపోయినట్టు నటిస్తోంది! నిద్రపోయినవాడిని మేల్కొలపవచ్చు కాని నిద్రనటిస్తున్నవాడిని ఎవరు తట్టిలేపగలరు? తనకు తానే మేల్కొనాలి ఇదే సందేశం తరతరాలుగా ఇస్తూ వస్తున్నాను. కాని ఫలితం కనిపించటం లేదు" అంటూ మరోసారి ఉస్సూరుమన్నాడు రచయిత.

## ముద్దంశెట్టి హనుమంతరావు



# పంతం

వాసవి, రైలు రాకకోసం ఆసక్తితో యెదురుచూస్తోంది. ఆమె ఒడిలో రెండేళ్ళ పాప వుంది. చేతిలో ఓ సూట్‌కేసు మాత్రమే!

అప్పుడప్పుడూ ఆమె దృష్టి, ప్లాట్‌ఫారం మీద చివరివరకూ ప్రసరిస్తోంది. ఎవరో వస్తారని. యెదురు చూస్తున్నట్లున్నాయ్ ఆమె చూపులు. కాని, యెవరూ రాలేదు.

అప్పుడే రైలు వచ్చి ఆగింది. ప్రయాణీకులు హడావిడిగా తిరుగుతున్నారు.

వాసవి, లేడీస్ కంపార్టుమెంటు వెదు క్కొని అందులోనికిపోయి కూచుంది. ఆ కంపార్టుమెంటులో అంతగా రద్దీలేదు. సూట్‌కేసు బెంచీకింద పెట్టి, యింకా కిటికీ గుండా దృష్టిని సారిస్తూనే వుంది.

రైలు చాలాసేపు అక్కడున్నా, వాసవి యెదురుచూస్తోన్న వ్యక్తి రాలేదు.

డీజిల్ ఇంజను భయంకరంగా కూత కూసింది. రైలు కదిలింది. వాసవి, బరువుగా ఓ నిట్టూర్పు విడిచింది. రైలు వేగాన్ని పుంజుకుంది. ఆమె ఆశించిన వ్యక్తి రాకపోయేసరికి, ఆమెలోని ఆత్రుత సన్నగిల్లి, పట్టుదల మరింత బిగుసు కుంది.

ఇంతకీ, ఆమె యెదురుచూస్తోన్న వ్యక్తి, యింకెవరో కాదు. సాక్షాత్తూ ఆమె భర్తే!

* * *

వాసవి భర్త ఆనందరావు, మంచి వాడే! సహనం అతనికి మారుపేరు. సహ ధర్మచారిణి అంటే అతనికి వల్లమాలిన ప్రేమ, అనురాగమూను. అయితే, అతనిలో వుండే చిన్నబలహీనత ఆత్మాభి మానం అధికం!

ఇహపోతే, వాసవి విషయం చెప్పు కోవాలంటే, కలుపుగోలుగా మసలేమంచి అమ్మాయే! భర్తపట్ల గౌరవమే! కాని, పట్టుదల అధికం. ఆమె మాట జరిగి తీరాలి. లేకుంటేనే చిక్కు వస్తుంది.

ఆ రోజు ఆదివారం —

ఆనందరావు, న్యూస్‌పేపరు చదువు కుంటున్నాడు. వాసవి అతనికి దగ్గరగా వచ్చింది.

"ఏవండీ...."

"ఏవిటి వాసవీ!"

"ఈ రోజు ఉదయం ఆటకి సినీమాకి వెళ్తున్నానండీ! వంట ముగించేసే వెళ్తా ననుకోండి. మీరు కాస్త శ్రమ తీసుకుని వడ్డించుకొని, ఆఫీసుకి వెళ్ళండి." అందామె.

"ఎవరితో వెళ్తున్నావు? పక్కింటి ఆవిడతోనా!" ఆమెకేసి చూస్తూ అడిగాడు, ఆనందరావు.

"కాదండీ! చివరింటావిడ కృష్ణవేణి లేదూ! ఆవిడతో...."

కృష్ణవేణి అంటే, ఆనందరావుకి సద్భావం లేదు. అంటే, మరేవీఁకాదు. ఆవిడకి అందరి విషయాలూఁ అన్ని విషయాలు కావాలి. అన్నీ తెలుసుకున్నాక వూరుకుంటుందా అంటే, అదీకాదు. తనకి తెలిసినవాళ్ళందరికీ చాటుతుంది. అందుకే, ఆ వీధిలో చాలామంది ఆమెతో పరిచ యాన్ని తగ్గించుకున్నారు. అదే కారణం వల్ల, ఆనందరావుకి యిష్టం లేక పోయింది — భార్య ఆవిడతో సినీమాకి వెళ్ళడం!

"ఆవిడతో సినీమాలకి వెళ్ళొద్దని చెప్పాను కదా వాసవీ! నా మాటల్ని పట్టించుకోవేం!" సౌమ్యంగానే అన్నాడు.




"ఆవిడతో వెళ్తే, తప్పేమిటండీ? ఆవిడ గుణం మంచిది కాదంటారా? యెదురుప్రశ్న వేసింది, వాసవి.

"అలా అని నేను అన్లేదే?"

"మరెందుకు వెళ్ళొద్దంటున్నారు?"

"ఆవిడ నోరు మంచిది కాదని అంతా అంటుంటారు, అందుకే!"

వాసవి మెల్లగా మందహాసం చేసింది. "ఎవరో గిట్టనివాళ్ళు, అసూయపరులు అలా అంటారులెద్దురూ! ఆమె యెంత కలుపుగోలుగా మాట్లాడుతుందని?" అందామె. "అయినా నేను చెబుతున్నాను కదా వద్దని" అయిష్టంగా అన్నాడు ఆనందరావు.

వాసవి మొహంలో రంగులుమారాయి.

ఆమె అహం దెబ్బతింది.

"అంటే నాకు యేమాత్రం స్వతంత్రం లేదంటారా? నేను కేవలం మీ బానిసనా?" ముద్రికతరో అంది.

విస్తుపోయాడు ఆనందరావు. వాసవి తనని అపార్థంచేసుకుంటోం దను కున్నాడు.

"అర్థంలేనట్టు మాట్లాడకు వాసవీ! ఏ విషయంలో నేను నిన్ను కాదన్నానని?" సూటిగా అన్నాడు.

ఇలా వారి వాదన చినికి చినికి గాలి వాన అయినట్టు, పరాకాష్ఠ నందుకుంది. ఫలితంగా పట్టుదలతో, అహంతో వాసవి అక్కగారింటికి బైలుదేరింది.

ఆనందరావు వుండమని బ్రతిమాల లేదు. ఆయనకి ఆత్మగౌరవం వుంది!

వున్నపాటున బైలుదేరింది, వాసవి. ఆనందరావు రైలుటిక్కెట్టుకు డబ్బిచ్చాడు. అది అగ్నిమీద ఆజ్యం పోసినట్టయి, ఆ డబ్బుని విసిరికొట్టింది. ఆమె దగ్గర రెండువందలున్నాయని? అతనికేం తెలుసు




ఆనందరావు మరేం అనలేదు. చంటి పాపను తీసుకుని స్టేషనుకి వచ్చేసింది చివరి క్షణంలోనైనా భర్త స్టేషనుకి వచ్చి వెళ్ళొద్దని ప్రతిమాలతాడని, ఆశించింది.... ఎదురుచూసింది, కాని అలా జరగలేదు. ఆమె పంతం మరింత పటిష్టమైంది.

* * *

రైలు రాజమండ్రిలో ఆగింది. కాఫీ తీసుకుంది వాసవి. చంటిపాపకి బిస్కెట్లు తీసుకుంది.

అంతవరకూ వాసవి మౌనాన్ని ఆమె చేష్టల్నీ తదేకంగా గమనిస్తోంది ఆ కంపార్టుమెంటులోనే వున్న కాంతం. ఆమె పక్కనే వచ్చి కూచుంది.

"ఎందాకా వెళ్తున్నావమ్మా!" ప్రశ్నించింది కాంతం.

"విజయవాడండీ."

"అక్కడ మీ ఆయన వుంటున్నారా!"

"కాదండి. మా అక్క వుంటోంది."

"అలాగా! మీ ఆయనెక్కడుంటున్నారు!"

"విశాఖలోనండీ."

"ఉద్యోగం చేస్తున్నారా!"

"ఔనండీ! పోర్టులో...."

"మరి, విశాఖలో మీ ఆయన నిన్ను సాగనంపడానికి రాలేదేవమ్మా!"

ఆ ప్రశ్నకి, వాసవి కాంతం కేసి యిబ్బందిగా చూసింది.

"తీరిక లేక...." ముక్తసరిగ సమాధాన మిచ్చింది.

కాంతం నవ్వింది. ఆమె పళ్ళు కిళ్ళీ అలవాటువల్ల గామోసు, కసబారి వున్నయ్. ఆమెకి ముప్ఫయిఆయిదేళ్ళుంటాయి. ఆమె మాటల్లో సౌమ్యత, యెదుటి

వారిని అకట్టుకునే నేర్పు. వున్నాయి. కాని, నవ్వులో మార్దవంలేదు. చూపులు కరకుగానే వున్నయ్.

"నేను నమ్మను. ఎందుకమ్మా అబద్ధం చెబుతావు? మీ ఆయనతో తగవు పడి వస్తున్నావు, ఔనా?"

ఏవో దివ్యశక్తులున్న వ్యక్తిలా కాంతం అలా అనేసరికి, వాసవికి క్షణం నోటమాటరాలేదు.

"ఎట్లా మీరు గ్రహించారండీ?" ఆమెని పరిశీలనగా చూస్తూ, ప్రశ్నించింది.

కాంతం, మళ్ళీ మెల్లిగా మందహాసం చేసింది.

"నేను ప్రతినిత్యం యెంతోమందిని చూస్తుంటాను. వారితో మాట్లాడుతూ వుంటాను. మొహంచూసి, మనిషి మనస్తత్వాన్ని చెప్పేయగల్ను. నువ్వు విశాఖపట్నంలో రైలెక్కిన దగ్గర్నించి నీ చేష్టలు, నీ ఆతృత, నీలోని భావాలు, గమనిస్తూనే వున్నాను. అందుకే, గ్రహించగలిగాను. మీ ఆయన నీతో గొడవతెచ్చుకున్నాడూ అంటే, ఆయన వట్టి మూర్ఖుడనే చెప్పాలి. లేదా తెలివి తక్కువవాడైనా అయ్యుండాలి.ఎందుకో తెలుసా? నీ అంతటి అందగత్తెతో తగువు పడ్డమా? నిజానికి, నీ అందానికి దాసోహమనాలి. నిన్ను పువ్వుల్లోపెట్టి పూజించాలి. అసలు, నీలాంటి అపురూప సౌందర్యవతి బొంబాయిలాటి నగరంలో వుండివుంటే, నీ జీవితమే మరో స్థాయిలో వుండేది కదూ? కారుల్లో తిరిగేదానివి.... పూల పాన్పుల్లో శయనించేదానివి.... ఒహ్ ఏమిటి? ఆ జీవితం వర్ణనాతీతంగా వుండేది."

వాసవికి, ఆమె మాటల్లోని గూడార్థ ఏం అర్థం కాలేదు.

"అంటే, మీ వుద్దేశం?" అమాయకంగా అడిగింది.

కాంతం కాస్త తెప్పరిల్లింది. వాసవిలో ఆసక్తిని గమనించి తృప్తిపడింది.

"ఏముందమ్మా? నీలాంటి అందగత్తె బొంబాయి లాంటి నగరంలో వుంటే, ఎన్ని సినీమా ఛాన్సులు.... ఎన్ని అడ్వర్టయిజ్‌మెంట్ల అఫర్లు ....? డబ్బుకి కొదవే వుండదు. డబ్బుతోపాటు పేరుప్రతిష్టలు, జీవితం భోగభాగ్యాలతో స్వర్గతుల్యంగా వుంటుంది. అటువంటిది, నువ్వీరోజు యిల్లాంటి పరిస్థితిలో వున్నావంటే. నిజంగా నాకే బాధాకరంగా వుంది." గుక్కతిప్పుకోకుండా అంది, కాంతం. ఆమె మాటలతీరు చూస్తుంటే కొద్దాగాపోప్పో చదువుకున్నట్టే కనిపిస్తోంది. "మీరు బొంబాయిలో వుంటున్నారా?" యినుమడించిన ఆసక్తితో అడిగింది, వాసవి. ఆమెకి, యెందుకో కాంతం గురించి తెలుసుకోవాలన్న జిజ్ఞాస కలిగింది.

సర్వసాధారణంగా ఆడవాళ్ళను మెప్పించాలంటే, వాళ్ళ అందాన్ని తెగ పొగిడితే చాలు— ఐసయిపోతారు. అదే జరిగింది వాసవి విషయంలోనూ. తనకి తెలీని యేదో గొప్పతనం తనలో వుందనిపించిందామెకి.

కాంతం, మురిపెంగా చిన్న నవ్వు నవ్వింది.

"ఔనమ్మా! ఇప్పుడా? ఎన్నేళ్ళనించో వుంటున్నాను. మా ఆయన బొంబాయిలో ఓ పెద్ద స్టూడియోలో కెమెరామెన్. ఈ మధ్యనే మాకు తెలిసిన ఓ కాకినాడ అమ్మాయిని తీసుకెళ్ళి, మా ఆయన సినీమా ఛాన్సు యిప్పించారు. మరి కొన్నాళ్ళకి, ఆమె ఓ పెద్ద 'స్టార్' అయి కూచుంటుంది చూడు! ఇటువంటి అదృష్టాలు, అవకాశాలు, ప్రయత్నాలవల్ల రావమ్మా! హఠాత్తుగా, అనుకోకుండా వచ్చేస్తూ వుంటాయి. అటువంటి అదృష్టమే నీకూ పట్టనున్నదేమో అనిపిస్తోంది."

వాసవి, క్షణం యోచనలోపడింది. సినీమాలంటే ఆమెకి మొదట్నుంచి పిచ్చే, అందుకే కాంతంమాటలు ఆమెలో కొంత అలజడిని సృష్టించాయనే చెప్పాలి. కాని, భర్త ఒప్పుకుంటాడా? "కాని, మా ఆయన ఒప్పుకోరండీ!" బేలగా అంది వాసవి.

కాంతం మళ్ళీ నవ్వింది.

"ఇంకా, 'మీ ఆయన' అంటావేవిటమ్మా నీ తెలివితక్కువతనం కాపోతే! నువ్వు ఓసారి మీ ఆయనతో తగువుపడి ఇల్లు దాటావంటే, అక్కడితో కథ ముగిసినట్టే! నీకు మళ్ళీ ఆ ఇంట్లో స్థానం వుండదు. అదే వుద్దేశంతో, మీ ఆయన నిన్ను వుండమని కూడా అనలేదు సరికదా, మర్యాదకోసమైనా స్టేషనుకి రాలేదు. నువ్వు వెళ్ళిపోవడమే అతను కోరుకున్నది.. యిప్పటికీ అర్థంచేసుకోలేకపోతున్నావా?" పరిస్థితిని భూతద్దంలో చూపించినట్టుగా వివరించింది. కాంతం.

వాసవి, తెల్లమొహం వేసింది. ఆమె చెప్పినట్టే జరుగుతుందా? ఆమెకి కళ్ళు తిరిగినట్టయ్యాయి. తాను 'పంతం'తో వచ్చేసింది. తనని తీసుకెళ్ళడానికి, ఆయన రాకపోతే....? తనే ఆత్మాభిమానాన్ని, పట్టుదలని, చంపుకుని ఆయన దగ్గరికి వెళ్ళాల్సిందేనా? అప్పుడింక, తనకి మర్యాద యేముంటుంది?.... తనెందుకంతగా దిగజారిపోవాలి? తనకి మాత్రం ఆత్మగౌరవం లేదూ? కాంతం అన్నట్టు తనకి బొంబాయిలో సినీమా ఛాన్సు వస్తే....? తన భవిష్యత్తే మారిపోతుందే! ఆ తలంపు ఓసారి వచ్చిందిగా? మళ్ళీ గుండెల్లో గుబులు.... యేదో భయం.... ఆమె మనస్సు పరిపరివిధాల ఆలోచనల్ని సాగించింది.

"అయితే కాంతంగారూ, మా ఆయన నన్ను మళ్ళీ యింటికి రానివ్వరంటారా?" అయోమయంగా ప్రశ్నించింది.

కాంతం నేర్పుగా నవ్వింది.

"పిచ్చిదానా! నీకు ప్రపంచజ్ఞానమే శూన్యంలా వుంది. ఆడది ఇంట్లోనించి పట్టుదలతో బైటపడిదంటే, ఆమె శీలం గురించి యెన్నో శంకలుపుడతాయి భర్తకి ఇహ లోకులు గురించి చెప్పనవసరం లేదు. కాకుల్లా పొడుస్తారు. నువ్వు నిజం చెప్పినా నమ్మరు. అటువంటి పరిస్థితుల్లో నువ్వు అందరికి తలొంచాల్సిన అవసరం రావొచ్చు. ఏ తప్పుచేయని నువ్వు యెందుకు తలొంచాలి! నీలో యింతటి అపురూప సౌందర్యం వుండికూడా ఎవరి కయినా యెందుకు దాసోహమనాలి! నీకే వాళ్ళంతా దాసోహమనాలి. నువ్వు సినిమాల్లో చేరి, పుష్కలంగా డబ్బు గడిస్తుంటే, అప్పుడు నీ భర్తే కోరివచ్చి నీ పంచన చేరుతాడు. నీ మంచిని కోరి చెప్తున్నాను. ఆలోచించు."

వాసవి మళ్ళీ ఆలోచనల్లో పడింది. ఏం చెయ్యడమో, ఆమె ఓ నిర్ణయానికి రాలేకపోతోంది. ఎందుకయినా మంచిది, అక్క సలహా తీసుకోవడం మంచిదేమోనన్న సదుద్దేశం ఆమెలో మొలకెత్తింది "నాకు సినీమాల్లో వేషాలు వేయడమంటే సరదాగానే వుందండీ; అయితేనేం — మా అక్క సలహా తీసుకోకుండా నేనే నిర్ణయానికి రాలేను. దానికి సినీమాలంటే మరీ పిచ్చి. ఈ విషయం చెబితే, అదీ కాదనదేమో!" వుత్సాహంగానే అంది.

కాంతం నిరుత్సాహపడింది. ఆమె మొహం మ్లానమయింది.

మీ అక్క సలహా తీసుకుందుకు, వ్యవధియేదీ! నేను నేరుగా యీబండిలోనే వెళ్ళిపోవాలి కదా!" అంది కాంతం.

అదీ నిజమే; కాంతం వెళ్ళిపోతే, అట్లాంటి పరపతిగల వ్యక్తి తారసపడాలి కదా మళ్ళీ! కాని.... కాని.... తానుగా ఏ నిర్ణయాన్నీ తీసుకోలేదు. తన శ్రేయోభిలాషి అక్కని అడగాల్సిందే!-అనుకుంది వాసవి.

"అలా అయితే నేనేం చెయ్యలేనండీ మా అక్కని అడక్కుండా నేను యే నిర్ణయాన్ని తీసుకోలేను. మీరో రోజు విజయవాడలో ఆగలేరా!"

"నాకు అక్కడ బోల్డు పనులున్నా యమ్మా; ఎలాగా అని ఆలోచిస్తున్నాను."

"మరేంచేస్తాంలెండి...." నిరుత్సాహంగా అంది వాసవి.

కాంతంకి యేమి పాలుపోలేదు. ఎన్ని విధాల ప్రయత్నించినా, వాసవిని తనకి అనుకూలంగా మార్చుకోవడం కష్టసాధ్యమే ననిపించింది. చివరి ప్రయత్నంగా తనే ఓ రోజు విజయవాడలో వుండిపోవడం మంచిదనిపించింది,

"ఏవిటో వాసవీ; నిన్ను చూస్తుంటే నిన్నెలాగయినా తారాపథంలోకి తీసుకుపోవాలనిపిస్తోంది. నువ్వేమో, మొండి పట్టుతో మీ అక్క సలహా తీసుకోవాలంటున్నావు. సరే మరేంచేస్తాం? అలాగే



కానియ్. కాని. ఒక్క విషయం, ఆడ వాళ్ళ మనస్తత్వాలు చిత్రమైనవి. ఎంత అక్క చెల్లెళ్ళయినా, ఒకరు వృద్ధిలోకి వస్తారంటే, మరొకరికి అసూయగా వుంటుంది. ఇదే కారణంవల్ల మీ అక్క వద్దంటుందనుకో, అప్పుడేం జేస్తావు?"

సూటిగా వాసవి మొహంలోకి చూస్తూ అడిగింది.

"అప్పటి విషయం నాకు నేనుగా ఆలోచిస్తాలెండి."

కాంతం బరువుగా ఓ నిశ్వాసం వదిలింది.

"సరే, నీకోసం, నీ భవిష్యత్తు కోసం నేను యీ ఒక్కరాత్రి విజయవాడలో వుండుపోతాన్లే వాసవీ! నిన్ను జూస్తుంటే సహాయం చేయాలనిపిస్తోంది! రేపు వుదయం సరిగ్గా యేదో ఒక నిర్ణయాని కొచ్చి నేరుగా వచ్చేసెయ్. నేను చెప్పిందంతా గుర్తుంచుకో. స్త్రీల వెయిటింగు రూమ్‌లో వుంటాను. ఏం" అంది కాంతం తానేదో వాసవి శ్రేయస్సుకే యిదంతా చేస్తున్న భావన ఆమెలో కలిగిస్తూ.

"అలాగేలెండి...."

మరికొద్ది సేపట్లో రైలు విజయవాడ ప్లాట్‌ఫారం మీద ఆగింది గంభీరంగా. విద్యుద్దీపాల వెల్తురులో ప్లాట్‌ఫారం కళకళలాడుతోంది. ఎక్కడ చూసినా ప్రయాణీకులే!

వాసవి హఠాత్తుగ ప్లాటుఫారంపై అక్క వాసంతి బావమూర్తిని చూసి ఆశ్చర్యపోయింది, వాళ్ళెందుకొచ్చారోనని.

"అక్కా!" అని కేకవేసింది.

వాసంతి వాసవి కంఠస్వరాన్ని గుర్తుపట్టినట్టుగా. ఆమెకేసి తిరిగి చూసింది. ఆమె మొహంలో ఆశ్చర్యం తొణికిసలాడింది.

వాసంతి, మూర్తి వాసవి వున్న కంపార్టుమెంట్ దగ్గరికి వచ్చారు.

"ఇదేవిటే అనుకోకుండా ఓ కార్డు ముక్కయినా రాయకుండా వచ్చావు!" ప్రశ్నించింది వాసంతి.

"ఆనందరావు యేడీ!" అడిగాడు మూర్తి.

వాసవి అప్పటికే బండి దిగింది.

"అవన్నీ తర్వాత చెప్తాలేగాని! మీరిలా వచ్చారేవిటి! మావారు టెలిగ్రామ్ గాని యిచ్చారా!" తన అనుమానాన్ని నివృత్తి చేసుకుందుకు ప్రశ్నించింది."

"అబ్బే అటువంటిదేం లేదే! మా ఇంటి ప్రక్కవాళ్ళు మద్రాసువెళ్తుంటేను వాళ్ళని సాగనంపడానికి యిలా వచ్చాం. నీ సంగతేవిటి!" అంది వాసంతి

"తర్వాత చెబుతాలే! మీరు వాళ్ళని యెక్కించేసి రండి, ఇక్కడే వుంటాను."

"ఫరవాలేదులేవే! మీ బావగారు వెళ్ళి వస్తారులే. మనం ఇక్కడ వుందాం." అంటూ భర్తను పంపింది వాసంతి.

అంతవరకు అక్కడేవున్న కాంతం వాసవిని వుద్దేశించి,

"నేను వుంటానమ్మా వాసవీ! నేను చెప్పిం గుర్తుంచుకో. నీ భవిష్యత్తు గురించి మర్చిపోకు వస్తా!" అని చెప్తూ అక్కడ్నించి వెళ్ళిపోయింది కాంతం.

"ఎవరే యీవిడ" అసక్తిగా అడిగింది వాసంతి!

"ఇంటికి పద, చెప్తాను."

"అబ్బ అన్నీ తర్వాత చెప్తాన్ అంటున్నావు.... ఏమిటో అర్థంకాదు!." విసుగ్గా అంది వాసంతి,

"చెప్తానన్నాగ!" అంటూ ప్రసంగాన్ని మార్చేసి మూర్తి వచ్చేవరకు గడిపేసింది.

మూర్తి రానే వచ్చాడు.

"పోదామా!" అన్నాడు వస్తూనే.

"వాళ్ళకి చెప్పారా, నేను రాలేక పోయానని."

"చెప్పాను . పద!" బైయలుదేరాడు వాసవి దగ్గర్నుంచి సూట్ కేసు తీసుకుని. అతన్ని అనుసరించారు వాళ్ళిద్దరు అక్కచెల్లెలు.

* * *

ఆ రాత్రి భోజనాలయ్యాక, తీరిగ్గా కూచున్నారు వాసంతి,మూర్తి, వాసవీను. అప్పుడు చెప్పింది వాసవి, తానెందుకు వచ్చేసిందీ, రైల్లో కాంతం కలిసి యేం సలహా యిచ్చిందను.

అంతా విన్నాక వాసంతి బాధగా నిట్టూర్పు విడిచింది.

"నీకు ఎన్నిసార్లు చెప్పినా, అహాన్ని చంపుకోలేకపోతున్నావే వాసవి! నువ్వు చేసిన పని తప్పని నీకు అనింపిచక పోవడం నీ తెలివితక్కువతనానికి నిదర్శనం...." అంటూ మందలించింది వాసంతి.

మూర్తి అందుకున్నాడు!

"అది సరేగాని వాసవి,బండిలో కలిసి నీకు బంగారు భవిష్యత్తును కల్పిస్తానని చెప్పిన ఆ కాంతం గురించి నీ కేమీ అనుమానం కలగలేదా!" ప్రశ్నించాడు.

"అనుమానమా! ఎందుకు బావ అనుమానం! అయోమయంగా అంది వాసవి.

"ఎందుకేవిటి,ఇటీవల యెన్నో సంఘటనలు చదువుతున్నాం వార్తాపత్రికల్లో నీకు గుర్తు లేదా; ఆమె నీ మీద జాలి పడి, బొంబాయి తీసుకుపోయి. సినిమా చాన్సు యిప్పిస్తానంటే నువ్వు నిజమేనని నమ్మేశావా!"

"నిజంకాదా!" తెల్లమొహం వేసింది వాసవి.

"ఎంత అమాయకురాలివి వాసవీ!నీకు అహం వుందేగాని ఆలోచన లేదు. ఎంత ప్రమాదం తప్పిందో, తెలుసా! నీలో యిన్ని ఆశలు రేకెత్తించి నిన్ను మభ్య పెట్టి బొంబాయి తీసుకుపోవాలనే ఆమె ప్రయత్నించి నువ్వు వెళ్ళివుంటే, నిన్ను చిత్రసీమలో కాదు ప్రవేశపెట్టేది.... వేశ్యాగృహంలో....నీ అందాన్ని క్యాష్ చేసుకుంటారన్న మాట.."

"ఆ.." సుమారు మూర్ఛపోయినంత పనయింది, వాసవికి. ఆమె మొహం స్వేదతో నిండింది. ఓసారి చీరచెంగుతో మొఖాన్ని ఒత్తుకుంది.

"ఎంత వుపద్రవం తప్పిందో చూశావా వాసవీ! ఏ దేవుడో నిన్ను పరోక్షంగా కాపాడాడు గాని! నాతో సంప్రదించాలని వచ్చావు! లేకుంటే, యేం జరిగేదో....

ఇదంతా యెందుకు జరిగిందంటావు? నువ్వు మీ ఆయన్తో కయ్యం పెట్టుకుని విడిపోయి వచ్చేసిన నీ తెలివితక్కువ అనరాగా,స్త్రీ అదో బలహీనతగా తీసుకుం దామె. ఆ క్షణంలో నీ అదృష్టం బావుండి ఆపాటి విచక్షణాజ్ఞానం పొడచూపింది. నీలో అహం ఎటువంటి అనర్థం తెస్తుందో యిప్పుడైనా ఆలోచించు వాసవీ!" మళ్ళీ మందలించింది వాసంతి.

వాసవి మరి వినలేకపోయింది.

ఆ మె క ళ్ళు నీ ళ్ళ ప ర్యం ం త మయ్యాయి.

"నన్ను క్షమించక్కా. నా తప్పు తెలుసుకున్నాను. దాని పర్యవసానాలు పరోక్షంగా యెలా వుంటాయో తెలుసు కున్నాను. రేపే ఆయన దగ్గరికి వెళ్ళిపో తాను!" రుద్ధస్వరంతో అంది వాసవి.

"ఈ క్షణంలో పశ్చాత్తాపపడడం కాదే వాసవీ; మళ్ళీ యెప్పుడు యిలాంటి పొరపాటు జరక్కుండా చూసుకో!"

"అలాగేనక్కా."

"సర్లేగానీ వాసవీ, ఆ బొంబాయి మహిళ యెక్కడుంటానండి?" అడిగాడు.

"స్త్రీల వెయిటింగ్‌రూమ్‌లో...."

సరే, రేపు నువ్వు మామూలుగా బైలుదేరు. తర్వాత కథ నేను నడుపు తాను" అన్నాడు మూర్తి.

సరేనన్నట్టు తలూపింది వాసవి.

* * *

మర్నాడు మూర్తి తనకి తెలిసిన ఓ యస్ ఐ.ని కలిసి సంగతంతా వివరిం చాడు. ఎస్.ఐని మఫ్టీలో మూర్తివాసవిలతో స్టేషనుకి వచ్చాడు.

వాసవి ముందు నడుస్తోంది, చేతిలో ఒక్క సూట్‌కేసుతో. వాసవికోసం వొళ్ళంతా కళ్ళుచేసుకుని యెదురు చూస్తోన్న కాంతం, ఆమె వస్తూండటం చూసి సంతోషంతో వుక్కిరిబిక్కిరి అయ్యింది. నవ్వుతూ ఆహ్వానించింది.

"వచ్చేశావా వాసవీ! మీ అక్క ఒప్పు కుంది కదా! అహా! నాకెంతో ఆనందంగా వుంది సుమా," అంది ఒక్క గుక్కలో కాంతం.

వాసవి సన్నగా మందహాసం చేసింది ఏం మాట్లాడలేదు!

"చంటిపాపని వదిలేసి మంచిపని చేశావు...." మళ్ళీ అంది కాంతం.

అప్పుడే అక్కడికి చేరుకున్న మూర్తి "నిజమే! మీకు మరీ లాభం.. అంతే కదూ!" అన్నాడు.

"ఏమిటండీ మీరంటున్నది?" తెల్ల బోతూ అంది కాంతం.

"ఏమిటో యిక్కడ కాదు చెప్పడం పోలీసు స్టేషన్లో. నేనెవర్నో తెలుసా! ఎస్ ఐ.ని. నీ ఆట కట్టించాలని యిలా మఫ్టీలో వచ్చాను. ఇలా యెంతమందిని మోసంచేసి తీసుకెళ్ళావో నీచేతకక్కిస్తా అంటూ, "మూర్తీ పోలీసుస్టేషనుకి ఫోనుచెయ్యి వేను పంపిచమన్నానని.." అన్నాడు. మూర్తి అక్కడ్నించి స్టేషను మాష్టరుగారికేసి వెళ్ళాడు.

కాంతంమొహం మ్లానమయ్యింది. ఎలాగయినా తప్పించుకోవాలని ఆమె మనసు ఘోషిస్తున్నా తప్పించుకోవడం సాధ్యంకాదనుకుని మొహం దించుకుంది

"నువ్వో స్త్రీవై వుండి స్త్రీలనే యిలా వంచిస్తూ వుండటం, మరీ రాక్షసత్వం. నిన్నిలా విడిచిపెట్టను.. ముందు పోలీసు స్టేషనుకి పద.... చెప్తా...." కటువుగా అన్నాడు ఎస్.ఐ.

"ఏదో బుద్ధి గడ్డితింది బాబుగారు కనికరించి నన్నొదిలేయండి మరెప్పుడూ యిటాంటి పని చెయ్యను." అంటూ లెంపలేసుకుంది కాంతం.

"ఈ వేషాలు నా దగ్గర పనికిరావు. నీకున్న ముఠా ఎక్కడుందో తెలుసుకోకుండా నిన్ను విడిచిపెడతాననుకోకు ....నోరు మూసుకుని పడుండు" అని గర్జించాడు యినస్పెక్టర్.

కాంతం దిగాలుపడిపోయింది. వాసవి పట్ల ఆమెకి కసి, కోపం పెరిగినయ్.... ఆమెకేసి యెర్రగా చూసింది కాని ఏమీ చేయగలదు! పోలీసు వేను రానే వచ్చింది. కాంతం వేనులో కూచోబెట్టి తనూ వేనులోనే వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్.

"చూశావా వాసవీ, నా అనుమానం యెలా నిజమయిందో" అన్నాడు మూర్తి.

"థాంక్స్ బావ!" మొహం దించుకొని అంది.

వాళ్ళిద్దరు ఇంటికి వెళ్ళిపోయారు.

ఆరోజు సాయంత్రం బండికే కూతుర్ని తీసుకుని భర్త దగ్గరికి ప్రయాణం కట్టింది వాసవి. ఆమె వెంట వాసంతి, మూర్తి కూడా వెళ్ళారు.

* * *

ఆనందరావు వాసవిని చిరునవ్వుతో ఆహ్వానించాడు.

వాసవి సిగ్గుతో మొహం దించుకుంది.

వాసంతి, మూర్తి పరస్పరం మొహాలు చూసుకొని నవ్వుతున్నారు.



# సీరియల్

# సౌందర్యదీపం

## ఆర్. సంధ్యాదేవి

(గత సంచిక తరువాయి)

### 51

పోర్టికో కారు ఆగిన శబ్దం అయింది. అందరూ ఒక్కసారి అలా అయిపోయారు.

అంబిక వచ్చింది. అందరి గుండెలు ఒక్కసారి అదిరిపోయాయి.

అంతవరకు సంబరంగా ఎదురు చూస్తున్న ఇందు అన్నగారి వైఖరి చూస్తూ గడగడ వణికిపోయింది. అంబికను ఈ రోజు చంపేస్తాడు అని భయంవేసింది. ఎదురు వెళ్ళి ఆమెకు చెప్పేస్తే!

చెప్పే అవకాశం లేదు.

ఆమె లోపలకి వచ్చేస్తుంటుంది.

అన్నయ్య ఆమె రావటమే ఆలస్యం అన్నట్టు కళ్ళు ఎర్రగా చేసుకుని శక్తి అంతా గుప్పెట్లోకి తెచ్చుకుని మరీ చూస్తున్నాడు.

ఎవరికి వాళ్ళే మాటాపలుకు లేనట్టు అలా ఉండిపోయారు, ఏం చెయ్యలేని పరిస్థితిలో భగవంతుడిమీద భారంవేసి.

అంబిక లోపలికి అడుగు పెడ్తూనే హాలులో నిలబడ్డ అందరివైపు పరిశీలనగా చూసింది.

గణేష్‌రావుగారు, సుభద్రమ్మ అలా నిలబడిపోయారు ఏం మట్లాడకుండా.

ఇంద్రసేన సరేసరి.

అంబిక భర్తవైపు చూసింది. ఆ చూడటంలో భయపడ్తూ చూడ్లేదు.

ధైర్యంగా ధీమాగా చూసింది.

జయరామ్ ఆమెను చూస్తూనే నిప్పులు కక్కుతూ ఒక్కో అడుగు ముందుకి వేస్తూ ఆమెను సమీపించాడు.

అయినా అంబిక అతని వైఖరి చూసి జడిసిపోలేదు. రెప్పవాల్చకుండా అలాగే భర్తవైపు చూడసాగింది.

"నన్ను .... నన్ను చేతకాని వెధవని చేసి యింట్లో కుర్చోబెట్టి వెళ్తావా! నీకు ఎంత ధైర్యం నా సంగతి తెలిసే అలా ప్రవర్తించేవా!" అంటూ పళ్ళు పటపట లాడించేడు.

"బోనులో పులి బోనులోనే జీవితాంతం ఉండిపోతుంది అనుకున్నావా! బోనులో









నుండి బయటపడలేదు అనుకున్నావా? మాట్లాడవేం!" అంటూ బిగ్గరగా అరిచాడు.

అతను అరిచిన అరుపుకి యిల్లు అంతా దద్దరిల్లిపోయింది.

సుభద్రమ్మ నిజంగా భయపడిపోయింది. కొడుకు ఆ రోజు కోడల్ని చంపేస్తాడేమో అని. అతను అంత గట్టిగా అరిచినా అంబిక అదిరిపోలేదు బెదిరిపోలేదు. హుందాగా చిరునవ్వు నవ్వింది. ఏ మాత్రం తొణక్కుండా.

"ఏమిటా ధీమా? సమాధానం చెప్పవే" అంటూ అరిచాడు.

"మీకు.... నేను.... సమాధానం చెప్పాలా!" ఒక్కో మాట విడివిడిగా నొక్కి నొక్కి మరీ చెప్పింది.

"అంటే నాకు నువ్వు సమాధానం చెప్పనవసరం లేదన్నమాట. నేను అంటే నీకు అంత నిర్లక్ష్యమా!" అంటూ ఒక చేత్తోనే ఆమె చెంపలు రెండు అదిరిపోయేట్టుగా ఎడాపెడా వాయించేశాడు. బలం కొద్దీ కొట్టిన ఆ దెబ్బలకి చెంపలు ఎర్రగా కందిపోయాయి.

కళ్ళనీళ్ళు గిర్రున తిరిగిపోయాయి ఆ బాధను భరించలేక అన్నట్టు.

పైపంటితో క్రింద పెదవిని గట్టిగా రక్తం వచ్చినట్టుగా నొక్కిపట్టి బాధను భరించడానికి ఆమె శక్తి అంతా ఉపయోగిస్తూ దుఃఖాన్ని గుండెల్లో నుండి బయటపడకుండా ఆపుకోసాగింది.

సుభద్రమ్మ మనసు ఆగలేదు.

జయరామ్ అంబికను ఇంకా కొట్టి చంపడానికి సిద్ధపడ్డట్టు ఆమె చెయ్యి పట్టుకొని పైకి ఎత్తాడు.

"బాబూ! ఆగు. నా మాట విను. ఆ అమ్మాయి ఒంటిమీద చెయ్యివేస్తే నన్ను చంపుకుతిన్నట్టే. ఆగు నా మాట విను" అంటూ కొడుకు చెయ్యి గట్టిగా పట్టుకుంది.

"ఉండు అమ్మా. నన్నాపకు. దీన్ని నరికి పోగులుపెట్టినా తప్పేమీలేదు. ముందు చెయ్యి వదలమ్మా" అన్నాడు ఆవేశంగా.

"ఆగు బాబూ, నా మాట శాంతంగా విను. కాస్త ఆవేశం తగ్గించుకో. ఆ అమ్మాయి తప్పు ఏంలేదు" అంటూ కొడుకుని ప్రతిమాలసాగింది. అతను వినకుండా తల్లిని పక్కకు గెంటేయ సాగాడు.

"గణేష్‌గావుగారు అంతవరకు మౌనంగా ఉండిపోయినా ఇక మౌనంగా ఉండలేకపోయారు. కొడుకు దగ్గరగా వచ్చి "జయా!" అంటూ కొడుకు చెయ్యి పట్టుకున్నారు.

ఆయన కంఠస్వరం గంభీరంగా పలికింది.

"ఆగు. నా మాట విను. అమ్మాయి తప్పు ఏంలేదు" అన్నారు.

"ఉండండి నాన్నగారు, నన్ను ఆపకండి" అన్నాడు మహా ఆవేశంగా. కొడుకుని బలవంతంగా ఇటు లాగే శారు ఆయన.

ఇంద్రసేన చటుక్కున వెళ్ళి అన్న గారి చెయ్యిపట్టుకుంది."ఆగు అన్నయ్యా కొంచెం శాంతంగా ఆలోచించు" అంది.

జయరామ్‌ని అందరూ అన్నివైపులా కట్టేశారు కదలకుండా.

అతని కోపం మాత్రం చల్లారలేదు.

తల్లీ తండ్రి చెల్లెలు తనని కాస్త వదిలితే అంబికను నరికిపారేద్దామని పిస్తుంది అతనికి. అందరూ జయరామ్‌ని ఆపుతుంటే అంబిక వాళ్ళందరివైపు చూస్తూ "ఎందుకండీ ఆయన్ని మాటలతో అలా కట్టిపడేస్తున్నారు! ముందు ఆయన్ని వదలండి. ఆయన నాకు తాళికట్టిన భర్త. నా ప్రాణం తియ్యడానికి ఆయనకు హక్కు ఉంది. నన్ను దండించే హక్కు ఉంది. నాకు నూరేళ్ళ జీవితం ప్రసా దించాలన్నా ఆయన చేతిలోనే ఉంది. భార్య కష్టసుఖాల్లో పాలుపంచుకునే భర్త, భార్యకు అనురాగాన్ని పంచి ఇచ్చే భర్తకు భార్యపై సర్వాధికారాలు ఉన్నా యండీ. అందుకే ఆయన్ని వదిలేయ మంటున్నాను. ఆయన నన్ను అర్థం చేసుకుంటే సంతోషం. మన చేతిక్రింద పనిచేస్తున్న వర్కర్స్ అంటే ఎవరు! మన పిల్లలతో సమానం. కష్టం వచ్చినా సుఖం వచ్చినా వాళ్ళు ఎవరితో చెప్పు కుంటారు! మనతో చెప్పకోక."

కాలే కడుపులకి పంచభక్ష్యపరమాన్నాలు పెట్టమని అడగలేదే. కడుపునిండా ఇంత గంజిపొయ్యమని అడిగారు."

"మండే గుండెలపై పన్నీరు పొయ్యమని అడగలేదే మంచిమాటచెప్పి ఓదార్చి ఆ మండే గుండెలను చల్లార్చమని చెప్పారు, అంతే.

"అంతే వాళ్ళు అడిగేరు.

"తిన్నగా మనల్నే వచ్చి అడగాలి అంటే మనదాకా ఎవరు రానిస్తారు! దేవుడు వరమిచ్చినా పూజారి వరం ఇవ్వనివ్వడు. మధ్యవాళ్ళు అడ్డేస్తారు. దాంతో వాళ్ళు పిచ్చెక్కి పోయారు. కడుపులు నిండే దారిలేదు. చెప్పుకునే అవకాశం వాళ్ళకి కన్పించలేదు. దాంతో ఆకలి కోపం పిచ్చెత్తించగా అందరూ ఎదురుతిరిగారు. అంతే అంతే వాళ్ళు చేసింది.

"బిడ్డ ఆకలితో ఏడుస్తుంటే పీకనులిమి చంపేస్తుందా ఏ తల్లి అయినా! బిడ్డ మనసు తెలుసుకుని కడుపు నిండా అన్నంపెట్టి కళ్ళుతుడిచి జోకొట్టి నిద్ర పుచ్చుతుంది. అంతే అలాగే యజమానులు తమ కర్తవ్యాన్ని బాధ్యతల్ని గుర్తెచ్చుకుని వర్కర్స్ పట్ల అలాగే ప్రవర్తించాలి" అంది ఆవేశంగా.

అలా అంటున్నప్పుడు ఆమె కళ్ళు ఎర్రబడిపోయాయి. పిడికిళ్ళు బిగుసుకుపోయాయి. ఒళ్ళు అంతా చెమట బిందువులతో తడిసిపోయింది. అంబిక అంత ఆవేశంగా ఒకొక్క మాట వివరించి నొక్కి చెప్తుంటే, గణేష్‌రావుగారు, జయరామ్ ఇద్దరు ముఖముఖాలు చూసుకున్నారు.

గణేష్‌రావు గారు కోడలి మాటలు వింటూనే సిగ్గుపడ్డట్టు అయి తలవంచుకున్నారు.

జయరామ్ బుర్ర గిర్రున తిరిగిపో సాగింది.

అంబిక మాటల్లో ఎంత నిజం దాగి ఉంది!

వర్కర్స్ పనిచెయ్యకుండా ఎదురు తిరిగారు అంటే అర్థం!

జయరామ్ కోపం అంతా మెల్లమెల్లగా తగ్గిపోసాగింది.

అంబిక నెమ్మదిగా అంది.

"నేను ఈ యింటి కోడలిగా వచ్చాను అంటే కొన్ని బాధ్యతలు నెత్తిన వేసుకున్నట్లే. మొట్టమొదట నా భర్తను ఎవరైనా ఏమైనా అంటే సహించి భరించలేను. ఆయన్ను అందరూ గౌరవించాలి పూజించాలి. అందుకు ఆయన తన బాధ్యతల్ని గుర్తుపెట్టుకుని మసులుకోవాలి. అందరి మంచిచెడ్డలు కనుక్కుంటూ ఆయనఅందరికిమంచిఅవ్వాలి. అందుకు భార్యగా నేను చేస్తున్న కృషి ఇది."

"ఇక రెండవ బాధ్యత అత్తగారు. మామగారు అంటే నాథర్తకు జన్మనిచ్చిన పూజ్యులు. వారిని ఈ పెద్దవయసులో కష్టపెట్టకుండా వారికి కోడల్ని అయినా వారి మనసు తెలుసుకుని కూతురిగా వార్ని సుఖపెట్టి పూజించాలి. ఆడదానిగా అది నా బాధ్యత."

"ఇక మూడవ బాధ్యత" అంటూ ఇంద్రసేనవైపు తలతిప్పి చిరునవ్వుతో చూసింది.

గణేష్‌రావుగారు, సుభద్రమ్మ కోడలి మాటలు వింటూనే పొంగిపోయారు.

ఇంద్రసేన అర్థంకానట్టు అంబిక వైపు చూసింది. దగ్గరగా వెళ్లి ఆడపడుచు తల ప్రేమగా నిమురుతూ ఆమెను దగ్గరకు తీసుకుంటూ–

"మా ఆడపడుచు ఇందూ ఆడపడుచులు, మరుదులు వదినగార్కి పిల్లంతో సమానం. ఇందు మా పిల్ల. మా ఆడపడుచు అందాల బొమ్మ. బంగారు మొలక. ఈమెకు తగిన వరుడ్ని చూసి పెళ్లి చెయ్యవలసిన బాధ్యత నాకు ఉంది. మంచి చదువుకున్నవాడిని, ఫారిన్ రిటర్డ్‌ని అందగాడు బుద్ధిమంతుడు అయిశ్వర్య వంతుడ్ని చూసి పెళ్లి జరిపిస్తాను. నాకు తెలిసిన సంబంధం ఒకటి ఉంది. వాళ్ళకి కబురు చేసాను. వాళ్ళు వస్తారు. మాకు అందరికీ ఆ సంబంధం నచ్చి తీరుతుంది. అబ్బాయి అంత అందంగా ఉంటాడు. అన్ని విధాల మన ఇందుకి అది తగిన సంబంధం! నేను మెట్టినింట్లో అందరు సుఖంగా సంతోషంగా హాయిగా ఉండాలన్నదే నా కోరిక" అంది చిన్నగా నవ్వుతూ.

అందరు ఆశ్చర్యంగా సంతోషంగా చూసారు ఆమె వైపు.

జయరామ్ మనసులో రవ్వంత సిగ్గు పడ్డట్టు అయ్యాడు. మౌనంగా ఉండి పోయాడు అలా. ఇంద్రసేన వదిన మాటలకి తడబడినట్టు అయింది.

అంబిక గురించి...అదే వదిన గురించి తను ఇన్ని రోజులు పొరపడిందా.

ఆమెను తను అర్థంచేసుకోలేక పోయిందా,

వదిన తన గురించి ఇంతగా ఆలోచిస్తుందా.

మంచి సంబంధం చూసి పెళ్ళిచెయ్యాలని నిశ్చయించుకుని అప్పుడే సంబంధం కూడా చూసి ఉంచిందా? అతను నిజంగా అంత అందగాడా.

అంత చదువుకున్నాడా.

ఫారిన్ రిటర్న్‌డా?

అంత అయిశ్వర్యవంతుడా?

ఆలోచిస్తూ తనకు తాను సిగ్గుపడ్డట్టు అయింది.

ఇనాళ్ళు ఆమె గురించి తను అపార్థం చేసుకుంది.

తను ఈ రోజునుండి ఆమెతో స్నేహంగా ఉండి వదినా అని మనసారా




పిలవాల అని నిశ్చయించుకుంది.

అంబిక మాటలు వింటూనే అందరి మనసులు తేలికపడినట్టు అయ్యాయి.

గణేష్‌రావుగారు సుభద్రమ్మ ఏదో చెప్పబోతుంటే వీధి గేటుదగ్గర పెద్ద గోలగా గొడవగా మాటలు వినిపించ సాగాయి.

ఏమిటా అని అందరూ హాలు గుమ్మంవైపుగా వెళ్ళి చూశారు.

వర్కర్స్ అందరూ గేటుదగ్గర నిలబడి లోపలకి వదలమంటున్నారు గూర్ఖాని.

గేటుదగ్గర ఉన్న గూర్ఖా గేటు తియ్యటంలేదు.

గణేష్‌రావుగారు, జయరామ్ ఇద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు ఏమిటా అన్నట్టు.

మళ్ళీ ఏం గొడవ జరుగుతుందో అని అంబిక ఎవ్వరివైపూ చూడలేదు. ఎవ్వరి సలహా తీసుకోలేదు

గబగబ రెండు అడుగులు ముందుకి వేసి గూర్ఖావానికి చెప్పింది—

గేటు తెరిచి వాళ్ళందర్నీ లోపలకు పంపించమని.

అంతే! గేటు తెరవగానే బిలబిల లాడుతూ వర్కర్స్ లోపలకి వచ్చేశారు.

అందరి చేతుల్లోను పూలహారాలు ఉన్నాయి. "ప్రొప్రయిటర్ గణేష్‌రావు గారికీ జై!"

"ప్రొప్రయిటర్ జయరామ్‌గారికీ జై" అంటూ గట్టిగా అరుస్తూ—

అందరూ తండ్రీకొడుకులు ఇద్దర్నీ పూలహారాలతో ముంచేసి వాళ్ళ ఆనందాన్ని అలా వ్యక్తపర్చుకోసాగారు.

గణేష్‌రావుగారు, జయరామ్ ఇద్దరూ నిశ్చేష్టులైపోయారు.

అంబిక చిన్నగా నవ్వుతూ చూడ సాగింది.

వర్కర్స్ అందరూ తండ్రీ కొడుకుల్ని పొగుడుతూ—

"డాక్టర్ అమ్మగారిచేత చెప్పించారు జీతాలు పెంచుతామని, బోనస్‌లు ప్రతి సంవత్సరం మీకు తప్పకుండా ఇప్పిస్తాం అని. మా ఆనందం ఇంతా అంతా కాదు బాబుగారూ. మీ పేరు చెప్పుకుని కడుపు నిండా తింటాం" అంటూ అందరూ గొడవగా గోలగా ఎవరికి తోచినట్టు వాళ్ళు అలా చెప్తూ వారిని పొగడసాగారు.

గణేష్‌రావుగారు చిరునవ్వుతో వాళ్ళ అందరికి ఏవో రెండు మాటలు చెప్పి అందర్నీ పంపించేశారు.

జయరామ్ వాళ్ళ అభిమానానికి తట్టుకోలేకపోయాడు.

అందరూ అలా పొగుడుతూఉంటే తను తొందరపడ్డందుకు నిజంగా సిగ్గు పడ్డాడు.

ఇక అక్కడ ఉండలేక తన గది లోకి వెళ్ళిపోయాడు.

ఇంద్రసేనకి కూడా సంతోషంగానే అనిపించింది.

సుభద్రమ్మ భర్తతో అంది సంతోషంతో మురిసిపోతూ "నిజంగా అమ్మాయి ఎంత తెలివయిందండీ!"

"అవును. చదువుకున్న అమ్మాయి చదువుకున్నమ్మాయే. అందుకే తెలివిగా సమస్యను తేలిగ్గా పరిష్కారంచేసేసి నాకు, జయరామ్ పేరుతెచ్చింది" ఆయన తృప్తిగా సంతోషంగా మనస్ఫూర్తిగా అన్నారు.

ఆయన ఎవర్నీ ఎప్పుడూ అలా మనస్ఫూర్తిగా మెచ్చుకోలేదు. అది మొదటి సారి అనే చెప్పాలి.

* * *

జయరామ్ తన మంచంపై పడుకుని ఆలోచనల్లో మునిగిపోయాడు.

అంబిక గదిలోకివచ్చి మెల్లగా తలుపులు మూసి లైటు ఆర్పి మంచంమీద పడుకుంది.

తలతిప్పి భార్యవైపు చూశాడు.

అతని కళ్ళకి ఆమె ఆరోజు ఎంతో అందంగా అపురూపంగా కనిపించ సాగింది.

ఇలాంటి అమ్మాయి ఎక్కడో ఏ పురుషుడికో భార్య అవుతుంది. అందరి పురుషులకి ఈ అదృష్టం దక్కదు. ఇంత తెలివయిన అంబిక తనకి భార్య అయిందంటే నిజంగా ఎంత అదృష్టం!

తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు. గుండెల నిండా సంతోషం పొంగి పోసాగింది.

తను ఎంత తొందరపడ్డాడు. ఆమె కనుక తనని గదిలో పెట్టి బంధించక పోతే వర్కర్స్ అందరూ తనని ఇలా పొగిడేవారా! తను నిజం తెలుసుకోకుండా ఆవేశంతో అక్కడికి వెళ్తే పెద్ద గొడవ జరిగిపోయిఉండేది. వాళ్ళు రెచ్చిపోయి ఉండేవారు.

ఎంత తెలివిగా ప్రవర్తించింది అంబిక!

నిజం తెలుసుకోకుండా ఆమెను కొట్టి అవమానించేడు అందరిలో. ఎంత అనాలోచితంగా ప్రవర్తించాడు. తను భార్య వైపు జాలిగా పరీక్షగా చూశాడు.

అంబిక అటు తిరిగి పడుకుంది.

దగ్గరగా జరిగి ఆమె భుజం పై చెయ్యివేసి "నిద్ర పోతున్నావా!" అపురూపంగా అడిగాడు.

తలతిప్పి చూసి "లేదు. ఇంకా నిద్ర రావడంలేదు" అంది మెల్లగా.

"నామీద కోపం వచ్చిందా!" పశ్చాత్తాపపడుతూ అడిగాడు.

"మీ మీద ఎందుకు!" అర్థంకానట్టు ఇటు తిరిగి భర్తవైపు చూస్తూ అడిగింది.

"నిన్న అందరిలో అలా అవమానించి కొట్టినందుకు" లోగొంతుకతో అన్నాడు, అతనికిమాట్లాడడానికి శక్తిలేనట్టు అదోలా అయిపోతూ. "అదా!" అంటూన్న అతని చేతిని చేతుల్లోకి తీసుకుని పెదవులకి అనించుకుంటూ, "నేను మీ భార్యని. నేను ఏదైనా తప్పుచేస్తే దండించే అధికారం మీకు ఉంది. అలాగే మిమ్మల్ని మంచి మార్గంలో పెట్టడానికి ఏ విషయంలో అయినా మీ మీద నాకు సర్వాధికారాలు ఉన్నాయి. మన ఇద్దరం భార్యభర్తలం. మన అనుబంధం అటువంటిది. మీరు నన్ను కొట్టి అవమానించేరు అని మీరు బాధపడ నవసరంలేదు. నన్ను అనక మీరు ఇంకే పరాయిస్త్రీని అంటారు చెప్పండి!" అంటూ చేతివేళ్ళతో అతని క్రాపుని మెల్లగా దువ్వసాగింది.

"అంబికా!" అన్నాడు సంతోషంగా చూస్తూ.

చిన్నగా నవ్వుతూ అంది. "భార్య కోరుకునేది భర్త గుండెల్లో చోటు. భర్త అనురాగం. అవేనండి నేను కోరుకునేది. తెల్లవారి హాస్పటల్‌కి వెళ్ళి ఇంటికి వచ్చిందాకా బాధ్యత గల ఒక డాక్టర్ని నేను. ఇంటికి వచ్చాక బాధ్యత గల గృహిణిని మాత్రమే."

"అంబికా నేను నిజంగా ఎంత అదృష్టవంతుడ్ని" అంటూ ఆమెను అపురూపంగా అనురాగంగా దగ్గరకు తీసుకుంటూ గుండెలకు అదుముకున్నాడు.

* * *

తెల్లవారి అంబిక హాస్పటల్‌కి వెళ్ళిపోయింది. పదకొండున్నర అవుతుండగా ఆమెకు ఆరోజు కాస్త తీరికచిక్కింది.

అంబిక కృష్ణమౌళి గురించి ఆలోచిస్తూ అతనికి తను ఫోన్‌చేస్తాను అంది. ఇంతవరకు చెయ్యలేదు. ఇప్పుడు చెయ్యాలి అనుకుంటూ రిసీవర్ ఎత్తి నెంబర్ డయిల్ చేసింది.

అవతలి కంఠస్వరం వింటూ నే "మీరా! యింటిదగ్గరే ఉన్నారా!" అడిగింది.

"నీ దగ్గరనుండి ఫోన్ వస్తుంది అని చూస్తున్నాను" అంటూ నవ్వి "ఏమిటి మీ కంపెనీలో పెద్ద గొడవ అయింది అట" అడిగాడు.

"ఆ" అంటూ అతనికి నిన్నటి రోజు జరిగిన విషయం అంతా వివరంగా చెప్పింది.

కృష్ణమౌళి శ్రద్ధగా విని నవ్వాడు. "అయితే నిన్ను అక్కడ అందరు అంతగా నమ్మేశారు అన్నమాట. నా గురించి ఎలాటి అనుమానం రాలేదు అన్నమాటే కదా" అడిగాడు.

"ఆహా నన్ను నమ్మటం ఏమిటి ఏ పని అయినా నాను చెప్పేగాని చేసేట్టులేదు. ముఖ్యంగా గణేష్‌రావుగారు అదే మా మామగారు" అంటూ నవ్వేసింది.

అతను గట్టిగా నవ్వేస్తూ "ముందు ఆ ముసలాయన్ని మస్కా కొట్టాలి అది మనకి కావలసింది. సరి జయీమ్!"

"ఆయన కూడా దారిలోకి వచ్చేశాడు. నేను ఎంత చెప్తే అంతే" అని మళ్ళీ నవ్వింది.

"ఆహా. సరి సరి మరి...." అంటూ ఆపేశాడు.

"మీ ఇందు గురించా ఆమె మహారాణిలా ఉంది. ఆ అమ్మాయి కూడా నన్ను తేలిగ్గా నమ్మేసింది. నేను మంచి సంబంధం చూస్తున్నాను అని చెప్పాను."

"సంబంధమా!"

"అదే ఆ మాత్రం మీకు అర్థం కాలేదా! మీరే ఆ పెళ్ళికొడుకు" అంది నవ్వుతూనే.

అతను గట్టిగా నవ్వేశాడు.

"అయితే ప్లాన్ ఏమైనా ఆలోచించావా!"

"ఓ! ఎప్పుడో ఆలోచించి పెట్టుకున్నాను. ముందు యింట్లో వాళ్ళు అందరూ ఒక దారికి వచ్చిందాకా ఆ ప్లాన్ ఫలించదుగా. అందుకే ఆగాను."

"ఏమిటా ప్లాన్" నెమ్మదిగా అడిగాడు.

ఆమె నెమ్మదిగా కంఠస్వరం తగ్గించి అన్నీ వివరంగా చెప్పసాగింది.

అతను ఊకొట్టి వినసాగాడు.

అంతా చెప్పి "అర్థం అయిందా చాలా జాగ్రత్త. ఎవ్వరికి తెలియకూడదు ఇందు వెనక వాళ్ళ అన్నయ్య ఉండకుండా నేను చూస్తాను," అంది.

"ఆ అర్థం అయింది. అయితే రేపటి నుండే మొదలు అన్నమాట. అయితే ఆ విషయం వెంటనే రాజుకి చెప్పేస్తాను. అన్నాడు ఉషారుగా.

రాజు పేరు ఎత్తగానే అంబికకు ఒళ్ళు మండిపోతుంది.

"ఆ రాజుకి అన్నీ చెప్పాలని ఉందా! వాడ్ని తీసుకెళ్ళి ఏ చెత్తకుండీలో అయినా పారేసి అక్కడ కొద్దిరోజులు ఉండమనండి" అంది కాస్త కోపంగా.

ఆమెకు రాజు పేరు ఎత్తగానే కోపం వచ్చింది అని గ్రహించుకుని నవ్వేసి "సరే అయితే నేను ఉంటాను." అంటూ చెప్పి రిసీవర్ పెట్టేశాడు.

కృష్ణమౌళికి ఆరోజు చాలా ఆనందంగా అనిపించసాగింది.

అమ్మ కోరిక ప్రకారం అంబిక గణేష్‌రావుగారి కోడలు అయింది. ఇక గణేష్‌రావుగారి కూతురు అమ్మకి కోడలు అవ్వాలి.

ఆ పని తను చేస్తే తల్లి కోరిక తీర్చినట్లే.

అతని మనసు తేలిక అయింది.

రేపు ఎంత వేగంగా తెల్లవారుతుందా అనిపించసాగింది. ఆ రేపటి రోజుకోసం ఆలోచిస్తూ అలా కూర్చుండిపోయాడు.

(సశేషం)

ఆగష్టు నెల భావపరిచయ పోటీ

బహుమానం రూ. 25-00




ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి జూలై 20వ తేదీలోగా పంపాలి.

# జీవితం ఒక కత్తిధార

—నిఖిలేశ్వర్

చల్లగా అహ్లాదంగా
ఏమరుపాటుగా విస్తరించి
వీస్తున్న ఈ వెన్నెల కింద
ఆకలితో మెలికలు తిరిగే
కొండచిలువలాంటి నీటితెర.

అలమటించే ఆకలి
దారిద్ర్యంతోనే కాపురం
పిలిస్తే పలికే
చావుతోనే సహజీవనం,

అంతిమ శ్వాసదాకా
పెనుగులాడే జీవనవాంఛ.

చొచ్చుకపోతున్న
వాడికత్తిలాంటి జీవనధార
జలసమాధి చేస్తున్న నీటితెరని
నిలువునా చీల్చి
మేలొ్కంటూనే వుంది తిరిగి—
అదుర్దాగా ఎదురుచూస్తున్న
పిండాకృతిలోంచి....!

# ప్రతిఫలం

రావిపల్లి నారాయణరావు



ఇదిగో పిల్లా, నాను సెప్పేదినుకో- అన్నం మెతుకులు కడుపులో పడక పోయినా ప్రాణాలు ఎక్కడికి పోవు. కాని దాని తప్పదియ్యా, సారా గొంతుకలో పడకపోతే నరాలు నాగేస్తాయి. సుక్కేసుకోకపోతే నాను బతకనేను. ఆ సంగతి నీకు తెల్సు. తెల్సికూడా నువ్వు నా కోసం యియ్యాల సాయింత్రం గూట్లో డబ్బెట్టకుండా ఆ కుర్రలాయర్ గది ఊడ్వటాని కెల్లిపోనావ్. ఇప్పుడు ఏన్నేం సేయాలి!' సీతాలును పశువును కొట్టినట్టు కొట్టసాగాడు రాముడు.

'అగు మావా - అగు. అయ్యబాబో సంసేత్తున్నాడు.' రాగాలందుకుంది సీతాలు.

రాముడు కొట్టిన దెబ్బలకు సీతాలు కాబట్టి తట్టుకుంది. మరొకరైతే కళ్లు తిరిగి స్పృహలేకుండా క్రిందపడిపోయేవారు.

ఆ వీధిలో చాలా యిళ్లలో సీతాలే పనిచేస్తుంది. ఆ వీధిలో కొత్తగా ఎవరు దిగినా - పనిమనిషి కావాలంటే సీతాలు పేరే చెబుతారు.

ఒకరోజు క్లబ్బునుండి యింటికి వచ్చే సరికి బాగా పొద్దుపోయింది. తలుపు తెరచి సీతాలు అంతకుముందు హోటల్నుండి

తీసుకొచ్చిన కారీర్ ముందుపెట్టుకు కూర్చున్నాను. సీతాలు ఏడుపు చెవిలో పడ్డాక తినటానికి బుద్ధిపుట్టలేదు. నాలుగు మెతుకులు తిని చేతులు కడుక్కున్నాను.

సీతాలు యింకా ఏడుస్తూనే ఉంది. రాముడు చావుదెబ్బలు కొడుతున్నా చుట్టు ప్రక్కలవాళ్లు పట్టించుకోలేదు. ఇంటి గొడవల్లో మన మెందుకు తలదూర్చడం అనుకున్నారేమో భార్యభర్తల తగువులో ఎవ్వరూ జోక్యం కలిగించుకోలేదు.

ఆ మర్నాడు నిద్రమత్తు నుండి ఊరు బయటపడలేదు. ఏదో అర్జంటుగా కొన్ని పుస్తకాలు రిఫరెన్స్‌కు తిరగ వేయాలని నేను పెందరాడే లేచి, బ్రష్ చేసుకుంటూ వరండాలో నిలబడి రోడ్డు ప్రక్కనున్న గూడెంవైపు చూసాను. సీతాలు, రాముడు సరసాలు ఆడుకుంటు న్నారు. వాకిట్లోనున్న గోలెంలోని నీళ్లు దోసిలితో తీసి రాముడు సీతాలుపై జల్లు తుంటే, చేతిలో నున్న చెంబులోని నీళ్లు పోసి రాముడి తల తడిపేసింది సీతాలు. ఆ తర్వాత యిద్దరు పాకముంగిట టీ గ్లాసులు చేతపుచ్చుకుని ఒకరినొకరు అంటుకు కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకోసాగారు. రాముడి మాటలకు విరగబడి నవ్వుతోంది సీతాలు. ఆ నవ్వుని చూసి పరవశించిపోయాడేమో రాముడు ఆమె ముక్కుపట్టుకు లాగాడు. టీ త్రాగిన తర్వాత ఖాళీగ్లాసులు లోపల పెట్టి గూటిలో నూనె చేతిలో పోసుకుని వచ్చి రాముడు తల మర్దనచేసింది సీతాలు. ఆ అన్యోన్య దంపతుల్ని చూస్తుంటే వీళ్లిద్దరేనా రాత్రి జీవితాన్ని కురుక్షేత్ర సంగ్రామం చేసుకున్నారు అన్న అనుమానం కలిగింది నాకు.

ఒకరోజు, ఉదయం ఏడుగంటలకు హోటల్‌నుండి ఫ్లాస్కుతో కాఫీ తెచ్చి టేబిల్‌మీద పెట్టింది సీతాలు.

'బాబూ అరుదురూపాయి చిల్లర మిగి లింది. ఈ డబ్బులు కూడా టేబ్లుమీద పెట్టనా?' నా ఎదుట నిలబడింది సీతాలు, పమిటకొంగు పట్టుకుని.

ఆ రోజు పేపరు చదువుతున్న నేను, తల పైకెత్తి ఆమె ముఖంలోకి చూసాను. ఆమెను అంత దగ్గరగా పరిశీలించి చూడ్డం అదే మొదటిసారి. నా దృష్టి ఆమెమీద పడగానే అజంతా శిల్పం గుర్తుకొచ్చింది. వంపులు తిరిగిన అవయవపు పొంగులకంటే ముందు, కెంపు రంగులో ఉన్న చిన్న పెదాలు ఎవరినైనా యిట్టే ఆకర్షిస్తాయి. తీకైన ముక్కును మేలిమి బంగారపు ఛాయను చూస్తూ కొన్ని క్షణాలు స్థాణువైపోయాను నేను. కనురెప్ప వేయకుండా అలా చూస్తుంటే నా చూపులనుండి తప్పుకుని—

'నాను ఎల్లొత్తాను బాబు, యీ సిల్లర తీసుకోండి' అర్ధరూపాయి చిల్లర నా చేతిలో పెట్టింది సీతాలు.

తమలపాకులాంటి ఆమె చేయి తగల






గానే ఏదో తెలియని మధురానుభూతి కలిగింది.

'సీతాలూ!'

'ఏందిబాబూ, పిలిచారా?' నా వైపు తిరిగింది ఆమె.

'అ.....నువ్వు' ఆగిపోయాను నేను, ఆ సన్నని నునుమని బిగువైన శరీరాన్ని చూస్తూ.

'సెప్పండి బాబూ సాలా పొద్దెకిపోన్నాది.'

'మరేంలేదు, రాత్రి ఎవరు, ఆ రాముడేనా నిన్ను గొడ్డును కొట్టినట్టు కొడుతున్నాడు. నిన్ను చూస్తే కొట్టడానికి ఎవరికీ చేతులు రావే - అసలు వాడికి మతిసుతి ఉందా, అలా కొడతాడు.'

'ఆడికి మతిలేకపోవడం ఏంటిబాబూ! సుక్కేసుకుపైపోతే అలాగైపోతాడు కాని ఆడి మనసు నాకు తెలిదేటి బాబూ-ఎన్న పూస. నానంటే వల్లమాలిన పేమ.'

'అదికాదు సీతాలూ! ఆ రాముడి దెబ్బలు తింటూ నువ్వెలా బ్రతుకుతున్నావో.'

'ఆడిచేత దెబ్బలు తిండం నాకు బాద నేదు బాబూ!'

'అయితే ఆ రాముడితో నీ జీవితం సుఖంగా సాగిపోతుందంటావ్?'

'ఆ ప్రశ్నకు సీతాలు ముఖంలో సిగ్గుతెరలు క్రమ్ముకున్నాయి. చిన్న పెదాల మధ్య చిరునవ్వు చోటు చేసుకుంది.'

'అది సరే - యీ అర్థరూపాయి నీ దగ్గరే ఉంచు' ఆమె అరచేతిని తాకే అవకాశం మళ్లీ కలిగింది.

'నా కెందుకు బాబూ!' అంది చేతిలో పెట్టిన డబ్బుల్ని చూసుకుంటూ సీతాలు.

'నీకు కాకపోయినా నీ రాముడికి పనికొస్తాయిలే.'

'మీకు తెల్సిపోనాదేటి బాబూ మా మావ సంగతి!' అంటూ నవ్వుకుని తూనీగలా ఆమె రోడ్డుపై పరుగెత్తుతుంటే సిగలోని మల్లెపూలచెండు వరండాలో పడిపోయింది. సిగముడి నుండి బయటపడిన పొడుగాటి నల్లని కురులు నడుమును దాటి ఎత్తైన ఆమె పిరుదలపై వయ్యారంగా నాట్యంచేయసాగాయి.

ప్రతిరోజు సీతాల్ని తలచుకొన్నప్పుడు, ఆమె రాగానే మనసు విప్పి మాట్లాడాలనే తపన; తీరా ఆమె ప్రత్యక్షంగా కళ్ళఎదుట నిలబడగానే నోరు మూగదై పోతుంది ఎందువల్లనో!

టైము పదిగంటలు. కోర్టుకు వెళ్ళటానికి సిద్ధమయ్యాను. ఆరోజు విడాకుల కేసు వాయిదా ఉంది. మనసులు కలియక భార్యాభర్తలు విడిపోయారు. భరణంకోసం దావా పడేసింది భార్య. ఆ కేసుఫైలు పట్టుకోగానే సీతాలు తలపుకు వచ్చింది. దెబ్బలు తింటూ రాముడితో ఎన్నాళ్ళని కాపురంచేస్తుంది? రోజూ వీపు విమానంమోత మోగిపోతోంది. ఎలాగైనా నచ్చజెప్పి సీతాలుచేత డైవర్స్ పిటిషన్ పెట్టించాలని అనుకుంటూ, నల్ల గౌను భుజంపై వేసుకుని స్కూటర్ బయటకు తీసాను. ఆయాసంతో ఉక్కిరిబిక్కిరై, నుదుటిపై పడిన మెలికలు తిరిగే కురులను సర్దుకుంటూ, హడావిడిగా వచ్చి పిలిచింది సీతాలు—

'బాబుగారూ! బాబుగారూ!'

'ఏవిఁటి సీతాలూ, ఏమైంది?'

'మా మావని పోలీసులు పట్టుకుని లాక్కుపోనారట! రేతిరి యింటికి రానేదు. ఎక్కడో తాగేసి తొంగుండిపోనాడని వల్లకున్నాను. యిప్పుడే సెప్పాడు రంగయ్యన్న, రాముడ్ని పోలీసుటేసన్లో సూశానని.' గుక్క తిప్పుకోకుండా చెప్పింది సీతాలు.

'పోలీస్ స్టేషను కెందుకు తీసుకెళ్ళారట?'

'తాగేసి రోడ్డుమీద గొడవసేసాడట. 'తాగేసి నీ పాకలో తొంగో— మాము నీ జోలికి రాము. కాని నడిరోడ్డులో అల్లరి జేత్తే మాము వల్లకోము—' అని లాక్కుపోనారట! అడ్ని వొదలాలంటే జామీనివ్వాలట. కాయితం రాసియ్యండి బాబూ, నాను టేసన్‌కెల్లి యిడిపించుకొత్తాను.' సీతాలి కళ్లల్లో నీళ్లుతిరిగాయి.

'నువ్వు పోలీస్‌స్టేషన్ కెళ్తావా!—వద్దు సీతాలు, నువ్వెళ్లొద్దు.'

'మా మావని వొదలాలంటే నాను టేసన్‌కు ఎల్లాలి బాబూ!'

'నువ్వెళ్లాలని ఎవరన్నారు?'

'మావఁకు జామీనివ్వాలి బాబూ!'

'జామీను నువ్వే యివ్వక్కర్లేదు. ఎవరైనా యివ్వొచ్చు. నువ్వు మాత్రం





పోలీసుస్టేషన్ ప్రాంతానికే పోవద్దు.'

'మరి మా మావకు జామీను ఎవరిత్తారు బాబూ?_ 'ఆడు తాగుబోతు, ఆ తాగుబోతుకి ఎవరిత్తారు జామీను'_ అంటారు బాబూ, మా గూడెంలో ఉన్న పెద్దోల్లంతా.' సీతాలు ముఖం చిన్న బోయింది.

సీతాలుకు దగ్గర కావాలి_ కాదు సీతాల్ని దగ్గరకు తీసుకోవాలి. అందుకు మంచి అవకాశం యిదే! అవకాశాన్ని దుర్వినియోగం చేసుకోకు, అంతరాత్మ హెచ్చరించింది. 'సీతాలూ, నువ్వేమీ దిగులుపడకు. మీ మామను నేను జామీనుమీద విడిపిస్తాను. సరేనా?' అన్నాను.

ఆమె ముఖంలో వెయ్యి జ్యోతుల కాంతి వొక్కసారిగా కనిపించింది.

కోర్టుకు వెళ్లేముందు పోలీస్‌స్టేషన్ కెళ్లి రాముడ్ని బెయిల్‌మీద విడిపించాను.

ఆ రాత్రి మళ్లీ గూడెం చివరిపాకలో రాముడి కేకలు, సీతాలు ఏడుపు వినిపించాయి.

'ఆ సచ్చినోడ్ని పోలీస్‌టేసన్లో సావనీకుండా జామీనిచ్చి ఎందుకు యిడిపించారు లాయర్‌బాబూ'_ అంటూ, ఆ మరునాటిరోజు తెల్లారకముందే నలుగురైదుగురు గూడెంపెద్దలు నా దగ్గరకు వచ్చారు. నేను సమాధానం చెప్పలేదు. నవ్వేసి ఊరుకున్నాను.

* * *

బి.ఏ. పాసుకాగానే 'లా' చదవను అని జగమొండిలా కూర్చున్నాను నాలుగు రోజులు. బి.ఎల్.లో చేరక తప్పదని పట్టుబట్టారు నాన్న. కాదనలేకపోయాను.

బి.ఎల్. పూర్తిచేసాక ప్రాక్టీసు పెట్టాలని పించలేదు. ఏదో ఒక కంపెనీలో లీగల్ అడ్వయిజర్‌గానో, లా అసిస్టెంటుగానో చేరాలనుకున్నాను— కాదు, పట్నంలో ప్రాక్టీసు పెట్టు, సంపాదన ఉన్నా లేక పోయినా అనుభవం వస్తుంది— అన్నారు నాన్న. ఆయన సంతృప్తికోసం పట్నంలో ఒక చిన్న యిల్లు తీసుకుని ప్రాక్టీసు పెట్టాను. నాన్న మాట కాదని ప్రాక్టీసు పెట్టకుండావుంటే సీతాలు నా కంటబడేది కాదు. రోజుకొకసారైనా సీతాలును చూడనిదే ఉండలేకపోతు న్నాను.

* * *

శీతాకాలపు పొద్దు. ఆరుగంటలకే చీకటి తెరలు నలుమూలలనుండి విజృం భించాయి. వీధిలోని మున్సిపాలిటీ లైట్లు మందంగా వెలుగుతున్నాయి.

స్కూటర్ని వరండాలో పెట్టి,తాళాలు పట్టుకుని తలుపు దగ్గరకు వెళ్లాను. తలుపు తెరచిఉంది. హోటల్ నుండి తెచ్చిన కారీర్, లోపలపెట్టి సీతాలు తాళంవేయ లేదు గాబోలు అనుకుంటూ దగ్గరగా వేసి ఉన్న తలుపు తోసుకుని గదిలో అడుగు పెట్టానోలేదో అత్తరువాసనలు గుప్పు మన్నాయి. మల్లెపూల పరిమళం గుబాళి స్తోంది. గది నలుమూలల చూసాను. ఎవరూ కనబడలేదు. కాని సోఫాకమ్ బెడ్ ముందున్న టీపాయ్ మీద ఫ్లవర్ వాజ్‌లో పొగలు విరజిమ్మే అగరు వత్తులను, సోఫామీద అక్కడక్కడ రాలిన మల్లెపూలను చూసిన తర్వాత ఇదేదో మిస్టరీగా ఉన్నట్టు తోచింది. నల్ల గౌను హేంగరుకు తగిలించి డ్రెస్ మార్చుకుని రిఫ్రెష్ అవటానికి టాయ్ లెట్‌కు వెళ్లాను. ఆ తర్వాత ముఖం టవల్‌తో తుడుచుకుంటూ గదిలోకివెళ్లి టేబుల్‌మీద చూసాను. కారీర్, టేబుల్ మీద లేదు, అంటే సీతాలు హోటల్‌నుండి యింకా భోజనం తెచ్చినట్టులేదు. మరి యీ మల్లెపూలు, అగరువత్తులు ఎక్కడినుండి వచ్చినట్టు!! ఎవరు తెచ్చిపెట్టినట్టు !! నా ప్రశ్నలకు సమాధానం దొరకలేదు. ఏమీతోచక సోఫామీద నడుం వాల్చాను. ఎక్కడనుండి వచ్చిందో సీతాలు రెండు చేతులతో నా నడుముని చుట్టేసింది. ఆమె వింత ప్రవర్తనకు కొన్ని క్షణాలు నా నోటంట మాటరాలేదు. ఆ తర్వాత ఆమె లేచి, సోఫామీద కూర్చొని రెండు చేతులతో నా ముఖాన్ని పట్టుకుని, ఆ లేత అధరాలను నా పెదాలకు జోడించ బోయింది. నేను వెంటనే లేచి కూర్చుని అడిగాను—

'సీతాలూ! నీకు పిచ్చిపట్టిందా?'

'లేదు బాబూ, నాకు పిచ్చిపట్టలేదు. నాను బాగా వున్నాను బాబూ!' అంది రెండు చేతులతో ముఖం కప్పుకుని.

'మరి ఏవిటీ పని?' అని మందలిం చాను. కాని చేతికి దొరికిన అవకాశాన్ని



చేతులారా విడిచిపెట్టుకున్నానని మనసు లోని మనసు బాధపడుతోంది.

'బాబూ. నను క్షమించండి, సరిగా నెలరోజుల క్రిందట యిలాగే అమావాస్య రాత్రి, నాను హోటేలు నుండి భోజనం తెచ్చి మీ టేబ్లుమీద పెట్టాను. మీరు యీ సోఫామీద నాకొని పుస్తకం సదువుతూ వోరగా నన్ను సూసారు. నాను యింటి

వెళ్తున్నా బాబూ అని సెప్పి ఎలిపోతుంటే నా సెయ్యట్టుకుని సోపామీదకి లాక్కున్నారు- ఒకసారి నీ పెదాలు ముద్దుపెట్టుకోనీ సీతాలు ! - అన్నారు. నా నిప్పుడు మిమ్మల్ని పట్టుకున్నట్టే అప్పుడు మీరు రెండు సేతుల్తో నన్ను గట్టిగా వాటేసుకున్నారు- బాబూ మీరు సదువుకున్నారు. నాను మీ సీదను బతికే కూలిముండని. మీరు గొప్ప గొప్ప ఉజ్జోగాలు సెయ్యాల పెల్లి సేసుకోవాల. సుకంగా ఉండాల. నాతోటి మీకు సుకమేటి బాబు. నాకు ఎప్పుడో మూడుముల్లేసాడు రాముడు. ఎంగిలికూడు మీ కెందుకు బాబూ!- అని, నాను ఆ రోజు ఎల్లిపోయాను, మీకు ముద్దివ్వకుండా. ఆ రోజు మీరు ఎంత బతిమాలినా నాను ఒప్పుకోనేదు. కాని ఈ రోజు నాను కాదన్ను. మీరు ఏ పని చేసినా నాను వల్లకుంటాను, అలాసూత్తూ కూకుంటే తెల్లారిపోతాది. రండి బాబూ, బేగి రండి - మల్లీ మా మావ సుక్కేసుకొచ్చి, నానింట్లో నేనని కూకలేత్తాడు. ఈ రోజు దాటిపోనాదంటే మీకు నాను దక్కుతానో నేదో-' కళ్లనుండి బొట బొట రాలిన అశ్రుబిందువులు సీతాలు చెక్కిళ్లను తడిపేసాయి.

'సీతాలు ఏమైంది ? ఎందుకలా ఏడుస్తున్నావ్ ?' అడిగాను, కళ్ళలోకి చూస్తూ.

'ఇంకేమవ్వాలి బాబూ - మావ బతకడు. ఆడు బతకాలంటే వెయ్యి రూపాయలు కావాలి. అది కడుపులో కురుపేసిందట-డాక్టరుబాబు సెప్పినారు. అపరేషన్ సెయ్యకపోతే బతకడట. వెయ్యి రూపాయలు ఎక్కడ నుంది తేవాల!.........బాబూ-లాయర్ బాబూ, నాను పక్కన కూకుంటే మీకు చాలా కుసిగా వుంటాదని, పెపంచాన్ని మరిసిపోతానని సెప్పారు. నా కల్లు సెక్కాల్లా ఉంటాయని, పెదాలు సూత్తావుంటే ముద్దెట్టుకోవా లనిపిత్తుందని సెప్పారు. కావాలనినానే వొచ్చాను-కల్లప్పగించి అలా సూత్తారేటి? రండి బాబూ, మీకోరిక తీర్చుకోండి. నాకు వెయ్యి రూపాయిలిప్పించండి, మావని బతికించుకుంటాను. నా దగ్గరున్న సుకంకోసం నాను వెయ్యిరూపాయిలు అడగనేదు బాబూ. మా మావ అపరేషన్ కోసం- ఆ డబ్బు తిరిగి యిచ్చుకుంటాను. నేకపోతే మీ యింట్లో సాకిరి సేసైనా తీర్చుకుంటాను-రండిబాబూ, మీ కోరిక తీర్చుకోండి, వెయ్యి రూపాయిలు యిప్పించండి.' నా రెండు కాళ్లు పట్టుకుంది సీతాలు. చెక్కిళ్ళను తడిపిన కన్నీటి బిందువులు నా పాదాలమీదకు దొర్లాయి.

కాళ్లమీదపడ్డ సీతాలు భుజాల్ని పట్టుకొని లేవనెత్తి సోఫాలో కూర్చొపెట్టాను. 'సీతాలు ! నేను చదువుకున్నవాడ్ని. సంస్కారం కలవాడ్ని. పైగా న్యాయవాదిని. నేను అన్యాయం చేయను. అన్యాయం జరుగుతుంటే చూస్తూ ఊరు




కోను. ఆ రోజు క్షణికోద్రేకంలో నేను నీ పట్ల అసభ్యంగా ప్రవర్తించిన మాట వాస్తవం. ఆ పరిస్థితినుండి నువ్వు తప్పించావు. అందుకు నేను కృతజ్ఞుడ్ని. మనిషి బాగుపడటానికి, చెడిపోవటానికి పరిస్థితుల ప్రభావమే కారణం అంటాను. వాటిని ధైర్యంగా ఎదుర్కొని ముందుకు సాగిపోయినవాడే మంచి మనిషిగా గుర్తింపబడతాడు...... సీతాలూ! నీకు చదువు లేకపోయినా సంస్కారం ఉంది. అందుకే నువ్వు శీలాన్ని కాపాడుకోగలిగావు. మంచి మనిషిగా గుర్తింపబడ్డావు. రాముడి ఆపరేషన్‌కు కావలసిన వెయ్యిరూపాయలు, రేపు కోర్టుకు వెళ్ళే ముందు బ్యాంకు నుండి తీసి నీకు యిస్తాను. నీ మావకు వచ్చిన ప్రమాదం ఏమీలేదు. పిచ్చిపిచ్చి ఆలోచనలతో నీ మనసు పాడుచేసుకోకు. సంతోషంగా యింటికి వెళ్ళు' వోదార్చి సీతాలును యింటికి పంపించాను.

* * *

బ్యాంకు నుండి వెయ్యి రూపాయలు తీసిచ్చినమరుసటిరోజు తెల్లవారకముందే సీతాలు లబోదిబోమంటూ వచ్చి తలుపు బాదింది. టైము ఆరు కూడా కాలేదు. ఏం జరిగింది, ఒకవేళ ఆపరేషన్ సక్సెస్ కాలేదా? - అన్న అనుమానం కలిగింది. సోఫాలో కూర్చున్న నేను వెంటనే లేచి తలుపు తీసాను.

'లాయర్ బాబూ, కొంప మునిగింది. వెయ్యిరూపాయ లట్టుకోని మా రాముడు మావం రాత్రికిరాత్రే ఎక్కడికో పోనాడు బాబూ! వెయ్యిరూపాయిలు కనబడగానే మనిసి మారిపోనాడేటి? అని తొంగున్న

సాప కింద యీ సీటీముక్క అగుపడింది. ఏటి రాసాదో సూడండి లాయర్ బాబూ. అదిరాక మీరు సదవగలరో నేదో — మావాఁ, నీ ఆపరేషన్ కోసం లాయర్ గారిచ్చిన వెయ్యి రూపాయిలు సెక్క పెట్టెలో పెట్టానని రాత్రి అది మైకం తగ్గినాక సెప్పాను. అంతే — తెల్లారేగట్ల ఆడిమొహం కనబడ్నేదు. పెట్టిలో పెట్టిన వెయ్యిరూపాయలూ కనబడ్నేదు. అదేమైపోనాదో ! డబ్బేమైపోనాదో—సదవండి బాబూ యీ సీటీ.'

సీతాలిచ్చిన సీటీ తీసుకొని చదవ సాగాను.

'సీతీ—నాను ఎన్నోరోజులు బతకను. నా కడుపులో ఉన్నది మామూలు కురుపు కాదు, కేన్సర్ కురుపు. నువ్వేడ్సినత్తావని డాట్రుబాబు ఆ యిసయం నీకు సెప్పనేదు. నాను బతకనన్నది నిజం. మరి యీ వెయ్యి రూపాయిలు ఆపరేషన్‌కు ఎందుకు కర్సుపెట్టాల? నానే డబ్బు తీసుకుని జల్సాచేత్తే సరిపోలా? .......

డబ్బట్టుకొని హైద్రాబాద్ ఎల్లిపోతున్నా. అక్కడ గుర్రప్పందాలు బలే జోరుగా సాగుతాయట. విదేసాల సండొచ్చే విస్కీ సీసాలు దొరుకుతాయట. సీతీ — తిరిగిరానేదని బెంగెట్టుకోకు. నాను ఒకటి రెండు నెలలకన్నా ఎక్కువ రోజులు బతకను. అందుకే నాను తిరిగొత్తానని ఆసపెట్టుకోకు.— నీ మావఁ రాముడు.'

నే చదివిన ఉత్తరంలోని సంగతులు విని కుప్పలా నా కాళ్ళమీద పడిపోయింది సీతాలు.





# ఉత్తరం

'వసుంధర'

ట్రెయిన్లోంచి దిగుతూనే రుసరుస లాడుతూ చూసింది దీప అటుపైన భర్త వంక చూడకుండా విసవిసా నడిచింది.

శ్రీనివాస్ హతాశుడైపోయాడు. భార్య పుట్టింటికి వెళ్ళి మూడు వారాలయింది. అతడామెకోసం వేయి కన్నులతో ఎదురుచూస్తున్నాడు. ఆమెతో ఎన్నో మాట్లాడాలనుకున్నాడు. కానీ దీప కోపంతో వచ్చింది. తామింకా కలుసుకునైనా మాట్లాడుకోలేదు. అప్పుడే ఆమెకు అంత కోపమెందుకు వచ్చింది?

పుట్టింట్లో ఏదో జరిగి ఉండాలి. అయితే అత్తమీద కోపం దుత్తమీద చూపడం అన్యాయం కాదా?

దీపచేతిలోని సూట్‌కేసును బలవంతాన లాక్కున్నాడు. అదికాస్త బరువుగా ఉండడంవల్ల ఆమె అట్టే అభ్యంతరం చెప్పలేదు. కానీ అతడివంక చూడలేదు. మాట్లాడలేదు.

ఇద్దరూ రిక్షాలో ఇల్లు చేరుకున్నారు. దారిలో రిక్షాలో ఆమెను పలకరించాలనుకున్నాడు శ్రీనివాస్. కానీ ఆమె బుసలు కొడుతూండడం గమనించి ఊరుకున్నాడు. దీపకు కోపంవస్తే ఒళ్ళుపై తెలియదు. ఆమెను పలకరించడం రిక్షావాడి ముందు తన పరువు తీసుకుందుకే అవుతుందని భయపడ్డాడు శ్రీనివాస్.

ఇలు చేరాక ఇంట్లో కాసేపు మౌనం రాజ్యమేలింది. ఆఖరికి శ్రీనివాస్ ధైర్యంచేసి— "ఏమయింది దీపా—అలా ఉన్నావు? మీ యింట్లో నిన్నెవరైనా ఏదైనా అన్నారా?" అన్నాడు.

దీప విసురుగా తల ఎత్తింది. కళ్ళలోంచి అగ్నికురిపిస్తూ "ఈ ప్రపంచంలో మీరు తప్ప నన్ను బాధించాలనుకునే వారే లేరు"—అంది.

శ్రీనివాస్ తెల్లబోయాడు. "నేనా! నేనేం చేశాను—ఇప్పుడే కదా నీవు వచ్చింది—"

"నే నింటికి వెళ్ళి ఎన్నాళ్ళయింది?"

"మూడు వారాలు. నువ్వు వెళ్ళినప్పట్నించీ క్షణమొక యుగంలా గడుపుతున్నాను-తెలుసా?"

"అన్నీ అబద్ధాలు -" అంది దీప- "అదే నిజమైతే మీరు నాకు కనీసం ఒక్కసారైనా ఉత్తరం రాసుండేవారు"-

అప్పటికి శ్రీనివాస్‌కి ఆమె కోప కారణం అర్థమై "నేను నీకు ఓ ఉత్తరం రాశాను అందలేదా?" అన్నాడు.

"రాస్తే ఎందుకు అందదు?"

"ఏమో - పోస్టులో మిస్సయి ఉండవచ్చు-"

"కల్లబొల్లి కబుర్లు చెప్పకండి. మీరు ఉత్తరం రాస్తే నాకు తప్పక అందుతుంది. మీరుత్తరం రాశానంటే నేను నమ్మను"

"నువ్వు నమ్మాలంటే నేనేం చేయాలి?"

"నామీద ఒట్టువేయండి-"

శ్రీనివాస్ వెంటనే ఒట్టు వేశాడు.

దీప తెల్లబోయి - "ఇంతకి ఎంతగా తెగించారు? అబద్ధాలాడి నా మీద ఒట్లు కూడా వేసేస్తున్నారన్నమాట-" అంది.

దీనికి పెద్ద రాద్ధాంతం. అది పక్కింటి దాకా చేరింది.

పక్కింట్లో శోభ, శేఖర ఉంటున్నారు. ఇద్దరూ కూడా శ్రీనివాస్ కుటుంబంతో చనువుగా ఉంటారు. వివాహానికి ముందు శేఖరం, శ్రీనివాస్ మంచి స్నేహితులు. ఆ స్నేహం ఇంకా బాగా కొనసాగుతూనే ఉంది.

శేఖరానికి ఎదుటివాళ్ళను ఏడిపించడం సరదా. ఆ రోజే దీప ఊర్నించి వస్తుందని అతడికి తెలుసు. వస్తూనే భార్యాభర్తలమధ్య ఏదో గొడవ ప్రారంభమైందని అతడికి అర్థమయింది. అతడు శోభతో "వాళ్ళొచ్చినట్టున్నారు పద పిలిచి కొస్త కాఫీ ఇద్దాం" అన్నాడు. కాఫీ అగ్నికి ఆజ్యం పోయాలని అతని అభిలాష.

దీప, శ్రీనివాస్‌లు ఇంకా గొడవపడుతూండగానే శేఖరం వాళ్ళింటి తలుపు తట్టాడు.

'హమ్మయ్య' అనుకున్నాడు శ్రీనివాస్. వచ్చిందెవరైతేనేం తాత్కాలికంగా తనకు మోక్షం లభించింది. అతడే వెళ్ళి తలుపుతీసి శేఖరం దంపతులను సాదరంగా ఆహ్వానించాడు.

"చాలాకాలం తర్వాత కలుసుకున్న దంపతులు కదా-మిమ్మల్ని డిస్టర్బ్ చేయకూడదనుకున్నాం కానీ మీరే మమ్మల్ని డిస్టర్బ్ చేశారు. అందుకని పిలిచి కాస్త కాఫీ ఇద్దామనుకుంటున్నాం-" అన్నాడు శేఖరం.

దీప కొస్త సిగ్గుపడింది-తమ గొడవ పొరుగింటిదాకా వినబడినందుకు. దాన్నించి బయటపడడం కోసం ఆమె "చూడండన్నయ్యగారూ - మూడు వారాలు పుట్టింట్లో ఉంటే ఈయన నేనెలాగున్నానోనని ఒక్కటంటే ఒక్క-




ఉత్తరం కూడా రాయలేదు. పైగా రాశానని అబద్ధమాడుతున్నారు-" అంది.

శేఖరం వెంటనే-"బాగుందమ్మా మీ ఆడవాళ్ళ వరస. తను పుట్టింట్లో ఉంటే నానుంచి రోజుకో ఉత్తరం అందితే సిగ్గుతో చచ్చిపోతున్నానని మా ఆవిడం టుంది"- అన్నాడు. అతడు చెప్పాలనుకున్నది అదికాదు. తను భార్యకు రోజుకో ఉత్తరం రాస్తాడని దీపకు తెలియాలి. అప్పుడే అగ్నిలో ఆజ్యం పడుతుంది.

"చాల్లెండి-మిమ్మల్ని ఉత్తరం రాసినందుకు నేనెప్పుడూ తప్పు పట్టలేదు" అంది శోభ వెంటనే-తను సిగ్గుపడుతూ.

శ్రీనివాస్‌కు శేఖరం ఉద్దేశ్యం అర్థమయింది. అతడి గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లయింది. భయంభయంగా దీప వంక చూశాడు; ఆమె కోపాన్ని అణచుకుంటోంది. వాళ్ళిద్దరూ వెళ్ళగానే అగ్నిపర్వతం పేలుతుంది.

శేఖరం దంపతులు కాసేపుంటే బాగుండునని అతడనుకున్నాడు. కానీ శేఖరం అక్కడ ఎంతోసేపుండలేదు. పోస్టల్ డిపార్టుమెంటు ఎంత శ్రద్ధగా పని చేస్తున్నదీ-పొగిడి ఎవరికిఅబద్ధాలు చెప్పినా భార్యకు చెప్పకూడదని నీతులు చెప్పి-ఇప్పుడే కదా వచ్చారు. త్వరగా తెమిలి

కాఫీకి రండి-" అని భార్యతోసహా వెళ్ళి పోయాడు శేఖరం. వాళ్లు పోగానే శ్రీనివాస్ భయంభయంగా తలుపులువేయ బోతుండగా చాకలి వచ్చాడు. వాడిని చూడగానే శ్రీనివాస్‌కు కౌగిలించుకుని ముద్దుపెట్టుకోవాలన్నంత అభిమానం కలిగింది. అభిమానంగా - "రా....రా.... అమ్మగారొచ్చేశారు-" అన్నాడు. ఊహించని ఈ ఆహ్వానానికి ఆశ్చర్యపడుతూ చాకలి లోపలకు వచ్చాడు. శ్రీనివాస్‌కు సాధారణంగా చాకలిని చూస్తే చిరాగ్గా ఉంటుంది.

"దీపా-నేను పద్దు సరిగ్గా వేయనంటావని ఈ మూడువారాలూ నేను చాకలికి బట్టలు వేయలేదు-" అని శ్రీనివాస్ వినయంగా భార్యకు చెప్పాడు.

దీప మాట్లాడలేదు. ఆమె చకచకా చాకలికి బట్టలువేసింది. అప్పుడు శ్రీనివాస్ చొక్కా జేబులోంచి ఓ కవరు బయటపడింది.

ఆ కవరు అతికించి ఉంది. దానిమీద స్టాంపులున్నాయి. అడ్రసు రాసి ఉంది. అది దీప పుట్టింటి అడ్రసు.

దీప చటుక్కున ఆ కవరు తెరిచి అందులోని ఉత్తరం తీసింది.

అది శ్రీనివాస్ భార్యకు రాసిన ఉత్తరం. భార్యపై తనకు గల ప్రేమను, ఆమెకై తానను భవిస్తున్న విరహాన్ని వర్ణిస్తూ అతడు ఉత్తరం వ్రాశాడు. ఉత్తరం చదవగానే దీప కోపం అంతాపోయింది. ఆమె ఉత్తరాన్ని కవర్లో పెట్టేసి చాకలిని పంపేశాక భర్తవద్దకు వెళ్ళి- "ఇదేమిటండీ-?" అనడిగింది.

శ్రీనివాస్ ఆ కవర్ని పరిశీలించి- "అరే - ఇది నేను పోస్టుచెయ్యలేదా?" అన్నాడు.

భర్త పరధ్యానం విషయం దీపకు తెలుసు.

"ఈ ఉత్తరం నాకు అందిఉంటే ఒక వారంరోజులు ముందే వచ్చిఉండేదాన్ని-" అందామె భర్తవంక ప్రేమగా చూస్తూ.

"నువ్వు వెళ్ళిన నాలుగు రోజులకిది రాశాను. పోస్టు చేశాననే అనుకున్నాను. నన్ను క్షమించు దీపా!" అన్నాడు శ్రీనివాస్.

దీప అతడిని క్షమించేసింది. తర్వాత పది నిముషాల్లో కెమిలి ఇద్దరూ శేఖరం ఇంటికి వెళ్ళారు. వెళ్ళేటప్పుడు శ్రీనివాస్ తన ఉత్తరాన్ని కూడా తీసుకొని వెళ్ళాడు.

భార్యాభర్త లిద్దరూ ముసిముసిగా నవ్వుకుంటూ ప్రసన్న వదనాలతో కులాసాగా తన ఇంటికి వచ్చేసరికి శేఖరం తెల్లబోయాడు.

"ఏం శ్రీనివాస్! సమస్య శాంతియుతంగా పరిష్కారమైపోయిందా?" అనడిగాడు తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

శ్రీనివాస్ అతడికి జరిగింది చెప్పి తన జేబులోని కవరు చూపించాడు. శేఖరం చలించకుండా "మొత్తంమీద



అసాధ్యుడివే- మంచి ట్రిక్కే వేశావు" అన్నాడు.

"ట్రిక్కేమిటి?" అన్నాడు శ్రీనివాస్ ఆశ్చర్యంగా.

"చెబుతాను. ముందు డైనింగ్ టేబిల్ దగ్గరకు పోదాం" అన్నాడు శేఖరం. అంతా అక్కడకు పోయి కూర్చున్నారు. శోభ ప్లేట్సులో ఇడ్లీలు తెచ్చి అందరి ముందు పెట్టింది.

"శోభా! నీ అన్న చాలా గట్టివాడు. నిన్నటిరోజు రాత్రికి రాత్రి ఓ ఉత్తరం రాసి- అది పాత చొక్కా జేబులో పెట్టి ఎన్నాళ్ళక్రితమో రాసిందని నమ్మించేశాడు మా చెల్లెల్ని"- అన్నాడు శేఖరం.

శ్రీనివాస్‌కి ఇడ్లీముక్క గొంతులో అడ్డంపడింది. అతను కాసిని నీళ్ళు తాగి "అబద్ధం, ఆ ఉత్తరాన్ని నేను చాలాకాలం క్రితమే రాశాను-" అన్నాడు.

"అక్షరాలు చూసి ఉత్తరం ఎప్పుడు రాసిందీ తెలుసుకోవచ్చు" అన్నాడు శేఖరం.

శేఖరం సైంటిస్టు. ఆ విషయం దీపకు తెలుసు. అయితే అతను తనను ఆటపట్టిస్తున్నాడని ఆమెకు తెలియదు. అందుకే "ఎలా?" అని అడిగింది.

సిరాను అక్షరరూపంలో కాగితం మీదకు మార్చాలి-అది రోజురోజుకు మార్పు చెందుతుంది. ఆ మార్పుల్ని గమనించడానికి కొన్ని సునిశిత సాధనాలు మా లాబొరేటరీలో ఉన్నాయి" అన్నాడు శేఖరం.

"అయితే ఈ ఉత్తరం మీ దగ్గరే ఉంచి- అదెప్పుడు రాసిందో కనుక్కొని నాకు చెప్పాలి" అంది దీప.

శ్రీనివాస్ తెల్లబోయి "దీపా నువ్వు నన్ననుమానిస్తున్నావా- ఈ విషయంలో నీ కింత పట్టుదల ఎందుకు?" అన్నాడు.

"ఎందుకా - మీరు నా మీద ఒట్టు వేశారు కనుక....."

శ్రీనివాస్ కేంచేయాలో తోచలేదు. శేఖరం వినోదాన్ని అర్థం చేసుకునే స్థాయికి- దీప ఇంకా ఎదగలేదు. ఆమె అంతా నిజమేనని భ్రమిస్తోంది.

అతడు ఆ రాత్రంతా ఈ విషయం దీపకు నచ్చజెప్పాలని, పగలంతా శేఖరాన్ని కాకపట్టాలని అనుకున్నాడు.

టిఫిన్ తిని ఇద్దరూ తమ ఇంట్లోకి వెళ్ళారు- శ్రీనివాస్ భార్యకు శేఖరం మన స్తత్వాన్ని వివరించి-"రేపు అతడొక వేళ ఈ ఉత్తరం నిన్ననే వ్రాయబడింది అని చెబితే నీవు నమ్మకూడదు" అన్నాడు.

"ముందరి కాళ్ళకు బంధం వేయకండి" అంది దీప కోపంగా.

అయితే ఆమె కోపం ఎంతోసేపు నిలువలేదు. తర్వాత ఇద్దరూ ఎన్నో విశేషాలు ముచ్చటించుకున్నారు. ఆ రోజు సెలవుకావడంవలన మధ్యాహ్నం మేట్నీ సినిమాకు కూడా వెళ్ళారు.

శ్రీనివాస్‌కు మాత్రం మనసులో బెంగగానే ఉంది. దీప చూపే ప్రసన్నత తాత్కాలికం. రేపు శేఖరం మళ్ళీ తన జీవితంలో తుఫాను సృష్టిస్తాడు.

సినిమా చూసి, హోటల్లో టిఫిన్ తిని ఇద్దరూ ఇల్లు చేరారు. ఇల్లు చేరిన కాసేపటికి శోభ వారింటికి వచ్చింది. ఉత్తరాన్నామె దీపకు అందించి "శోభా! నీకు తెలియదు. మా వారు కాస్త అల్లరి మనిషి. మా అన్నయ్యగారిని అనవసరంగా అపార్థం చేసుకోకు" అంది.

"అంటే!" అంది దీప

"ఆయన చెప్పినవన్నీ అబద్ధాలు. నువ్వు కోపంగా ఉన్నావని తెలిసి ఆయన మా అన్నయ్య నిబ్బందిపెట్టడం కోసం ఏమేమో అన్నారు" అంది శోభ.

"అంటే ఆయన నీ కుత్తరాలు రాయడంకూడా అబద్ధమేనా?"

"కాదనుకో-కానీ నేను కులాసా నువ్వు కులాసా అని తలుస్తాను- అని ఉత్తరాలు




రాసే భర్త అంటే-పోస్టుచేయకపోయినా ఇలాంటి ఉత్తరం రాసే భర్త ఉండడం పెద్ద అదృష్టం. ఈ ఒక్క ఉత్తరం-వేయి మధురానుభవాల పెట్టు-" అని శోభ అక్కడ్నించి తొందరగా వెళ్ళిపోయింది.

ఆ సంభాషణ శ్రీనివాస్ కూడా విన్నాడు "హమ్మయ్య! శేఖరం కొన్నాళ్ళు బిజీగా ఉంటాడు. నా జోలికి రాడు" అనుకున్నాడతను.

అయితే శేఖరం ఇంట్లో ఏం జరుగుతుందో శ్రీనివాస్ తెలుసుకోలేకపోయాడు. మరి శ్రీనివాస్ మరోరకంగా చాలా రోజుల విరహం అనంతరం భార్యతో కలిసి తిరగడంలో బిజీగా ఉన్నాడు.





# నవీనుడు

ఇసుకపల్లి సుజాత

చంద్రరేఖకు కథలంటే ప్రాణం. అందులో నవీన్ కథలంటే మరీను. మొన్నామధ్య నవీన్ హైద్రాబాద్ వచ్చినప్పుడు ఊళ్లోనే కదా అని కలవడానికి వెళ్ళింది కూడా. పేరు వినడమే గాని ఎప్పుడూ చూడలేదు కాబట్టి గుర్తుపట్టడం కొంచెం కష్టమే అయింది కాని అక్కడ జన మధ్యంలో నుంచున్నది నవీనేనని గుర్తుపట్టి చొరవగా అతన్ని సమీపించి 'చంద్రరేఖ అనే అమ్మాయి మీ కథల గురించి తరచు ఉత్తరాలు వ్రాస్తూంటుంది చూడండి. ఆ అమ్మాయిని నేనే' అని తనను తాను, పరిచయం చేసుకుంది. జనాన్ని తోసుకుని హడావిడిగా ముందుకు వస్తున్న ఆమెను చూశాడేగాని నవీన్ కూడా పేరు విన్నాకే

ఆమెను గుర్తు పట్టాడు. వెంటనే, చేతులు రెండు జోడించి 'నమస్తే చాలా సంతోషం' అని ముక్తసరిగానే అన్నాడు కాని ఆమె తనను వాళ్ళింటికి ఆహ్వానిస్తే బాగుణ్ణు అని అనిపించకపోలేదు నవీన్‌కి. అతని మనసులోని మాట పసిగట్టిందో ఏమో చంద్రరేఖ అదేమాట పైకి అనేసింది. మొదట కొంత మొహమాట పడినా విజిటింగ్‌కార్డ్ ఇచ్చాక మర్నాడే ఆమె ఇంటికి రావడానికి ఒప్పుకున్నాడు.

సాయంత్రం అయిదు కావస్తోంది. ఒకపక్క వాకిట్లో లిల్లీ, గులాబీపూల కుండీలను సర్దుతూనే మరొక పక్క మాలిని శుభ్రంగా ఊడవమని పురమాయిస్తూ తెగ హడావిడి పడుతోంది చంద్రరేఖ. మొదట వాళ్ళ నాన్నగారు అతని రాకకు కొంత అభ్యంతరం చెప్పినా పిలవటం అయ్యాక ఇప్పుడు ఏమనీ ఏంలాభం అని కాస్త చిరాకుపడ్డారు కూతురి మీద.

సరిగ్గా అయిదు గంటలు కొట్టంగానే వాకిట్లో స్కూటర్ ఆగిన చప్పుడయింది. వెంటనే కర్టెన్ తీసి చూసి మనిషే వస్తుంటే కథ చదవటమెందుకని పుస్తకం లోపల పెట్టేసి పరుగులాంటి నడకతో బైటకు వచ్చేసింది. నవీన్ లోపలికి రాగానే సోఫామీద కూర్చోమని చెప్పి 'ఈయనే సుప్రసిద్ధ కథా రచయిత నవీన్‌గారు. వారు మా నాన్నగారు. బిజినెస్ చేస్తుంటారు' అని చంద్రరేఖ నవీన్‌ను వాళ్ళ నాన్నగారికి పరిచయంచేసింది. పరస్పర నమస్కారాలయ్యాక 'ఈ అమ్మాయి చాలా మోడ్‌గానే ఉంది, తనే స్వయంగా నన్ను వాళ్ళ నాన్నగారికి పరిచయం చేసింది' అని మనసులోనే అనుకున్నాడు నవీన్.

చంద్రరేఖ వాళ్ళ నాన్నగారు కూడా 'ఏమో అనుకున్నాను అన్న పైమనికి సరిగ్గానే వచ్చాడు బుద్ధిమంతుడు లాగానే ఉన్నాడు చూస్తే' అని మనస్సులోనే అభిప్రాయపడ్డారు. టిఫిన్ తీసుకు వచ్చిన చంద్రరేఖను చూడగానే వారిద్దరి మూగ సంభాషణ ముగిసింది. టిఫిన్ చెయ్యడం పూర్తయ్యాక ఆమె అతని కథల గురించి ప్రశ్నల వర్షం కురిపించటం మొదలుపెట్టింది. నవీన్‌కు ఇది కొంత ఇబ్బంది అనిపించినా ఏదో కప్పదాటుస మాధానాలు చెప్తూ వచ్చాడు. ఆమె నాన్నగారు కుటుంబ విషయాల గురించి ఏవో అడుగుతుంటే అన్నిటికీ శ్రద్ధగా నవ్వుతూ జవాబిచ్చి ఇంక వెళ్ళొస్తానని చెప్పి తన విజిటింగ్ కార్డు వాళ్ళకిచ్చి వాళ్ళందర్నీ తమ ఊరుకి రమ్మని ఆహ్వానించి మరీ వెళ్ళాడు నవీన్.

ఎప్పటికైనా ఒక గొప్ప రచయితను పెళ్ళాడాలని కలలు గన్న చంద్రరేఖకు ఆ రచయితే యీ నవీనేమో అని అనిపించింది.

కాలేజీకి వెళ్ళాక తన ఫ్రెండ్స్‌తో నవీన్‌ను గురించి ఏకరువు పెట్టేసింది. వాళ్ళంతా కూడా 'అతని గొప్పతనం మాకు తెలుసులేవే బాబు, నువ్వు ప్రత్యే కంగా చెప్పాలా ఏమిటి' అని ఎగతాళి చేశారు, ఆమె మనస్సును పసిగట్టి.

నవీన్ వచ్చి వెళ్ళినప్పటినుండే చంద్రరేఖకు తొందరగా పెళ్ళిచేసేస్తే బాగుండుననుకున్నారు వాళ్ళ నాన్నగారు. అదే మాట భార్యతోను చెప్పి సంప్ర దింపులు జరిపి తాను వస్తున్నట్లుగా నవీన్‌కు ఉత్తరం వ్రాశారు.

తాను వరించబోయేది ఒక గొప్ప రచయితని అని తలచుకున్న చంద్రరేఖ సంతోషానికి అవధిలేకుండా పోయింది.

స్టేషన్‌కు వచ్చి అయనను సగౌర వంగా ఇంటికి తీసుకువెళ్ళి తల్లిదండ్రు లకు పరిచయం చేశాడు నవీన్. మర్యాద లయ్యాక కాస్సేపు ఎండలు, రాజకీయాలు వగైరాల గురించి మాట్లాడిన తరువాత వచ్చిన విషయం బైటపెట్టారు చంద్ర రేఖ వాళ్ళ నాన్నగారు. విషయం విన్న నవీన్ తల్లిదండ్రులు లోపలికెళ్ళి కొంత సేపు చర్చించుకున్న తరువాత అంగీక రించారు. చంద్రరేఖ అభిప్రాయాలెరిగిన నవీన్ కాస్త తటపటయించినా 'ఏమవు తుందిలే, దీనివలన పెద్ద ఏమిటి నష్టం?' అని ధైర్యంచేసి ఆమెను వివాహం చేసుకోవడానికి ఒప్పుకున్నాడు.

వచ్చిన పని సానుకూలమయిందని తెలుసుకుని అయన తమ ఊరు తిరిగి వెళ్ళి ఈ శుభవార్త ఇంట్లో చెప్పడ మేమిటి, అతి వైభవంగా చంద్రరేఖా నవీన్‌ల వివాహం జరగడమేమిటి అంతా ఒక వారంరోజుల్లో చకచకా జరిగి పోయింది.

కొన్నాళ్ళ వరకు, తనసలు కథ లే వ్రాయట్లేదేమిటి అని లోలోపలే బాధపడి ఓపికతో ఎదురుచూస్తూ వచ్చింది చంద్రరేఖ. ఇంక లాభం లేదనుకుని లోపలి మాట అతనితోనే పైకి అనేసింది. 'ఈ మధ్య మీరు కథలే వ్రాయట్లేదు. ఎందుకని? ప్లీజ్ నాకోసమైనా వ్రాయరా. అసలు పెళ్ళయ్యాక ఒక్క కథ కూడా వ్రాయలేదు ఇలాగని తెలిస్తే నేను చేసుకోకపోదును' అని గబుక్కున అనేసింది తొందరపాటులో. నవీన్‌కు ఒళ్ళుమండి 'అవునులే నీ ప్రేమంతా నా కథలమీదే కదూ' అని తటాలున అనేసి చివుక్కున లేచి వెళ్ళిపోయ్యాడు. చంద్రరేఖ మనస్సు చివుక్కుమంది ఎందుకన్నానా ఆ మాట అని.

కొనాళ్ళ తరువాత పత్రికల్లో ఉగాది కథల పోటీల గురించి చదివిన చంద్రరేఖ మళ్ళీ మొదలుపెట్టింది నవీన్‌ను కథలు వ్రాయమని అడగటం. 'నేను మిమ్మల్ని వ్రాయమనేది బహుమతి కోసం కాదు. అయినా వ్రాసినవాళ్ళందరికీ బహుమతి రావాలనుందా ఏమిటి?



అందుకుకాదు నే ననేది. ఇప్పుడు వ్రాస్తే కనీసం ఇంతకు ముందున్న పేరైనా నిలుస్తుందని నా ఆశ. వ్రాయలేనివాళ్ళు ఎలాగూ ఆ పని చేయలేరు. వ్రాసేవాళ్ళు కూడా ఇలా మానేస్తే ఎలా!' అని ఎంతో ప్రాధేయపడింది చంద్రరేఖ. కాని తన పేరుతో కథలు వ్రాసిపెట్టే స్నేహితుడు వేరే ఊరు ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిపోయ్యాడని చంద్రరేఖకు చెప్పడమెలాగ అని మధనపడిపోతూ నవీన్ నిస్సహాయంగా చూశాడు ఆమెవైపు తనను మన్నించమని.

# స్వర్గ సోపానం మొదటి మెట్టు

కోమలాదేవి

కృష్ణపక్ష మసక వెన్నెల.

పలుచని మంచు తెరలోంచి–ప్రముఖ రేఖా చిత్రకారుడు తన కుంచెతో అలా ....అలా గీచిన ఔట్‌లైన్‌లా దూరపు గోథిక్ చర్చి గోపురం కనబడుతోంది.

గోడవారగా – చీకటిని కౌగలించుకుంటూ నిర్మానుష్యమైన రహదారివెంట భయం భయంగా అటు ఇటు చూస్తూ తన్ను తాను రక్షించుకోవాలన్న బలవత్తరమైన సహజకోర్కె అణువణువున వ్యాపించగా ఆమె ఎలాగో ఆ చర్చి గేటు త్రోసింది–కాని లోపల ఒక కిలో బరువుగల తాళంకప్ప ఆమె చేతులకు చల్లగా భయంకరంగా తగిలింది!

దేవుడి గుడికి తాళంకప్ప! ఇక్కడ కూడ గడియ మూసిన తలుపులేనా? రక్షణ కోసం పరుగెత్తుకువస్తే ఈ తాళంకప్ప తనను వెక్కిరిస్తోంది!

ఆమె ఆత్రంగా రెట్టించిన భయంతో అటు ఇటు చూసింది. ఎవ్వరూ లేరు. పిట్ట అరుపుకే ఆమె గుండెలు దడదడలాడాయి. ఎవరైనా రావచ్చు బాబోయ్! ఆమె వెంటనే చీర కచ్చాపోసి దోపింది. అడ్డ కంటీమీద కాలేసి ఎక్కింది. బల్లెల్లా మొనదేలిన గేట్ పైభాగం ఆమె కంఠం వరకు వచ్చింది. ఎట్లా? ఆ పై కంటీ మీద కాలుపెట్టి ఆ మొనదేలిన 'బల్లేలను' దాటి అవతలికి దూకగలదా!

ఆమెలోని నిరాశను, భయాన్ని వెలికి దీసి ఆమెలో ఏమాత్రం జీవితం మీద ఆశఉన్నా దాన్ని మొదలంటా నరికివేస్తూ ఆమెమీద వెలుగు పడింది. "ఎవరు నీవు?"

ఆమె ఉలికిపోయింది. తరువాత కుప్పగా దబ్బున పడిపోయింది. తను దొరికిపోయిందన్న భయం ఆమెను నిస్సత్తువగా జేసి ఏదో శూన్యంలోకి లాక్కె

పోతున్నలా ఉంది. ఆ సమయంలో ఆమెకు ఓ సత్యం కాంతికిరణంలా కనబడింది. లోపలినుండి తాళం వేస్తున్నారు! అంటే! బైట తనను పట్టుకోటానికి ఎవ్వరూ రాలేరన్నమాట. ఆమె తేలికపడ్డ హృదయంతో కళ్ళు మూసుకుంది. తాళం తీస్తున్న చప్పుడుకి గొళ్ళెం తీస్తున్న చప్పుడు ఆమెకు మధురాతి మధురంగ వినబడింది.

"ఎవరమ్మా-ఏం కావాలి?"

"అభాగ్యురాల్ని. రక్షించండి" అంది అతి దీనంగా.

"రా....లోపలికి" కొద్దిగా తెరచిన గేట్‌కు అడ్డం తొలిగాడు. ఆమె సంకోచించక పరుగుపెట్టినట్లే లోపలికెళ్ళింది అతడు మాట్లాడలేదు. టార్చివేస్తూ నడుస్తున్నాడు. అతడి అడుగుజాడల్లో నిశ్చింతగ నడుస్తోందామె. దార్లుతీరిన వృక్షాలమధ్య కాలిబాటన వెళ్ళి చిన్న ఇంటిని సమీపించారు. చిన్న చెక్క గేట్ తీసి లోపలికెళ్ళాడు. ఆమె అనుసరించింది.

ముందరి గదిలోకి అడుగుపెట్టగానే-ఆమెను ఎవరో వెనక్కి లాగినట్లు చటుక్కున వెనుదిరిగి కచ్చాపోసిన చీర సరిచేసుకు వచ్చింది.

"నేను ఈ చర్చికి ఫాదరీని. అంటే ప్రీస్టును. ఆ గదిలో అన్నీ ఉంటాయి. వెళ్లు" అన్నాడతను.

ఆమె దండంపెట్టి ప్రక్కగా ఉన్న గదిలోకి వెళ్ళింది. అతను లైట్ ఆర్పి లోపలికెళ్ళిపోయాడు.

లైట్ వేసి ఆ గదిలో తను సురక్షితంగా ఉండగలదన్న సత్యం తెలుసుకున్న వెంటనే లైట్ తీసేసింది. భయం-అనుమానం - అపనమ్మకం ఆమెలో జీర్ణించుకుపోయి ఉండగా చటుక్కున తలుపువేసుకుని గడియ బిగించింది. ఆ తలుపు ఎవ్వరూ తెరవకూడదు తెరిచినా లోపలికి రాకూడదన్నట్లు తలుపుకు ఆనుకుని కూర్చుండిపోయింది. తను సురక్షితంగా ఉంది-ఆ భావనకు ఆమె ఇంద్రియాలు సడలినై. స్థబ్దుగా కూర్చుని కాసేపటికి నేలమీద ఒరిగిపోయింది. మరుక్షణంలో గాఢ నిదురలోకి జారిపోయింది.

ఉదయం ఎనిమిది గంటలైనా ఆమె లేవలేదు. ఆయన ఆంగారుగా తలుపు దగ్గర నుంచున్నాడు. సందడి లేదు. అవతలగా వెళ్ళి కిటికీలోంచి చూచాడు. అమె తలుపుకు ఆనుకొని నిదురబోతోంది!

పాపం- అనుకున్నాడు.

పనిమనిషివచ్చి తన పనులు ముగించుకొని వెళ్ళిపోయింది. అతడు ట్రేలో కాఫీ ఉప్మాపెట్టుకొని గదిలోకి తీసుకొని వెళ్ళాడు.

"రాత్రి ఎవరో వచ్చినట్లున్నారు?" కాంత అడిగింది.

"ఔను. మరో అభాగిని ....ఇంకా నిద్రపోతూనే ఉంది. బహుశః భద్రత అనుకుంటా. హాయిగా పడుకుంది"

"ఔను." ఆమెను మెల్లగా లేపి కూర్చోబెట్టాడు. కప్పు చేతికి అందించాడు.

అతడు మాట్లాడలేదు. తను గూడా త్రాగుతూ-ఉప్మా తింటున్నాడు.

"ఎవరు? ఏం జరిగిందట?"

"తెలీదు. కాని ఆమె ప్రవర్తన వింతగా ఉంది... గేట్ చప్పుడువేసి పిలుస్తారు. కాని రాత్రి ఆమె గేట్ ఎక్కి దూకాలని ప్రయత్నించింది."

"బహూశః ఎవరైనా వెంటాడుతున్నారేమో?"

"కావచ్చు. నే నేమీ అడగలేదు? రెండురోజులుండి వెళ్ళిపోతుంది. ఎల్లప్పుడు మన దగ్గర ఉండదు కదా?"

ఆయన ఆమె ఖాళీచేసినవి తీసుకొని లోపలికెళ్ళిపోయాడు. ఆమె తన ప్రక్కన ఉన్న దువ్వెన తీసుకొని మెల్లగా తల దువ్వుకుంది. ఆయనవచ్చి రెండు జెడలు అల్లాడు.

"నాకెందుకింతపొడవైన వెంట్రుకలు-కత్తిరించండి. మీకు కూడ సులభమౌతుంది" అంది భర్తవేపు వేడికోలుగా చూస్తూ.

ఆయన నవ్వాడు "ఒద్దు....నాకిష్టమైన పనుల్లో-ఇలా జడలువేయటం ఒకటి.... తెలుసా."

ఆమె మరి మాట్లాడలేదు. కళ్ళను కప్పుతోన్న నీటిపొర తడి కంట దకుండా కన్ను మూసేసుకుంది. కాని అతడు గ్రహించాడు. ముందుకు వంగి - ఆమె చెక్కిలికి తన చెక్కిలి ఆనించి ఆర్ద్రంగా అన్నాడు.

"నువ్వు ఇలా బాధపడటం మానక పోతే నేను ఇంకా బాధపడ్తాను. అది నీ కానందమా?"

"ఊహూ" అంటూనే అతడి మెడ చుట్టూ చేతులువేసి కాసేపు అతణ్ణి తనకు దగ్గరగా పట్టుకుంది. ఆ సన్నిహితత్వం చాలు-ఆమెకు మనోబలం ప్రసాదించటానికి. తలుపుతీసిన చప్పుడైంది. ఆమె అతణ్ణి వొదిలి తలగడమీద అనుకుంది. అప్పుడు వచ్చిందామె.

శాంత-దగ్గరకు రమ్మన్నట్లు తలూపింది. ఆమె వచ్చి నమస్కరించింది.

"నీ పేరేమిటమ్మా?" అడుగుతూ స్టూలు చూపించింది.

"నా పేరు .... సునీత.... అంటారు" అని ఆమె శాంతను ఆమె భర్తను-శాంత పడుకున్నరీతిని-అతడు జడ అల్లుతున్న చర్యను నిశ్చేష్టితయై చూస్తోంది.

"అమ్మా .... మీకు .... అరోగ్యం సరిగా లేదా?"

శాంత నవ్వింది. "నా ఆరోగ్యం సరిగానే ఉంది. రెండేళ్ళుగా ఇలా పడకలో ఉన్నాను."

"మీరు నడవలేరా?" అంది ఆశ్చర్యంతో.

"లేదు" శాంత ముక్తసరిగా అంది.

ఆయన జడలువేసి అక్కడినుండి వెళ్ళిపోయాడు.




"ఏమైనా వండుకుని తిన్నావా?" శాంత అడిగింది.

"లేదు అలస్యంగా లేచాను. మన్నించండి."

"ఫరవాలేదు వెళ్ళు నీ పనులు ముగించుకుని-ఏదైనా తినిరా"

సునీత వెళ్ళింది. గదిలో స్టౌ మొదలు వంటసామానంతా ఉంది. ఆమె అలా చూస్తోనేఉంది- అతడు వచ్చి సగంగ్లాసు పాలు ఇస్తూ అన్నాడు "అన్నీ ఉంటాయి. ఏదో ఒకటి లేకపోయినా ఫరవాలేదు. వండి తినమ్మా."

ఆమె గ్లాసు తీసుకుంది. అతడు వెళ్ళిపోయాడు. ఆమె తన పనులు ముగించి వంట ప్రారంభించింది. ఆమె మనసులో శాంత- అతను మెదులు తున్నారు. చూస్తే వయసు చిన్నదే! అప్పుడే ఆమెకు ఏదో జబ్బు! ఎంత అనురాగంతో ఆమెకు సేవచేస్తున్నాడు! అతడికి కూడా ముప్పైదాటి ఉండవు. ఇది సాధ్యమా.... ఈ అనుబంధం ఆమెకు విచిత్రంగా తోచింది.

రెండు రోజులు గడిచిపోయాయి. ఆమెను గురించిన వివరాలు శాంతగాని- అతడుగాని అడగలేదు. ఆమెకు ఎంతో ఆశ్చర్యంగా ఉంది. అతడు ఉళ్ళోకి వెళ్ళినప్పుడు చర్చిపనుల్లో లీనమై వున్నప్పుడు సునీత శాంతదగ్గర కెళ్ళి కూర్చునేది.

మూడవరోజు ఉదయం అతడు పాలు అందిస్తూ అన్నాడు.

"అమ్మా ఈ రెండురోజుల్లో ఎక్కడికి వెళ్ళాలో నిర్ణయించుకుని ఉంటావు. రెండు మూడు రోజుల్లో మీరు వెళ్ళిపోవాలి."

ఆమె పాలగ్లాసు అందుకోలేదు. నిస్సహాయంగా గోడకు ఆనుకున్నది. ఈ భద్రతను ఇంత త్వరగా కోల్పోతుందని ఆమె అనుకోలేదు.

"అయ్యా నాకు ఎవ్వరూ లేరు...." గాభరాగా అంది

"ఎవ్వరు లేకుండా ఇంతవారు కాలేరు." అతడు శాంతంగా అన్నాడు.

"నాకు ఒకరున్నారు. వారివల్ల ఇంత దాన్ని అయ్యాను - అని చెప్పుకోగల వారెవ్వరూ లేరు. కన్నీటితో చాలీచాలని తిండితో— క్రూరత్వమే నన్ను పెంచింది. ఎక్కడికి వెళ్ళినా ఆశ్రయం దొరకదని— స్వర్గానికి సోపానం అన్నట్లున్న ఈ గుడిగోపురాన్ని చూచి గంపెడాశతో వచ్చాను."

"కావచ్చు - కాని ఆ సోపానపు మొదటిమెట్టు ఈ భూమి మీద నే ఉన్నది. కనుక మనం ఈ మెట్టుదగ్గర ప్రారంభించాలి. ఆపదలో ఉన్నవారికి ఆశ్రయం ఇస్తాను. కాని కొంత కాలం వరకే. ఇలా వచ్చినవారి నందరినీ జీవితాంతం భరించే స్తోమత నాకు లేదమ్మా. మీకు ఎవ్వరూ లేకపోతే ఏదైనా శరణాలయానికో ఆశ్రమానికో పంపే ఏర్పాటు చేస్తాను."

ఆమె చేతులుకట్టుకుంది. చేతుల వ్రేళ్ళు రెక్కల్లో దిగబడిపోతున్నంతగా బిగిసిపోతున్నాయి. ఆమె ముఖంలోని పాండురతకు అతడు అచ్చెరువొందా...

'జీవితంలో పోరాడి విసిగిపోయినట్లుంది పాపం' అనుకున్నాడు.

"భయంలేదు. ఏదో ఉద్యోగం...."

"అయ్యా.... ఇక్కడే ఏదైనా పని ఇవ్వండి....నాకు జీతం వద్దు. ఇంత తిండి ఉంటే చాలు. మీరు లేనప్పుడు అమ్మగార్ని చూచుకుంటాను."

"ఆలోచిస్తాను....ఇది తీసుకో" అని పాలగ్లాసు పెట్టి వెళ్ళిపోయాడు. ఆమె అన్నమాట శాంతకు చెప్పాడు. శాంత ఎక్కువసేపు ఆలోచించలేదు.

"చూడండి—మనం ఆయాను పెట్టుకోలేము. జీవితంలో దెబ్బతిన్న వ్యక్తి.... ఇంత తిని పడిఉంటుంది. నా భారం మీకు కొంత తగ్గుతుంది. ఇంట్లో మరొక మనిషి ఉంటే నాకు కూడా తోడుగా ఉంటుంది"

అతడు జాలితో ఆమెవెంత కూర్చున్నాడు ఆమె చేతిని తన చేతిలో పట్టుకుని మృదువుగా హెచ్చరించాడు.

"శాంతా... ఆమె చిన్నది....నిండు యౌవనంలో ఉంది."

"మీమీద నాకు విశ్వాసం ఉంది" అంది దృఢంగ.

"అదికాదు ఆమెను గురించి మనకు ఏమీ తెలీదు. తొందరపడి అంగీకరించ కూడదు."

"ఆమె షాక్‌లో ఉంది. మెల్లగా అడిగి కనుక్కుంటాను. అప్పుడు ఆమె ఉండటం వల్ల నియమోల్లంఘన అవుతుందనుకుంటే పంపించివేద్దాం. ఇంతవరకు ఎవ్వరు కూడ ఉంటామన లేదు. వారి దారి వారు చూసుకున్నారు. పోనీ ఆమెకు అవకాశం ఇస్తే!"

అతడు ఆమె వెక్కిళ్ళను మృదువుగ నిమిరాడు.

"ఆమెచేత పనులు చేయించుకోవటం అలవాటవుతుంది. ఆ సుఖం మరిగిన తరువాత ఆమెను ఒదులుకోగలమా? ఒద్దు...."

శాంత భర్త కళ్ళలోకి చూచింది. తన ఇష్టానికి స్వస్థిచెప్పి రెండేళ్ళయింది. ఈనాడు కూడా లొంగిపోయింది. "మీ ఇష్టం" అంది నిండుమనసుతో.

"అట్లా ఉండాలి" అని అతడు వెళ్ళి పోయాడు.

అతణ్ణి అలా చూస్తూనే ఉంది. ఒక్కో రోజు గడిచేకొలది భర్తలో ఒక్కో సుగుణం బహిర్గతమౌతుంటే ఆమె హృదయం ఆరాధనతో పరవశించి పోయేది. తనకే కాకుండ ఉంటే తను అతడి కోసం ఎంతెంత సేవజేసేదో!

అంతరాత్మ నవ్వింది!

ఆమె సిగ్గుపడింది! నిజమే పెద్ద ఉద్యోగస్తుణ్ణి, నెల తిరిగేసరికి కనీసం రెండువేలు జీతం తెచ్చేవ్యక్తిని పెళ్ళాడాలని ఆమె ఎంతగానో ఆశించింది. కాని అది సాధ్యం కాలేదు. తన తల్లి దండ్రులకు ఇతడు చాలా నచ్చాడు. డబ్బు కాదు ప్రధానం—గుణం ప్రధానమన్నారు. అయినా ఒక బ్రాంచి పోస్టాఫీసు పోస్ట్ మాస్టర్ అంతకన్నా గొప్పసంబంధం కూతురికి తేలేదు. శాంత అత్యంత రూపసి కాదు, చూడటానికి బాగానే ఉంటుంది.

పెళ్ళైన క్రొత్తల్లో ఆమె రిజర్వ్‌గా ఉండేది, ఆమె స్వభావమే అంతకాబో లును అని అతడు మెల్లమెల్లగా ఆమె ప్రవర్తనను మార్చగల్గాడు.

ఇప్పుడు ఆమె అతణ్ణి ఎంత గా ప్రేమించి ఆరాధిస్తోందంటే – తను ఈ లోకంలోంచి తొలగిపోతే అతడు మళ్ళీ వివాహంచేసుకుని ఆమెతోనైనా అతడు సుంఖిచాలని కాంక్షిస్తోంది.

కాని అతడి పరిచర్యలో ఆమె నూతన శక్తిని పుజుకుంటుంది. అతణ్ణి ఆమె విడిచిపోలేదు. అతణ్ణి ఒంటరివాడినిచేసి వెళ్ళలేదు. నడుంపైనసుంచి తన ఆరోగ్యానికే ప్రతిరూపం అన్నట్లుగాఉంది. తనకు చావు ఇప్పట్లో రాదు. తీసుకుని పోవాలనుకున్నా దానికి తగిన వాతావరణం ఆ గృహంలో లేదు.

అతడు వెళ్ళిపోయాడు. శాంత ఎప్పటి మాదిరిగానే ట్రాన్‌సిస్టర్ పెట్టుకుంది.

కిటికీలోంచి జామచెట్టు కనిపిస్తోంది. పచ్చి జామకాయలు తన కెంతో ఇష్టం. తన భర్తకు చెప్పాలి....

"అమ్మా" సునీత లోపలికొచ్చింది.

ఒకటే చీర అరీఅరకుండా ఉంది. ఆ చీర ఒంటిని అంటి పెట్టుకుని ఆమెలోని యౌవనాన్ని మరీ బహిర్గతం చేస్తోంది.

"నీకు చీరలు లేవు కదూ?"

"అవునమ్మా" అంటూ దగ్గరకు వచ్చి క్రింద కూర్చుంది.

"ఆ పెట్టె తెరువు. పసుపుగళ్ళచీర ఉంది. తీసుకొని కట్టుకో" అంది శాంత.

"అయ్యగారు ఇంట్లో లేరని కట్టుకున్నాను ఆరిపోతుందిలెండి."

"ఫరవాలేదు. వెళ్ళి కట్టుకో"

సునీతకు తప్పలేదు. చీరతీసి కట్టుకుంది. తడిచీర ఆరవేసి వచ్చింది.

"అమ్మా - మీకు ఏమైంది?"

"ఏదో అయింది. దాన్ని జ్ఞాపకంచేసుకోవటానికి ఇష్టంలేదు."

"మిమ్మల్ని చూస్తే జాలేస్తోంది."

"జాను, ఒకరి జాలి దయలమీద ఆధార పడి ఉండాలి. ప్రథమంలో.... అన్నట్టు సునీతా నువ్వు వెళ్ళిపో. నాతో మాట్లాడ వద్దు.... ఇలా ఒంటరిగా ఉండటం అల వాటు, వెళ్ళిపో."

"అయ్యగారు ఏమన్నారమ్మా, నేను మీకు సేవచేస్తూ...."

"సునీతా....ఒద్దన్నారు. మేము పేద వాళ్ళం. మరో వ్యక్తిని పోషించే శక్తి లేదు ఒద్దన్నారు....వెళ్ళిపో."

సునీత ముఖంలో దైన్యం చూచి శాంత కళ్ళు త్రిప్పేసింది.

"మీతో మాట్లాడటానికి కూడ తగనా అమ్మా?"

"అదికాదు. ఒక జీవితవిధానానికి అలవాటు పడ్డాను...." అంతకన్నా ఎక్కువ మాట్లాడితే తాను నిజం చెప్పేస్తుందన్న వంకతో మౌనం దాల్చింది.

సునీత ఆలోచిస్తోంది. ఈమె మనసు కరిగించాలి. తన కథ వినాలి. ఏ ఆడది తన కథ విని ఊరకుండగలదు.

"అమ్మా! మీతో సమానంగా నాకు అన్ని సుఖాలు అక్కర్లేదు. ఓ గోనె ముక్కమీద పడుకుంటాను. ఈ శరీరం నిలబడిఉండి శ్రమించటానికి కావలసిన తిండి ఉంటే చాలు. మీ పాతచీర చాలు. మీకు.... మరేవిధమైన అనుమానం ఉంటే...." ఆమె తలవంచి కంఠం తగ్గించింది.

"నేను అయ్యగారి ఎదుటికి రాను."

ఆ మాటలకు శాంతకు కోపంవచ్చింది. దురుసుగ జవాబు ఇవ్వాల్సిన కాంక్షను అణచుకుంది. శాంతచిత్తయై మెల్లగా అంది....

"సునీతా! నాకే భయం లేదు. వారికి కూడ లేదు." సునీత లోలోన ఆనందించింది - వాదించటానికి చక్కని అంశం - అని




"అమ్మా - ఏదీ చెప్పలేము. మీరీ విధంగా ఉండటంవల్ల అది సాధ్యమన్న భయం మీలోఉందేమోనని ఎదుటబడనని చెబుతున్నాను" తీపిగా అంది.

"లేదు, ఆ భయంలేదు. అయన మత గురువు, బోధకుడు - దైవజ్ఞుడు - దేవుని సేవకుడు...."

"నిజమే....అన్నింటి కన్న ముందర వారుకూడ ఒక మనిషి.... మానవుడు.... ఇందాకనే అన్నారు ... స్వర్గానికి సోపానాలున్నా మెదటిమెట్టు ఈపృధ్విపై ఉందని." శాంత ఆలోచిస్తోంది. ఈమె తనను భయపెడ్తున్నదా! అయన కూడ అతి మామూలుమనిషి అని చెబుతున్నదా! ఒకవేళ అవే యదార్థమైతే....

"సునీతా.... నీవన్నది నేను అంగీకరించను. కాని ఒక వేళ నీ వాదన సరియైనదన్న విశ్వాసం నీకుంచే ఈ క్షణంలో నీవు ఈ గృహం వీడిపోవటం సమంజసం కాదు! ఒక నిండు కుండలో విష బిందువు చిలకరించటం నీకు న్యాయమేనా? నిన్ను చూడు....ఒక స్త్రీగా....నీవు చేయదగినది...."

సునీత హృదయం బాధతో నలిగిపోయింది, గభాల్న ఆమె చేయి పట్టుకుంది....

"అమ్మా.... పాపకూపంనుండి రక్షించుకుని వచ్చాను. నా ఆలోచన ఆ కోణంలోఉండటం సమంజసమే. నన్ను క్షమించండి."

శాంత మెల్లగా తన చేయి విడిపించుకున్నది.

"నీ పేరేమిటి? నీవు ఎవరవు?" ఆమె కళ్ళలోకి తీక్షణంగా చూస్తూ ప్రశ్నించింది.

"చెబుతాను....నా కథ చెబుతాను.... నా పేరు సుమతి. కాని చాలా రోజులుగా నన్ను సునీత అని పిల్చేవారు. భయపడకండి....నేను ఆశ్రమంలో పెరిగాను.... మా అమ్మ నాన్న కుష్టువారు. పిల్లలు పుట్టగానే వారిని తల్లిదండ్రుల దగ్గర నుండి దూరంచేస్తారు....మీకు తెలుసును కదా?" శాంత ఔనన్నట్లు తలూపింది. కుష్ఠు అన్న శబ్దం వినగానే ఆమె భయపడిన మాట వాస్తవమే." తల్లిదండ్రులతో మాట్లాడి దూరదూరంగానే ఉంటూ పెరిగాము. ప్రథమం నుండి నేను చదువు మీద శ్రద్ధ కనపర్చటంతో నన్ను చదివిస్తూ పోయారు. నేను కాకినాడలో బి.ఏ. చదివి పాసయ్యాను."

"అందుకే నీవు చాలా దూరం ఆలోచించి మాట్లాడావు...." అంది శాంత శాంతవవ్వుతూ.

"ఔనమ్మా. ఆ తరువాత టీచర్ ట్రైనింగ్ అయి ఉద్యోగం చెయ్యాలనుకున్నాను. ఇంతలో నన్ను - అంటే ఆశ్రమంలో పెరిగిన మాలాంటివారిని పెళ్ళాడటానికి కొందరు ముందుకొచ్చారు. వాళ్ళు కూడ మాలాటివారే. అతడు విజయవాడలో ఒక నర్సింగ్ హోమ్‌లో క్లర్క్, రైటర్, మెకానిక్ అన్నీను. వెంటనే పెళ్ళిచేసి పంపారు. కానీ అతడు నన్ను హనీమూన్ అంటూ హైద్రాబాద్ తీసుకుని వెళ్ళాడు.... ఆ తరువాత అతణ్ణి చూడలేదు ....

"అంటే........"

శాంత కళ్ళు ఆశ్చర్యంతో చక్రాల్లా అయ్యాయి.

"ఆ.... " అంది బాధగా....

"స్టేషన్‌లో దిగగానే ఆటో తెస్తానని వెళ్ళాడు. మరి రాలేదు. ఎవరో అతను వచ్చి దూరంగాఉన్న నా భర్తను చూపి "నిన్ను రమ్మంటున్నాడు" అని సామాను ఎత్తుకున్నాడు. అతడు 'రా' అన్నట్లు చేయి ఊపాడు. ఆటోలో సామాను పెట్టి అతడు వెళ్ళిపోయాడు. ఆయన వచ్చి పక్కన కూర్చున్నాడు. ఎందువల్లనో అతడు చాల చికాకుగా, ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చున్నాడు. ఒక చిన్న హోటల్ చేరాము. సామాను గదిలో పెట్టి కాఫీ తెస్తాను అని వెళ్ళిపోయాడు.... అంతలో అటుగా ఒక ముసలివాడు చీపురు తీసుకొని వచ్చాడు........ వాడిని చూడగా నేనూ ఆశ్రమంలోని ముసలివాడు జ్ఞాపకం వచ్చాడు తాతా అని పలుకరించాను. అతడు చెప్పిన విషయం

విని విభ్రాంతపోయాను. చేతలు దక్కించుకున్న నన్ను వెనకవైపు నుండి పీధిలోకి త్రోసి ఇరవై రూపాయాలు ఇచ్చాడు.... అతడు నన్ను అమ్మేస్తాడట! అదీ సంగతి." అంది.

శాంత "అమ్మో - ఎంత ఘోరం! ఆ తర్వాత ఏమైంది?"

"ఆ ముసలతని కూతుర్ని చిన్నప్పుడు ఇలాగే ఎవరో చేస్తే అతడు జాలిపడి పీలున్నప్పుడు హెచ్చరిస్తాడట. నేను బైటికి వచ్చి రిక్షా ఎక్కి కొంత దూరం వెళ్ళానో లేదో ఎవరో సైకిల్ మీద నన్ను వెంబడిస్తున్నారా అనిపించింది, ఒక అస్పత్రి కనిపిస్తే అక్కడ దిగిపోయి రోగుల క్యూలో నుంచున్నాను. సాయంత్రం దాకా ఉన్నాను. స్టేషన్ చేరుకుంటే ఇంటికి వెళ్ళొచ్చనుకున్నాను, కాని ఎవరో ఇద్దరు ఆడవారు నన్ను వెంబడించారు. నేను సాయంత్రం రిక్షా ఎక్కి స్టేషన్‌కు పోనిమ్మన్నాను. కాని ఇంతలో ఎవరో నా ప్రక్కన ఎక్కబోయారు. చూద్దును కదా! నా భర్త. కెవ్వున అరచి పడిపోయాను. ఆ తరువాత చూస్తే ఒక కారులో సీట్‌మీద ఉన్నాను. తలుపు తీసి పారిపోయాను. ఇక్కడికొచ్చాను. నాకు సంగీతం విన్పించింది. అంటే అది ఒక విధమైన నైట్‌క్లబ్ అనుకుంటా. వాళ్ళు లోపలికి ఎందుకెళ్ళారో మీరు ఊహించగలరు. ఇప్పుడు చెప్పండి. నేను చివరికి కాకినాడ కూడ వెళ్ళలేను. నా భర్త అనబడే వ్యక్తి వస్తాడు. భర్త ఎలాంటివాడైనా వెంట వెళ్ళమని తరిమేస్తారు. ఈసారి నేను పారిపోలేనటువంటి చోటు చూచి జాగ్రత్తపడ్తారు."

"నిన్ను కట్టిపడెయ్యలేదా?"

"లేదు. ఏదో మత్తుమందు ఇచ్చి ఉంటారు. కష్టేస్తే అనుమానపడ్తారు. సీటుమీద పడుకుని ఉంటే ఏదో సొంత మనిషి అనుకుంటారు. ఇట్లా తప్పించుకుని బైటపడ్తానని అనుకోలేదమ్మా...." సునీత కంఠం జీరబోయింది. అశ్రుధారల్ని తుడుచుకుంటూ కూర్చుంది.

శాంత హృదయం జాలితో నిండిపోయింది.... పాపం అభాగ్యురాలు.... కాని తను తన భర్తను ఒప్పించలేదు. ఆయనకు ఇష్టంలేదా....

"సునీతా.... నువ్వు చాలా క్లిష్టమైన పరిస్థితిలో ఉన్నావు. అయ్యగారు నిన్ను భద్రంగా ఒక శరణాలయంలో చేర్పిస్తారు. భయంలేదు."

"అమ్మా-మళ్ళీ అదేమాట. ఈ శరణాలయాల్లో ఉండేదంతా అవినీతి-పిల్లల కడుపులుకొట్టి బ్రతుకుతారు అధికారులు. యౌవనంలో ఉన్న ఆడపిల్లల బ్రతుకుల్ని నాశనం చేస్తారు. నాలాటి వారిని సానుభూతితో చూడరు. నేను పెరిగింది అటువంటి చోట్లలోనే. నాకు అన్నీ తెలుసును. అయ్యగార్కి వాటి లోపలి రంగు తెలీదు."

శాంత నవ్వింది "నీకు-ఇవన్నీ-భయంకరంగా ఉన్నాయి-అన్న నమ్మకం గట్టిగా నాటుకుపోయింది. నీలో తప్పు లేదు. కాని నన్ను అలాంటి చోటికి పంపరు. కొన్ని మంచివికూడ ఉన్నాయి. అక్కడికే పంపే ఏర్పాటు చేస్తారు."

సునీత పుట్టెడు దిగులుతో తలవంచు కుంది.

"సాటి స్త్రీని-మీకే నాపై జాలిలేదు" అంది విరక్తిగా.

"జాలిపడి నేనేం చెయ్యగలను. నేనే భారంగా ఉన్నాను మాకు వచ్చే డబ్బు మాకు కటాకటీగా సరిపోతుంది."

ఇది సమయం కాదు. మెల్లమెల్లగా బోధపర్చాలనుకుంది సునీత.

"అయ్యగారు ఏంపని చేస్తారమ్మా! ఆదివారాలు గురువుగా ఆరాధన నడిపించటమేనా?"

శాంత నవ్వి "ఇంకా ఎన్నో బాధ్యతలున్నాయి. ఒకటి ఆస్పత్రులకు వెళ్తారు."

"ఎందుకు?"

"సుస్తీగా ఉన్నవారిని చూచి ప్రార్థన చేస్తారు. ధైర్యం చెబుతారు. ఎవరైనా చనిపోతే వారి తాలూకు వ్యక్తులను ఓదార్చి సహాయంచేస్తారు. సీఎయస్‌గా ఉన్నవారి చెంత కూర్చుని వారి బంధువులకుతోడుగాఉండి ప్రార్థన చేస్తారు. వాళ్ళ మనోబలంకోసం ప్రార్థన చేస్తారు. ..........ఇంకాజైలుకు వెళ్తారు."

"జైలుకా? ఏందుకు?" గాభరాగా అడిగింది.

శాంత నవ్వింది. "నేరస్థులకు పాపభీతి కల్గించటానికి మళ్ళీ ఆనేరం చేయకుండా ఉండటానికి కావలసిన మార్పు ఆ మనుషుల్లో తేవటానికి. జీవితం మీద నిరాశతో ఉన్నవారికి ఆశకల్పించటానికి. శిక్షాకాలం పూర్తయ్యాక వారు తిరిగి ఆ నేరం చేయకుండా సహాయపడటానికి-వీలైతే చిన్నచిన్న ఉద్యోగాల్లో ప్రవేశపెట్టటానికి - జైల్లో వారి ప్రవర్తనలో మార్పు తీసుకునిరావటానికి-మన జైళ్ళు ఎంత అధోగతిలో ఉన్నాయో మనం చదువుతూనే ఉన్నాము."

"ఆ నేరస్థులు ఎగతాళి చేసి నవ్వరూ. ఫో-ఫోవయ్యా మహాచెప్పావు-అనరూ?"

"అంటారు. ఎందుకనరు? అసలు మాట్లాడనివ్వరట. ఈలలు, పిల్లికూతలు వేస్తూ నానాఅల్లరిచేసి అసహ్యకరమైన ప్రశ్నలువేసి ఏంజవాబు చెబుతాడో చూద్దాం-అన్నట్లుంటారట. చాలా కష్టం. కాని అది వారికి మామూలే. ఇదొక బాధ్యత - అందుకని విధిగా వెళ్తారు. ప్రార్థనచేస్తారు మంచిమాటలు చెబుతారు. కాలంగడిచేకొలది కొందరు నిజంగానే మారిపోతారు - మంచిప్రవర్తనతో శిక్షాకాలం ముగియకముందే విడుదలపొందిన వారు కూడా ఉన్నారు."

"నిజమేనా అమ్మా!" ఆశ్చర్యంతో అడిగింది




"నిజమే. మరణశిక్షలు ఉన్నవారిని కూడా కలుసుకుంటారు"

"ఎందుకు?" సునీత ఆత్రంగా అడిగింది.

"ఎందుకమ్మా చేసిన నేరానికి చచ్చి నరకానికి పోయేవాళ్ళు మనసేం మార్చుకుంటారు? మార్చుకున్నా విడుదలై సత్ప్రవర్తనులుగా చలామణి అవలేరు కదమ్మా!"

"పిచ్చిదానా-స్వేచ్ఛ అంటే దానిఅర్థం అలా బైట తిరిగిరావటం కాదు. ఉదాహరణకి నీకు స్వేచ్ఛ ఉందా? నీలోని భయానికి బానిసవయ్యావు. ఆ భయం నిన్ను బలమైన సంకెళ్ళతో బంధించి వేసింది. నీవు జైల్లో ఉన్నదానితో సమానం-కానా...."

సునీత శరీరం భయంతో కంపించింది.

"నేను చూడు. ఈ మంచానికి, ఈ గదికి పరిమితమైంది నా జీవితం. కాని నా మనసు అనంత గగనసీమలో స్వేచ్ఛగా విహరించి వచ్చే విహంగమే. నేను ఈ జబ్బుకు మంచానికి బంధింపబడిలేను. నా తలంపులు పవిత్రంగా ఉంచుకున్నాను. ఆ క్రీస్తుదేవుని నమ్ముకున్న నాకు ఆ స్వేచ్ఛ ఉంది. ఈ జబ్బుకు బానిసనై బంధింపబడి లేను. నాకు స్వేచ్ఛ ఉంది. ప్రతి కలుషాన్నుండి - ప్రతిబంధకంనుండి - ప్రతి నిరాశ నిస్పృహలనుండి నాకు విముక్తి లభించింది. స్వేచ్ఛ అంటే అదే. ఇలాగే ఆ

ఘోరాపరాధం చేసినవాడు కూడ ఈ విధమైన స్వేచ్ఛను పొందాలని మావారి తపన. ఆ బంధీఖానానుండి బైటపడాలని గాని, ఆ ఉరికంబంనుండి రక్షింపబడాలని గాని అతడు కోరడు."

"బాబోయ్.... అది సాధ్యమా? నేను నమ్మను."

శాంత నవ్వింది. "ఔను. విశ్వసించటం కష్టం."

"ఇంకా ఏంచేస్తారమ్మా?"

"ప్రసూతి గృహాలను దర్శిస్తారు."

"బాబోయ్" అంది, ముసిముసిగ నవ్వుతూ.

"అమ్మా-మీకు సంతానం-" అంది మెల్లగ.

"ఒక పాప. పేరు పవిత్ర. మా అమ్మవాళ్ళ దగ్గర ఉంది. వస్తూపోతూ ఉంటుంది. తనకై తాను అన్నీ చేసుకో గల్గినప్పుడు ఇక్కడే ఉంటుంది. మా అమ్మవాళ్ళ ఇల్లు రెండు మైళ్ళ దూరంలో ఉంది. అయ్యగారు ప్రతి రోజు వెళ్ళి చూచివస్తారు."

"ప్రసూతి గృహాల్లో ఏంచేస్తారు?"

"పుట్టిన పిల్లల్ని చూచి ఆశీర్వదించి ప్రార్థన చేసివస్తారు. భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పకోవద్దా?"

"తలిదండ్రులు చెప్పకోరా?"

"చెప్పకుంటారు. వారితో కలిసి చెప్పకుంటారు. పుట్టిన పిల్లల్లో ఏదైనా లోపం ఉన్నా-జబ్బుఉన్నా వారికి ధైర్యంచెప్పి ఆ బిడ్డను భరించటానికి కావలసిన శక్తిని, మనోబలాన్ని ఆ తలిదండ్రులకివ్వమని ప్రార్థనచేస్తారు. పుట్టగానే కొందరు పసి పాపలు చనిపోతారు. వాళ్ళను ఓదార్చి తగురీతి వ్యవహరించి వారి సుఖదుఃఖాలలో పాలుపంచుకోటానికి వెళ్తారు. ఆపరేషన్లు చేసేటప్పుడు బంధువులతోపాటు వెయిటింగ్‌రూంలో కనిపెట్టి కూర్చుంటారు..... ఇకపోతే పెళ్ళిళ్ళు - చావులు- మిగతా శుభకార్యాల బాధ్యతలు ఉండనే ఉన్నాయి."

"అమ్మా-మరి ఇంత సేవ చేస్తున్నారు కదా-డబ్బుకూడ బాగానే ఇస్తారుగా."

"లేదు, పల్లెటూరి పంతులుకు పాలు పెరుగు పంపినట్లు ఈ నగరంలో ఎవ్వరు పంపరు. ఇది మీ స్వంతానికి అని చెప్పి ఇస్తేనే అది మాకు చెందుతుంది. లేకపోతే గుడికి వెళ్తుంది."

"మీరు ఉద్యోగం చేసేవారా?"

"టీచర్‌గా చేసేదాన్ని."

ఇంతలో బైట సైకిల్ శబ్దం విన పడగా శాంత ముఖం ప్రఫుల్లమైంది. చటుక్కున సుశీలవైపు చూచింది. 'ఇక నువ్వు వెళ్ళు' అన్నలా ఉందా చూపు.

ఆమె అతడికోసం ఎదురుచూస్తోంది. సునీత వెళ్ళిపోయింది.అతడు కిటికీలోంచి అగుపించాడు, జామకాయలు కోస్తూ. ఆమె కళ్ళు అర్ద్రిమయ్యాయి. వెనుక తలుపు తాళం తీసుకుని వచ్చాడు.

"శాంతూ.... చూడు.... దోరకాయలు- చిలకొట్టింది కావాలా?"

ఆమె కళ్ళు రెపరెపలాడించి నవ్వింది. "రెండు కాయలున్నా రెక్కల్లేని చిలకొట్టింది తీపిగా ఉంటుందేమో!" అతడు నవ్వి దగ్గరకు వచ్చి కూర్చున్నాడు. జామపండు ఒకటి ఆమెకందించి, మరొకటి తను తీసుకున్నాడు,

"తీపి కాయలు" అంది కరకర నములుతూ.

"మొన్న ఉత్తరాదివారింటి కెళ్ళాను. దీనిలో నిమ్మరసం-కాస్తబెల్లం - మిరియాలపొడి- ఉప్పు వేసి ముక్కల చట్నీ అని- పెట్టారు."

"అదేం రుచి!" ముఖం చిట్లించింది.

హోటల్‌నించి తెచ్చిన కేరేజి విప్పి ఆమెకుపెట్టి కంచం ముందుంచాడు. తను కూడా అక్కడే కూర్చొని భోంచేశాడు.

"ఇవ్వాళ ఎక్కడికి కెళ్ళారు?"

అతడు తిరిగిన స్థలాలలో ఉన్న- దుఃఖం-ఇబ్బంది-అస్వస్థత-హింస-పగ-దుష్టత్వం-మినహా ఆనందాన్ని చేకూర్చే కొద్ది విషయాలు ఆమెకు చెప్పాడు.

"పవిత్రకు జబ్బు చేసింది. ఈ రెండురోజులు రావొద్దన్నాను."

కాసేపు ఇద్దరూ మాట్లాడుకున్నారు. ఆ తరువాత ఇల్లు నిశ్శబ్దమైంది.

మూడు గంటలకు సునీత మెల్లగా ఇవతలికి వచ్చింది. ఈజీ చైర్‌లో పడుకుని కాళ్ళు మంచంమీద పెట్టుకుని పొదరీ నిదురపోతున్నాడు.

ఆ గది ప్రశాంతంగా ఉంది.

ఆమె వారిని కాసేపు గమనించి చూచింది. అతడు కదలగా గబుక్కున వెళ్ళిపోయింది.

అప్పుడు గట్టిగా అనుకుంది సునీత. ఎటువంటి పరిస్థితుల్లోను ఈ గృహాన్ని వీడకూడదు.

ఆమె పడకలో ఉండే నిస్సహాయ.

అతడు పురుషుడు.

ఈ రెండు కారణాలు ఆమెను ఆ గృహానికి బంధించివేశాయి. తను ఈ భద్రతను వీడిపోలేదు. అంతే.

రెండు రోజులు గడిచిపోయాయి. భర్త తనను, సునీతను గూర్చి అడుగుతాడేమో అని ఎదురుచూసింది, కాని అతడు అడగలేదు. మూడవరోజు మధ్యాహ్నం తానే చెప్పింది.

అతడు ఈజీచైర్‌లో పడుకుని ఆలోచించాడు.

"ఇటువంటి పరిస్థితుల్లో మనం అసలు ఉంచుకోకూడదు. ఆమెకు భర్త ఉన్నాడు, అతడికి తెలిసిందంటే ముందర మనకు ముప్పు. ఆమెను తననుండి బలాత్కారంగా తీసుకొని వెళ్ళాడని- కారణం నీకు సేవచేయటాకని చెబుతాడు, పోలీసులకు. లోకం చాలా చెడ్డది శాంతా. నేను మెల్లగా బోధపరుస్తాను. నువ్వు కూడ వెళ్ళమని చెప్పు. నీకు ఒక తోడు అవసరం. పాపను తీసుకుని మీ అమ్మగారు ప్రతిరోజు పదకొండు గంటలకు

వస్తారు. నేను అప్పుడు వెళ్ళి రాత్రికి వస్తాను."

శాంత ముఖం చిట్లించింది. "ఐతే -మధ్యాహ్నాలు మీరు నా దగ్గర ఉండరా!" గోముగా అంది.

"ఊహుం....పాప ఉంటుందిగా"

శాంత మాట్లాడలేదు. కనుకొలుకుల్లో నీరు నిల్చింది.చటుక్కున అంది."ఇలాగే గడవనీయండి. నాకు ఆ విధమైన మార్పు ఇష్టంలేదు."

"మొన్న నీవు చెప్పగా ఈ నిర్ణయం తీసుకున్నా ననుకోకు. మీ అమ్మగారు నెలరోజులుగా తయారుగా ఉన్నారు. కాని మీ తమ్ముడికి వైరస్‌ఫీవర్ వస్తే ఆలస్య మైంది. ఇప్పుడు కులాసాగానే ఉన్నా డట.

"తమ్ముడికి జ్వరమా!"

"ఔను. నీకు చెప్పనేలేదు."

"నాకు చెప్పకుండా ఎన్ని దాచారో!" అంది తెచ్చికోలు కోపం ప్రదర్శిస్తూ.

"నా హృదయమే తెరిచినపుస్తకంలా నీ ఎదుటఉంటే నేనేం దాచగలను!" అన్నాడు ముడివడిన ఆమె నొసలు మీద సుతారంగా రాస్తూ.

ఆ చేతిని ఆమె అలాగే పట్టుకుని చెక్కిలికి ఆనించుకుంది. ఆమె ముఖం లోని ఆనంద వీచికల్ని - పెదిమలమీది దరహాసాన్ని చూస్తూ ఆమెకు ఏదికూడా చెప్పకూడదనే నిర్ణయించుకున్నాడు.

'నా హృదయమే తెరిచిన పుస్తకంలా నీ ఎదుట ఉంటే నేనేం దాచగలను!' ఇది వంచన కాదా? అంతరాత్మ హెచ్చ రించింది. కాని అతడికి తెలుసును. ఈ విషయంలో-ఆమెకు కొన్ని విషయాలు తెలియకపోవటమే మంచిది.

రెండురోజులు గడిచిపోయాయి.

సునీత వెళ్ళే ప్రయత్నం చేయలేదు. ఆ రోజున వచ్చి "అమ్మగారూ హోటల్ భోజనం ఎందుకమ్మా నేనువండిపెడ్తాను" అంది ఎంతో వినయంగ. శాంత హృద యం ఒక్క క్షణం పొంగిపోయింది. కాని వెంటనే భర్తమాటలు గుర్తుకు వచ్చాయి. ఆమెతో సన్నిహితంగా ఉండ కూడదు. గంభీరంగా అంది "ఒద్దు. మాకు అలవాటే. నీవు అతిథిగా ఉండి వెళ్ళిపోయేదానివి. అన్నట్లు ఎప్పుడు వెళ్తావు? ఎక్కడికి వెళ్ళాలనుకుంటు న్నావు?"

సునీత హాయిగా నవ్వింది "అతిథి అంటున్నారు. ఎప్పుడు వెళ్తావు? అని అడుగుతున్నారు. అలా అడగవచ్చునా అమ్మా!"

"ఈ కరువు కాలంలో అడగవచ్చు. అందునా మాబోటివారు అడగటంలో తప్పులేదు."

"అమ్మా ఏ ప్రమాణంచేయమన్నా చేస్తాను నేను ఏ విధంగా మీకు...."

"సునీతా అదంతా అనవసరం! మా జీవిత విధానంలో ఆశ్రితులకు మరో ఆశ్రయం లభించేవరకు ఉంచుకోవటం

ధర్మంగా భావించాము. నిన్ను నడివీధిలో ఒదలము. నీకు మరేం భయంలేదు.మరో విషయం చెప్పానా? ఈ ఇంట్లో నీలాంటి వ్యక్తిని ఉంచుకోకూడదు. మాకు అనుమతి లేదు."

"అనుమతి ఎవరివ్వాలమ్మా? అయ్యగారు ఈ గృహయజమానికారా" సునీత ఆందోళనతో ప్రశ్నించింది.

"వారు గృహ యజమానులే-" అంది నవ్వుతూ. సునీతకు అర్థంకాలేదు.

"ఇంటికెళ్ళావా? అని ప్రశ్నిస్తే- "ఇల్లు"కు వెళ్ళావా అని కాదుగదా అర్థం. అగృహంలో ఉండే పరివారం- అ గృహం తనకు అందించే వాతావరణం లోకి అని కదా అర్థం. అలాగే ఈ ఇంటికి వారు పెద్దలు. కాని ఈ గృహం- నాల్గు గోడలు కప్పు ఉండే ఈ ఉట్టిఇల్లు మాది కాదు. దీనిపై మాకు హక్కులేదు. ఫ్రీ క్వార్టర్. దీనిలో ఎవరు ఉండవచ్చునో వాళ్ళు నిర్ణయిస్తారు. ఆ గెస్ట్ రూంలో నీలాంటి వారు కొన్నాళ్ళుండి వెళ్తారు అంతే!"

సునీత ఆశ్చర్యంతో చూస్తోంది.

శాంత ట్రాన్సిస్టర్ ఆన్‌చేసి పాప గౌనుమీద పూలు కుట్టటం ప్రారంభించింది. ఇక ఆమె మాట్లాడదు! ట్రాన్సిస్టర్ ఏదో వాగుతుంటే ఆమెకు సందడిగా ఉన్నట్లుంటుందట.

సునీతకు మాట్లాడాలని ఉంది. కోపంగాను ఉంది. ఈమెకు సమీపంగా రావాలని- స్నేహాన్ని పెంచుకోవాలని ఉంది. కాని ఈమె దూరంగానే ఉంటుంది లాభంలేదా. ఈ భద్రతనా తను కోల్పోలేదు అతడికి సన్నిహితురాలైతే!

అతడు వచ్చేవరకు ఆమె గుమ్మంలో కూర్చొని ఉంది. అతడు వచ్చి తాళం చెవి త్రిప్పటం శబ్దంవిని మెల్లగా తనగది లోకి వెళ్ళిపోయింది. పాపవచ్చింది. గోలగోలగా నవ్వులతో సందడిగా ఉంది. పాప ఏదో మాట్లాడుతోంది. శాంత ఏదో అడుగుతోంది - మధ్యమధ్యన పాప ఏదో అడుగుతోంది.... ఆ దృశ్యం చూడాలని ఉవ్విళ్ళూరిందామె. కాని తనకు అది నిషిద్ధం ఆ స్థలం రెండు గదులు అవతల అయినా అది ఆమెకు చేరలేని దూరాతి దూరమైన స్థలంలా ఉంది. తొంగి చూడటానికికూడ వీల్లేదు. ఉగ్గబట్టి తలుపుకు ఆనుకుంది.

ఆమె చెవుల్లో పాపమాటలు ముద్దుగా వినవస్తున్నాయి.

పాపం పాపకు తల్లి ముచ్చట తీరదు....

మెరుపులా ఒక ఆలోచన తట్టింది.

తను పాపకు చేరువ అయితే.

పాపకోసమైనా తనను పొమ్మనరు.

బ్రహ్మాండమైన ఆలోచన.

ఆమె చటుక్కున తలుపు తీసుకుని ఇవతలికి వచ్చింది. ఆ క్షణంలో తనపరిధి మరచిపోయింది సునీత,

"అమ్మా" అంటూ వెళ్ళింది

శాంత పాపకు స్పూన్‌తో తినిపిస్తోంది

"పాపమాటలు విన్నాను. చూద్దామని"

"రా....రా.... ఇదో మా మాటకారి బంగారు తల్లి"

పాప బుగ్గలనిండా అన్నం ఉంది. చేతిలో అరటిపండు ఉంది, బొద్దుగా కాక పీలగా కాక మధ్యస్తంగా ఉంది. చెదరిన కాటుక కళ్ళెత్తి 'ఎవరీమె?' అన్నట్లు చూచింది.

"చిన్నపిల్లల ముద్దుముచ్చట్లు చూచి చాలరోజులైందమ్మా" అంది ఆర్ద్రంగా.

శాంత అర్ధవంతంగా తలాడించింది

ఆయన పాపకు కావలసినవి మళ్ళీ వడ్డించి టిఫిన్ కేరేజి మూసేశాడు.

"నువ్వు భోంచేశావా?" శాంత అడిగింది.

"లేదమ్మా."

"వెళ్ళి తిను, ఒంటిగంట కావస్తోంది"

"ఈ పూట వంట చేయలేదు" మెల్లగా అంది.

"ఏం....బియ్యం—పప్పులు లేవా!"

"ఉన్నాయి.... వండుకోవాలని పించలేదు"

శాంత భర్తవేపు చూచింది. ఆయన పాపను తీసుకుని మూతి కడిగించటానికి లేచాడు. సునీత గభాల్న ఇవతలికి వచ్చి అంది "నేను కడుగుతానయ్యగారూ."

పాప తండ్రికి మరీ దగ్గరగా జరిగి చేయిపట్టుకుంది. "రామ్మా" అంది సునీత.

పాప వెళ్ళలేదు. "ఒద్దులేమ్మా, కొత్త" అన్నాడు. పాపకు మూతి కడిగాక వస్తూ వస్తూ ఒక చిన్న గిన్నె తెచ్చాడు. కాస్త అన్నం—పులుసు పచ్చడి వేసి ఆమెకిస్తూ "వెళ్ళి తినమ్మా" అన్నాడు.

"ఒద్దు బాబు—మీరు భోంచెయ్యండి" అంటూ వెనుదిరిగింది.

కాని శాంత అంది "నువ్వు ఆకలితో వస్తువుంటే మేంతినగలమా? తీసుకెళ్ళు సునీతా."

"నేను వండుకుంటాను, మీరు తినండి."

సునీత వెళ్ళిపోయింది.

ఆయన దీర్ఘంగా ఊపిరించాడు.

శాంత "పాపం" అంది జాలితో, మెల్లగా.

"నాకు జాలేస్తోందండీ" అంది భర్త వేపు చూచి.

"అవును ఆ జాలి, దయను ఊతగా పట్టుకున్నదంటే మనకు చాలా కష్టం. ఒదిలించుకోలేము జాగ్రత్త శాంతా. ఆ జాలిని బయటబడనివ్వకు" వాళ్ళు భోంచేసి కాసేపు పడుకుని లేచారు. పాప ఇంకా తల్లి ప్రక్కలో నిదరపోతోంది.

అప్పుడుశాంత సునీతను పిల్చింది.

ఆమె రాగానే ఆయన అన్నాడు "చూడమ్మా, నీవు వచ్చి వారంరోజులైంది. ఇంకా నీ ప్రోగ్రాం చెప్పలేదు. నాకు తెలిసిన ఒక శరణాలయం ఉంది. మాట్లాడి వచ్చాను."

"ఒద్దు....ఒద్దు....బాబు ఆ శరణా

కొత్త రోడ్డును కూడా నిరభ్యంతరంగా
టెలిఫోన్స్ వాళ్ళు తవ్వి పారేశారంటే.....




లయాల్లో నే నుండలేను" ఆమె భయంతో అరిచినట్లే అంది.

"మళ్ళీ మొదటికే వస్తున్నాము."

సునీత అంది "మీకు ఒక పనిమనిషి అవసరం. అమ్మగార్కి తోడు అవసరం. ఎల్లకాలం ఇలాగే గడుస్తుందా బాబూ! రేపు పాప ఇక్కడే ఉంటే ఒక ఆడదిక్కు అవసరం కాదా. నన్ను కనికరించండి."

"మా ఇష్టప్రకారం నిన్ను ఉంచేసు కోటానికి మాకు అనుమతి లేదు. మాపై మతాధికారుల, చర్చికి సంబంధించిన పెద్దల అనుమతి కావాలి."

"ఇంకేం బాబు—మీ పరిస్థితుల్లో వాళ్ళు తప్పక అంగీకరిస్తారు" ఆశగా చూచింది.

ఆయన నవ్వాడు "ఏమో! నీవన్నట్లు వాళ్ళు అంగీకరించినా—నేను ఒప్పుకోను. ఎందుకంటావా! పరోవ్యక్తిని భరించే ఆర్థికస్థోమత నాకు లేదు. నీవు ఎంతగా పొదుపుచేసి నేలపైపడుకుని గంజినీళ్ళు తాగినా నేను భరించలేను."

"అయ్యో—గురువులు మీరు. మీది అంత కఠిన హృదయమా...."

"ఔనమ్మా—నీ కథ విన్నాక మా అధికార్లు ఒప్పుకోరని గట్టిగా చెప్పగలను."

"అయితే—వారికి ఏమీ చెప్పకండి. ఏదో దూరపు బంధువుగా ఉండిపోతాను."

ఆయన ఆశ్చర్యంతో చూచాడు. ఆ తరువాత దృఢంగా అన్నాడు. "అలా జరగటానికి వీల్లేదు. అబద్ధం చెప్పను"

ఆమె దిగులుపడిపోయింది "పోనీ.... మీరు ఒప్పించలేరా బాబు."

"ఒప్పించగలను—కానీ...."

"అయితే— ఇంకేమిటి బాబూ—" గభాల్న అంది.

"కాని–నీ విషయం వేరు. నీవుభర్తను ఒదిలి పారిపోయివచ్చిన దానవు. నీవు చెప్పినదాన్నిబట్టి నీ భర్త ఎప్పుడైనా రావచ్చును – పోలీసులతో సహా. నేను మతగురువును, ఆ భగవంతుడికి గాని, ఆలయానికి గాని, ఈ పాదరీ ఉద్యోగానికి గాని, నాకుగాని ఎటువంటి కళంకం రాకుండా కాపాడటం నా విధి. కనుక నీవు తక్షణం వెళ్ళి పోవాలి. లేదా నేను చూపించే ఆశ్రమానికి వెళ్ళాలి."

"అంత నిర్దయగా మాట్లాడకండి బాబూ. నా భర్త అనే వ్యక్తివచ్చి తిరిగి నన్ను పాపపంకిలంలోకి త్రోసివేస్తే ఆ పాపం మీకు చుట్టుకోదూ?"

"చుట్టుకోదు. ఎందుకంటే నీవు నీభర్త అధీనంలో ఉన్నావు. అతడి నేరం ఋజువుఅయ్యేవరకు అతడు నీ భర్తే. ఈ విషయంలో అతడి నుండి విడుదల పొందాలంటే జరిగినదంతా పోలీసులకు చెప్పి రిపోర్ట్ ఇవ్వటం–అ త రు వా త ఆశ్రయంలో ఉండటం."

"అమ్మో–పోలీసులకు రిపోర్ట్ ఇవ్వటమే. వాళ్ళ సంగతి మీకు తెలియదా? నన్ను వాళ్ళు నిశ్చింతగా ఉండనిస్తారా? నా భర్త లంచంఇచ్చి నన్ను తీసుకెళ్ళి పోతే!" భయంతో అంది.

"అలా జ రు గ దు. అనవసరంగా భయపడుతున్నావు."

ఇక మాట్లాడటానికి ఏమీలేదన్నట్లుగా అయన వెళ్ళిపోయాడు

"అమ్మా–నా తరపున మాట్లాడలేరా?"

శాంత లేదన్నట్లుం తలూచింది.

పాప నిదురలేచింది. సునీత లేచి పాపను పిల్చి దగ్గరకు తీసుకోబోయింది. కాని పాప దూరగా తొలగి బాత్‌రూంవేపు వెళ్ళింది.

"పాపకు క్రొత్త" అంది శాంత.

పాప కాసేపటికి చెద్దేని చక్కగ పైకిలాక్కుని తల్లి దగ్గరకు వచ్చింది. తల దువ్వించుకుని బల్లమీద గ్లాసులో ఉన్న పాలు త్రాగి, పండు తిన్నది.

"చల్లనిపాలు, వేడిగాత్రాగితే బాగుంటుందమ్మా."

శాంత "అలవాటే సునీతా" అంది మెల్లగా.

పాప ఒక ప్లాస్టిక్‌సంచి తీసుకుని నేలమీద బోర్లించింది. ఎన్ని ఆటవస్తువులో–డబ్బాలు–మూతలు – బాశీరీక్కు–కాలో, చెయ్యో ఊడిన బొమ్మలు, విడి విడి చేతులు, కాళ్ళు, ముక్కులు కొరికేసిన ఏనుగు, బాతు, కోతి ఎన్నో ఉన్నాయి, ఆ వస్తు సరంజామా కేసి నిర్లిప్తతతో చూ స్తుం డి పో యిం ది సునీత.

ఆ రాత్రి అయన దృఢనిశ్చయానికి వచ్చాడు. ఏది జరిగినప్పటికి శాంతకు ఏమీ తెలియకూడదు. ఆమె మానసికంగా బాధపడకూడదు, తమ జీవితాలు సంతోషంగా గడిచిపోవాలి. అంటే....ఆమెతో రహస్యంగ మాట్లాడాలి. ఆమెను ఒప్పించాలి.

ఆ ఆదివారం గుడికి వచ్చినవారిలో చాలామంది శాంతను చూచి పలుకరించి వెళ్ళారు. కొందరు పండ్లు తినుబండారాలు తెచ్చారు.

ప్రక్క గది తెరచిఉండటంతో చాలామంది సునీతను చూచారు. వాళ్ళు ఆశ్చర్యపడలేదు. ఎంతోమంది ఆడ మగవారు రెండు మూడురోజులు ఈ ఇంట్లో తలదాచుకుని వెళ్ళిపోతారు. కొందరు ఆమెను పలకరించాలని చూచారు గాని సునీత మోకాళ్ళమీద తలఆన్చి తలఎత్తి చూడలేదు, ఇంకా సందడిగానే ఉంది. ఒకరు ఇద్దరు వచ్చిపోతూనే ఉన్నారు. పాపకూడ ఉంది. ఉరుకులు పరుగులు దీస్తూ ఇల్లంతా తిరుగుతోంది. ఆదివారమంటే పవిత్రకు చాలా ఇష్టం. గుడిలో ముందులైన్లోకూర్చుని తండ్రినిచూస్తుండవచ్చు. ఇంట్లో తల్లిదగ్గర మిఠాయిలుంటాయి. సాయంత్రం వరకు అక్కడే ఉండవచ్చు.

ఆ గృహవాతావరణం ఎంతో అహ్లాదకరంగా ఉంది. వచ్చిపోయే మనుషులు గాని, వారి మాటలుగాని ఆమెలో భయాన్ని కల్గించలేదు. ఈ ఆవరణం తనకు తెలిసినవాటికి భిన్నంగా ఉంది!

"సునీతా" అన్న గంభీరస్వరం వినగానే ఆమె తలెత్తి చూచింది. ఆ స్వరం ఆమెలో ఒకింత సంచలనాన్ని కల్గించకపోలేదు.

ఏ జీవితాన్నుండి తప్పించుకుని పారిపోయివచ్చిందో-అటువంటి జీవితంలోకి తను ఇష్టానుసారంగ ప్రవేశించటానికి ఇష్టపడ్తోంది!

ఎంత విచిత్రం!

ఆమె ఎదుట పాదిరీ మంచుని ఉన్నాడు.

అతడు ఇంకా తెల్లగౌను వేసుకునే ఉన్నాడు.

"నీతో ఏకాంతంగా మాట్లాడాలి."

"అయ్యగారూ-వింటున్నాను" అంది ఆత్రంగా.

"ఇలా నీతో మాట్లాడిన ఈ విషయం-శాంతకు తెలియకూడదు."

సునీత ముఖం ఒక్క వెలుగు వెలిగింది. ఆవరణం సందడిగానే ఉంది. మనుషులు కనబడుతూనే ఉన్నారు. ఇలాంటి సమయంలో ఎవ్వరికీ అనుమానం రాదని ఎంత తెలివిగా ఆలోచించాడు. మామూలు రోజుల్లో నిశ్శబ్దంగా ఉన్న ఇంట్లో ఏకాంతంగ మాట్లాడలేరు. శాంత పసిగట్టగలదు.ఇలా తెరిచిన తలుపులు-తిరుగుతున్న మనుషుల మధ్య జరిగే సంభాషణ అతి మామూలు సంభాషణ అనుకొంటారు. ఆమె హృదయం పైశాచికానందంతో పొంగిపోయింది. తనుకూడ దిగజారిపోయిందా! అయితే ఏం-సురక్షితంగా ఈ జీవితాన్ని వెళ్ళబుచ్చవచ్చును. విజేతగా ఆమె కళ్ళలో ఒక విధమైన పైశాచికానందం పొడ చూపింది.

నువ్వెంత! చివరికి వచ్చావు! పృధ్వి పైనున్న మొదటి సోపానం చెంతకు.... ఓరి మగవాడా!

ఆమెకు చటుక్కున సోమర్ సెట్ మామ్ కథ గుర్తుకువచ్చింది. ఆ కథలో ఆ ఆడది టుపుక్కున ఊసినట్లు గుర్తు. కానీ తన జీవితం నందనవనంలోకి ప్రవేశింపబోతోంది - కనుక ఈతడు 'అలాంటి'వాడు అవటమే తనకు కావలసింది.

"చెప్పండి" అంది మెల్లగా.

అతడు కంఠం తగ్గించి "శాంతకు ఏమీ తెలియకూడదు. ఈ జీవితాలు ఎప్పటిలానేగా సాగిపోవాలి. ఆమెకు నీపై అణుమాత్రంగానైన అనుమానం కల్గకూడదు"

"అయ్యో-తెలియనివ్వను-అతి జాగ్రత్తగా ఉంటాను" ఆవేశంగా మెల్లగా అంది.

ఆమె కంఠంలో ధ్వనించిన నిజాయితీకి అతడికి ధైర్యం వచ్చింది.

అతడు చెప్పబోయే విషయమేమిటో గ్రహింపుకు అందుతోంది. ఎన్నిమార్లు అంటున్నాడు! శాంతకు తెలియకూడదని అతడి నోటవినాలి-విజయగర్వంతో ఆమె సూటిగా అతడి వెప చూచింది.

ఆయన ముఖంలో ఏదో మార్పు. శాంతంలేదు. ముఖంలోని కండరాలు లాక్కుపోతున్నలా ఉంది. ఆమె అతడి కళ్ళలోకి చూచే ధైర్యంలేక తలవంచుకున్నది.

అతడు కంఠం తగ్గించి— గంభీరంగా అన్నాడు

"విజయవర్ధనీ!"

ఆ పేరు వినటం తడవు ఆమె ముఖం పాలిపోయింది. గుండెల్లో వేయిగుఱ్ఱాల డెక్కల చప్పుడు వినవస్తోంది. ఆ వేగానికి శరీరం తట్టుకోలేదన్నట్లు గోడకు చేరబడిపోయింది. బొంగురిన కంఠంలోంచి వేదనాభరిత మూల్గు బహిర్గతమైంది- "అయ్యో"....అని కంపిస్తోన్న చేతులతో ముఖం కప్పుకుంది.

"నీ గురించి అంతా తెలుసుకున్నాను. నాలాంటివాడికి ఎన్నో అర్థంకులు, శోధనలు. నీది ఒకరకమైన శోధన. ఇంకో అరగంటకు పోలీస్ ఇన్స్పెక్టర్ వచ్చి నిన్ను తీసుకొని వెళ్తాడు."

ఆమె చివ్వున తలెత్తి చూచింది. భయంతో గజగజ ఒణికిపోతూ నూతిలోంచి మాట్లాడినట్లు అంది "పోలీసులు .... నన్ను వారికి పట్టిస్తున్నారా!"

"చూడమ్మా, ఇది నా డ్యూటీ. ఆత్మరక్షణ కోసం నీవు ఈ నేరంచేయవలసి వచ్చిందని చెప్పుకో. శాంత నీ కట్టుకథ నమ్మింది.నీవు ఒక మనిషిని చంపబోయావని తెలుసుకున్నదంటే మానసికంగా చాలా బాధపడ్తుంది. ఒక ఆత్మీయురాలిగా ఈ కొద్దిరోజులు మసలిన నీవు ఆ నేరం చేయబోయావనుకుంటే - ఆమెకు



# అయ్యో! మీ వూరు హైద్రాబాదన్న మాట !!

షాకింగ్‌గా ఉంటుంది. పడకలో ఉంది అదే ఆలోచిస్తుంది. లేచి తలదువ్వుకుని అతి మామూలుగ వెళ్ళిపోతున్నానని చెప్పిరా."

"అయ్యో— చంపబోయానా? అతడు చనిపోలేదా?"

"లేదు. బాగా త్రాగిఉన్నందున పడిపోయాడు. బాగా రక్తంపోయిందట. రక్తంఎక్కించారు. కోలుకుంటున్నాడు."

ఆ కబురు వినగానే ఆమెకు కొండంత బలం వచ్చింది. అయితే తను హంతకురాలు కాదు. "హమ్మయ్య" అంటూ రెండు చేతులెత్తి తలమీదుగ దండం పెట్టింది.

"టైంలేదు. వెళ్ళి శాంతకు చెప్పిరా."

ఆమె కళ్ళు తుడుచుకుని మెల్లగా "నా కథ వినరా అయ్యా?

"నాకు కొంతవరకు తెలుసును. అది చాలు. టైంలేదు. నీవు ఎప్పటికైనా ఒంటరిగా మిగిలావంటే ఈ అడ్రస్ దాచుకుని అక్కడికి వెళ్లు. ఈ శరణాలయంలో నీవు నిశ్చింతగా కాలం వెళ్ళబుచ్చగలవు. శాంత ప్రశ్నలకు జవాబులేం చెప్పకు"

అతడు వెళ్ళిపోయాడు.

ఆమె యాంత్రికంగా లేచి తలదువ్వుకుని శాంతదగ్గరకు వెళ్ళింది. శాంత పెరట్లో జామచెట్టు క్రింద ఈజీచైర్‌లో

పడుకుని ఉంది. ఆమెకు సమీపంగా మరొక స్త్రీ కూర్చునిఉంది.

"రా సునీతా- మా అమ్మగారు" అంది శాంత.

"నమస్కారం అమ్మా- "అని అటు తరువాత శాంతవైపు తిరిగి అంది "అమ్మా ఇన్నాళ్ళు నాకు ఆశ్రయమిచ్చి నందుకు నా హృదయపూర్వక కతజ్ఞతా వందనాలు. మీ ఋణం ఎన్నటికి తీర్చుకో లేను. వెళ్ళొస్తానమ్మా-అయ్యగారూ...." అని ఇవతలికి తిరిగింది. పాప నెత్తుకుని అయన వస్తున్నాడు. చిరునవ్వు నవ్వి "వెళ్ళిపోతున్నావా!" అని అడిగాడు.

అతడికేసి ధైర్యంగా చూచే అర్హత- హృదయనైర్మల్యం అమెలో లేనందు వలన తలవంచుకుని కన్నీరు కారు తుండగా చేతులెత్తి నమస్కరించింది.

"ఇన్నాళ్ళు ఉండి_మీ కెంతో కష్టం కలిగించాను బాబూ. క్షమించండి. మళ్ళీ అడుగుతున్నాను - క్షమించండి" ఆమె గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది.

అప్పుడే ఇన్స్పెక్టర్ వచ్చి చెక్క గేట్ దగ్గర స్కూటర్ ఆపాడు.

ఎదురుచూస్తున్న పాదరీ గబగబ బైటికెళ్ళాడు.

"నమస్కారమండీ.... రండి."

అయన లోపలికొచ్చి కూర్చున్నాడు.

"ఆమెకు చెప్పాను. సిద్ధంగా ఉంది"

"మీకు చాలా థాంక్స్.... పాప.... మీ పవిత్రనుకుంటా" పాప జవాబు చెప్పింది "ఔను. నేను పవిత్రనే" ఆయన నవ్వి పాప తలమీద చేయివేసి ముద్దుగా నిమిరాడు.

"రండి.... నా రిక్వెస్ట్ మర్చిపోకండి" అంటూ అటువైపు నడిచాడు.

"నేను మీకు మాట ఇచ్చాను. జైల్లో ఏ అత్యాచారం జరగనివ్వను. ఒకవేళ శిక్ష కొద్దిమాసాలకు పడితే- విడుదల అయినవెంటనే మీరు కోరిన శరణాల యానికి పంపుతాను" అయన పాదరీ చేయి అందుకుని మాట ఇస్తున్నట్లు కాసేపు పట్టుకొని ఒదిలేశాడు.

ఇరువురు వర్ధని గదిబైట నుంచు న్నారు.

తలుపులు బార్లా తెరిచి ఉన్నాయి ఇన్స్పెక్టర్ తన సహజమైన అనుమా నంతో లోపలికి తొంగిచూచాడు.

"వర్ధనీరామ్మా" అయన పిల్చాడు మరబొమ్మలా వచ్చిందామె. ఇన్స్పెక్టర్‌కు నమస్కరించి తల వంచుకుంది.

"పదమ్మా వెళ్దాం" అయన గంభీరంగ అన్నాడు. కృతజ్ఞతతో కన్నీటి పొరల్లోంచి పాదరీని చూచి నమస్కరించి అతడి వెనుక నడిచింది.

చెక్కగేట్ దాటారు. బార్లుతీరిన చెట్ల మధ్యలోంచి నడుస్తున్నారు. ఒకరు ఇద్దరు ఇంకా తిరుగుతూనే ఉన్నారు.

అతి భారంగ ఆమె అడుగులు పడుతున్నాయి.

ఆమె హృదయం ఒక భీకరమైన సత్యం మాటునా నలిగిపోతోంది. తనకు స్వేచ్ఛ అంటూ లభించినా ఈ ఇంటి తలుపులు తనకోసం ఎవ్వరు తెరవరు. తను దిగజారిపోయింది- దిగజారి ఒక మహిమాన్వితుని దిగజార్చాలనిచూచింది. తను ఇప్పుడు ఎంత బాధపడినాలాభంలేదు

స్కూటరును నడిపించుకుంటూ గేటు సమీపించారు అక్కడ ఒక టాక్సీఉంది

"పోలిస్‌వాన్‌ను తేలేదు. ఎక్కమ్మా" అన్నాడు ఆయన. ఆమె ఒక ముల గాభరాగా పాదరిపైపు తిరిగింది. ఆయన "ఎక్కమ్మా. నిష్కల్మష హృదయంతో శేషజీవితాన్ని వెళ్ళబుచ్చావంటే దేవుడు నీకు మేలు చేకూరుస్తాడు"

ఆమె ఎక్కింది.

వాళ్ళిద్దరు కరచాలనం చేసుకున్నారు.

టాక్సీ-వెనక స్కూటర్ కదిలాయి

లోపలికెళ్తూ ఇన్స్‌పెక్టర్ తనతో చెప్పిన విషయాల్ని గూర్చి ఆలోచిస్తున్నాడు!

"…. ఆమె మీకు చెప్పిన కథలో సగంవరకు నిజమే చెప్పింది. కాని హోటల్ నుండి ఆమె అంత త్వరగా బైటపడలేదు పాపం!

"సాధారణంగా ఇలాంటి స్థలాల్లో రెండు పార్టీలు ఇష్టపూర్వకంగా తమ పనులు చేసుకుంటారు. డబ్బు ఇచ్చి సుఖంపొందాలన్న కాంక్షతో వచ్చే వారుంటారు. డబ్బు పుచ్చుకుని సుఖం అందించాలని రెండో పార్టీ ఉంటుంది కాని ఈమె విషయంలో ఆ వచ్చినవాడు తన అవతలిపార్టీ సుముఖంగా లేదని తెలుసుకోలేకపోయాడు. మామూలుగా త్రాగి వచ్చాడు. లేక ఈమె బాగా త్రాగించి ఉంటుంది. లేకపోతే పోట్లాడిన చిహ్నాలుండేవి. ఆమెకు గాయాలు తగిలి ఉండేవి. అతను ఏమరుపాటున ఉండి ఉండవచ్చు. ఇన్‌వెస్టిగేషన్‌లో దొరికిన ఆధారాలను బట్టి ఆమె గ్లాసు పగులగొట్టి- దాని క్రిందపట్టుకుని బలంగా విసిరిఉండవచ్చు కొనదేలిన గాజుముక్క కంఠం ప్రక్కగా గుచ్చుకున్నాయి- అవి తేల్చాము తెలివిగా తప్పించుకుంది. కాని న్యాయానికి దొరికిపోయింది. ఆ హోటల్ అనబడే ఇల్లు-మేడ-మీ ప్రక్క వీధిలోనే ఉన్నాయి. రెయిడ్ చేశాము. చాలామందిని పట్టుకున్నాము, కేకలేసి పిల్చిందట. రక్తాన్ని చూచి భయపడి ఉంటుంది. వచ్చినవాళ్ళు గాభరాగా ఏం చెయ్యాలో తోచక హడావిడి పడుతున్న సమయంలో- డాక్టర్ కోసం పరిగెత్తే వారివెంట-లేదా ఎలాగో బైటపడింది. ఆ ఖంగారు- భయంతో ఏం చెయ్యాలో ఎవరికి తోచిఉండదు. ముఖ్య విషయం- ఆ వ్యక్తి చాలా ధనవంతుడు పలుకుబడి ఉన్నావాడు. అందుకని అతణ్ణి డాక్టర్‌కు చూపించి రక్షించాలని ఆత్రపడి ఉంటారు."

అతడు శాంత దగ్గరకు వెళ్ళాడు.

"చాలా సడన్‌గా వెళ్ళిపోయిందే సునీత!"

"ఎంతకాలం ఉంటుంది శాంతా! రోజుకొకమారైన అడిగేవాడిని ఎప్పుడు వెళ్తావు! అని."

వెళ్ళకపోతే భయం పట్టుకుందనుకో- ఇక్కడే ఉండిపోతుందేమో- నని, ఏదో మన సేవ మనం చేస్తూ కాలం వెళ్ళబుచ్చే మనకు ఇలాంటి పారిపోయి వచ్చినవారికి ఆశ్రయం యిచ్చి లేనిపోని కష్టాలను సమస్యలను తెచ్చిపెట్టుకోవటం అవివేకం"

"నిజమేలెండి.... అంది రిలీఫ్‌గా ఫీలవుతూ

"తెలుసుగా- పాప ఎక్కడే ఉండిపోతుంది."

"ఔను అమ్మ చెప్పింది పెద్దైకూడ తేచ్చేసుకుందట అమ్మ- పాప చెప్పింది" శాంత హుషారుగా అంది.

"ఔను. అమ్మమ్మ పెత్తె తెచ్చింది అంది ముద్దుగా పాప।

ఇరువురు పాప మాటలకి హాయిగా నవ్వారు.

ఆ గృహాన్ని మునుపటి ప్రశాంత వాతావరణం ఆవరించగా ఆయన తృప్తిగా నిట్టూర్చాడు

" ప్రభూ- నీకు నా కృతజ్ఞతావందనాలు" అని చెప్పుకుని ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నాడు.



# ఈ జీవితం నాది!

## సీరియల్

(గత సంచిక తరువాయి)

"ప్రియాతి ప్రియమైన ప్రియా!

ఈ వుత్తరం చూసి ఆశ్చర్యపోతున్నావా? లేక యీ రాక్షసి, యీ స్వార్థపరురాలు, యీ మిత్రద్రోహి యింకా బ్రతికే వుందని అసహ్యించుకుంటున్నావా! ప్రియా! నా మనసులో నాకెంతో గాఢ నమ్మకం. నువ్వు, నేను ఎలాటి పరిస్థితుల్లోవున్నా నన్ను అసహ్యించుకోవని! అందుకే సందుదొరికితే చాలు నీకు వుత్తరం వ్రాయాలని, నేను బ్రతికే వున్నానని, నీకు తెలియచేయాలని ఆరాటపడుతున్నాను. నేను ఎక్కడున్నానని, ఏం చేస్తున్నానని కదూ నీ ఆశ్చర్యం! ఎక్కడో ఒకచోట, యింకా బ్రతికే వున్నాను వింటున్నావా ప్రియా! ఎక్కడో ఒకచోట బ్రతికే వున్నాను! ఎక్కడుంటేనే, మనిద్దరి మధ్య సప్తసముద్రాలంత దూరం! ఈ దూరం నేను దాటలేను! వీటిని యీదే శక్తి, ధైర్యం నా కెప్పుడో పోయినాయి! నేను బ్రతుకుతున్నాను, జీవచ్ఛవంలాగా! ఇరవై సంవత్సరాల వయసులోనే, అరవై సంవత్సరాల అనుభవం పొందిన వ్యక్తిలా వున్నాను. నా ఆ పాతజీవితం, అమ్మ దగ్గర వుండటం, ఆ ఏమీ తెలియని బాల్యం, అదంతా ఒక కలలా వుంది! ప్రియా! నా తలిదండ్రులని తలుచుకుంటుంటే, నాకు చాలా కోపం వస్తోంది! వాళ్ళు నన్ను యీ మార్గాన ఎందుకు వెళ్ళనిచ్చారు! ఇది నా పతనావస్థ అని తెలిసికూడా, నన్ను ఎందుకు అటంకపరచలేదు. నేను వాళ్ళ మాట వినని మాట నిజమే! ఎదురుతిరిగిన మాట కూడా వాస్తవమే! కానీ అది నా మూర్ఖత్వం; అమాయకత్వం! ఒక మనిషి, మూర్ఖత్వంతో, అమాయకత్వంతో పెడత్రోవపట్టి పోతుంటే, చూస్తూ వదిలేసే వాళ్ళు ఆప్తులేనా! అందులోనూ పిల్లలపట్ల బాధ్యత, ప్రేమగల తలిదండ్రులు!

---

యద్దనపూడి సులోచనారాణి

నా ఖర్మ నేనే అనుభవిస్తాన్లే అని పూరుకోవటం నావాళ్ళు నాపట్ల చేసిన అన్యాయం! నేను వాళ్ళని విమర్శిస్తున్నానని నువ్వు అనుకుంటున్నావు కదూ! అవును! నాకు వాళ్ళనే అనాలనిపిస్తోంది! ఎందుకంటే వాళ్ళు నావాళ్ళు కాబట్టి!

ప్రియా! నాకు నీ దగ్గరగా రావాలని వుంది. చచ్చిపోయే ముందు, కనీసం కొద్దిరోజులకైనా, నా అనే నావాళ్ళ దగ్గరగా బ్రతకాలని వుంది! రోజుకో కొత్త మనిషి! రోజుకో కొత్త వూరు! నా పరిస్థితి వూహించగలవా! నా మనసు నా కిష్టమైన మీదగ్గరే వదిలేసి వచ్చి, నా శరీరం మాత్రం యీ నరకంలో కేగుతున్నట్టుగా వుంది. ఇలాటి బ్రతుకు నువ్వు యింకా ఎందుకు బ్రతుకుతున్నావు? చావటానికి నీకు మార్గమే తోచలేదా అని మీ అందరూ నిలదీయవచ్చు! కానీ ప్రియా! కిటికీలోనుంచి చూస్తే, నీలంగా కనిపించే యీ అనంతమైన ఆకాశం, లేతలేత చివుళ్ళతో సరికొత్త అందాలు వెదజల్లుతున్న ఆ మామిడిచెట్టు, విరగబూసిన ఆ మధులత పూలు 'నువ్వెందుకు చావాలి!' అని నన్ను నిలదీస్తున్నాయి, వాటికి చీడపడితే, ఆ కొమ్మలు కత్తిరించి, మందువేసే మాలి వాటికి వున్నాడు. మనిషి తప్పుచేయటం కూడా ఒకలాటి చీడే! ఆ చీడని అయినవాళ్ళే అంతం చేయించాలి. ప్రియా! నేను తప్పుచేసిన మాట నిజమే. అంతమాత్రాన చచ్చిపోవాల్సిందేనా! నా తప్పు నేను తెలుసుకున్నాను. నేను పశ్చాత్తాప్పడుతున్నాను. తల వంచుకుని మీ దగ్గరకి వచ్చేసి, మీ ముందు మౌనంగా నిలబడాలని వుంది, నేను నావాళ్ళు అనుకున్న మీరు కూడా, నన్ను తిరస్కరిస్తే, యిక అప్పుడు నాకు చావే శరణ్యం అవుతుందేమో! ప్రియా! నాకు నిన్ను చూడాలని వుంది, చిన్నప్పటిలాగానే, మనిద్దరం కబుర్లు చెప్పుకుంటూ, ఒకేచోట గడపగలిగితే ఎంత బాగుంటుంది కదూ! ఈ ఆశతోనే బ్రతుకుతున్నాను. నేను ఎప్పటికైనా నీకు తిరిగి కనిపిస్తాను. నువ్వు నన్ను ఆదరిస్తావో లేక నేనెవరో తెలియనట్టుగా, నన్ను తిరస్కరిస్తావో నాకు తెలియదు. అది నా అదృష్టంమీద ఆధారపడి వుంటుంది. నువ్వు ఎలా వున్నావు? బాగానే వుండివుంటావని నా నమ్మకం. ఎందుకంటే నీకు జీవితం విలువ తెలుసు కాబట్టి! జీవితంలో ప్రతి అడుగు తూచి వేయగలిగిన మనిషే, జీవనసౌధంలో పైమెట్టుకి వెళ్ళగలుగుతాడు. సుఖసంతోషాలు పొందగలుగుతాడు. ఇది నా నమ్మకం! ప్రియా. ఒక్కసారి! జీవితంలో మరొక్కసారి నీ దగ్గరగా కూర్చుని, మనసారా హాయిగా నవ్వాలని వుంది! నేను మధురనే ఒక పిచ్చిదాన్ని కాదు అని గుర్తుచేసుకోవాలి అన్పిస్తోంది! నేను మారాను. చాలా మారాను! ఏమేమి మార్పులు వచ్చాయని మాత్రం అడ

గకు సుమా! చూస్తే నీకే అర్థమవుతాయి. ఎప్పటికి నిన్ను కలుసుకుంటానా అని క్షణాలు లెక్కపెట్టుకుంటూ గడుపుతున్నాను. నువ్వు నన్ను చూసి గుర్తు పట్టగలవా లేదా అనేదే నా భయం. నా ఎదురుగుండా, నా చిన్నప్పటి ఫొటో మనం కాలేజీకి వచ్చిన మొదటి సంవత్సరంది వుంది, ఆ ఫొటో చూస్తే ఏడుపు వస్తోంది. నా పాతజీవితంలో నన్ను నాకు గుర్తుచేసేది యీ ఒక్క జ్ఞాపక చిహ్నమే! వుంటాను. నా యీ వుత్తరం నీకు అందుతుందో, అందదోనని భయం. చెప్పానుగా, అడుగడుగునా ప్రతివాళ్ళమీద అనుమానం! ప్రతి పనిపట్లా భయం. ఇదీ యిప్పటి నా మానసిక పరిస్థితి! నీకు యీ వుత్తరం అందినా, అందకపోయినా యిది నీకు వ్రాసానన్న తృప్తి నాకు చాలా హాయిని యిస్తోంది.

వుంటాను ప్రియా!

నీ

మధుర.

విక్కీ వుత్తరం చదివి, మడిచి ప్రక్కన పెట్టాడు.

ప్రియంవద వచ్చి భర్త ప్రక్కన కూర్చుంది. వెనక్కి జారగిలబడి కూర్చున్న అతని ఛాతీమీద తల ఆనించుకుంది.

ఇద్దరూ చాలాసేపు మౌనంగా వుండిపోయారు.

విక్కీకి షర్ట్ గుండీలు విడివడిన ఛాతీమీద వెచ్చగా ఏదో అనినట్టుయింది.

అతనికి అనుమానం వచ్చింది. సందేహం లేదు! ప్రియ ఏడుస్తోంది! అతను చేత్తో భార్య కళ్ళనీళ్ళు తుడిచాడు. 'ఎందుకు?' అడిగాడు.

'ఇలాటి రక్షణ, శాంతి దొరికిన నేను ఎంత అదృష్టవంతురాలినో! అనుకుంటున్నాను.'

అతను మౌనంగా, భార్య తల నిమురుతూ వుండిపోయాడు.

కొద్దిసేపయిం తర్వాత, ప్రియభుజం తటుతూ, 'లే! పద. యిక్కడ చలిగాలి వేస్తోంది. లోపలికి వెళదాం' అన్నాడు.

ప్రియ మాట్లాడలేదు.

అతనే ప్రియని లేవదీసాడు. భుజాలచుట్టూ చేయివేసి లోపలికి తీసుకు వచ్చాడు. మంచంమీద పడుకోబెట్టి, కాళ్ళదగ్గర వున్న రగ్గుతీసి నడుంవరకు కప్పాడు. తలక్రింద దిండు సరిచేసాడు. వెళ్ళి పెద్దలైటు తీసి, చిన్నలైటు వేసి వచ్చాడు.

అతను మంచంమీద పడుకున్నాడు.

ప్రియ యింకా అలాగే చూస్తుంటే, కుడిచేయి కళ్ళమీద కప్పి, 'గుడ్ గర్ల్! ఆలోచనలూ, గతాలూ, స్వగతాలూ చాలుగానీ యిక నిద్రపో' అన్నాడు. బుగ్గమీద సుతారంగా పెదవులు ఆనించి, 'గుడ్‌నైట్' అన్నాడు.

మరో పదినిముషాల్లో అతను గాఢనిద్రకి వశమైపోయినట్టు అతని వుచ్ఛ్వాసనిశ్వాసలే తెలుపుతున్నాయి!

ప్రియంవదకి నిద్ర రావటంలేదు!

పైకప్పుకేసి చూస్తూ పడుకొంది. మాటిమాటికి డెస్టిట్యూట్ హోమ్‌లో వున్న 'మధురే' కళ్ళముందు కన్పిస్తోంది. తను ఎంత పొరపాటు చేసింది! మధురని వెంటనే తను తీసుకువస్తే ఎంత బాగుండేది. వికీకి చెప్పందే ఎలా! వికీకి మధుర ఎవరో తెలియచేయకుండా, ఎలా తీసుకురావటం! ఏమిటో అంతా సడన్‌గా అయిపోయింది. మధురని ఆ స్థితిలో చూడటం తనకి ఒక 'షాక్'లా అనిపించింది. ఇంత చిన్న వయసులో, మనిషిలో అంత పెద్ద మార్పా! ఎంత భయంకరం. జీవితంలో నా అనేవాళ్ళు లేని తను, తను ఆ పరిస్థితుల్లో వుండాల్సింది. డబ్బు, తలిదండ్రులు, అన్నీవున్నా మధుర అలా అవటం ఎంత విషాదం?

ప్రియంవదకి తన భర్త, తన యిల్లు, తన పిల్లలు యీ విలువ అందరి కంటే బాగానే తెలుసు.

కానీ యీ క్షణంలో ఆ గుర్తింపు యింకా అంతయి, యింతయి, కోటి రెట్లు పెరిగినట్లుగా అనిపించసాగింది.

రేపు మధురని తన యింటికి తీసుకువస్తుంది!

డాక్టర్లకి చూపిస్తుంది! ఒకవేళ మధుర చచ్చిపోతే, తన దగ్గరే, మధురకి ప్రియమైన తన చేతుల్లోనే చచ్చిపోతుంది. అనాధగా, అనామకురాలిగా మాత్రం కానే కాదు!

ప్రియంవద పక్కకి తిరిగి, కాస్త జరిగి భర్త చాచివున్న చేయివంపులో ముఖం దాచుకుంది.

ఈ వెచ్చటి స్పర్శ, పక్కనేవున్న అతను వున్నాడు అనే ధైర్యం మనసుకి కొండంత బలం యిస్తున్నట్టుగా వుంది.

వికీ తనని పెళ్ళిచేసుకోవటం ఎంత రొమాంటిక్‌గా జరిగింది! అది ఒక తీయటి కల!

అతని తల్లికి తనంటే యిష్టంలేదు.



కనీసం మల్లెపూవంత మంచితనం; అణువంత ఆత్మగౌరవం,
ఆత్మసౌందర్యం; వీసమంత వ్యక్తిత్వం తనలో వున్నాయని విశ్వసించే
ప్రతి వ్యక్తీ తప్పక చదవ వలసిన రచనలు...
నిస్సందేహంగా తెలుగులో ఇంత నిశితంగా, నిష్కర్షగా, నిర్భయంగా

# రావి శ్రమన్నారాయణ M.A.

మాత్రమే వ్రాయగల
4 వినూత్నపంథా, సరికొత్త సాంఘిక నవలలు...

1. బకాసురుడి బ్రదర్స్! ...25 రూ.
2. బోగస్ బతుకులు .....15 రూ.
3. ఇన్‌స్పెక్టర్ ఇందిర .....15 రూ.
4. తెలుగు మోసం జిందాబాద్! 15 రూ.

నెం.1 ప్రపంచస్థాయి గెటప్ ఇవ్వబడిన పై 4 నవలలకు
రిజిస్టర్డ్ పోస్టేజి ఉచితం. 55 రూ॥ M.O. చేస్తే మొత్తం 4 నవలలు
రిజిస్టర్డ్ పోస్టుతో మీకందుతాయి. లేదా 20 రూ॥ M.O. చేస్తే,
40 రూ॥కు V.P. గా పంపబడతాయి.

**Varalakshmi Publications** PHONES: 443300 446600
11-2nd st., B.N.ROAD, T.NAGAR, MADRAS-600017.

అయినా అతను తనని పెళ్ళిచేసుకున్నాడు  పెళ్ళి అవగానే  తను  చేసిన మొదటిపని, అతని తల్లికి ఆగ్రహం తగ్గించి, ఆవిడ అభిమానం సంపాయించు కోవటం.

ఆవిడకి యిప్పుడు విక్కీకంటే తనంటేనే అభిమానం ఎక్కువ.

"మావాడు కొన్ని విషయాల్లో ఎంత వుదారంగా వుంటాడో, కొన్ని విష యాల్లో అంత మొండివాడమ్మా వాడికి కోపం రాదు. వస్తే జగమొండి! అంద రిలా కేకలేయడు! పోట్లాడడు! మాట్లాడకుండా బిగుసుకుపోతాడు! ఇక ఆ పాషాణం కరగదు! జాగ్రత్త సుమా!"

"అలాగే!" ప్రియంవద చిరునవ్వుతో అంది.

ఆవిడకి కొడుకు అంటే పంచప్రాణాలు! డబ్బు వుంది, అతని వ్యక్తి త్వానికి దీటయిన ఆడపిల్ల రాకపోతే అతని జీవితం. అతనితోపాటు తన జీవితం నరకం అవుతాయని ఆవిడ భయం.

ప్రియ ఆవిడ అత్మీయులై పోయారు.

ప్రియంవద ప్రతివిషయంలోనూ ఆవిడని సంప్రదించి ఆవిడ పెద్దరికానికి గౌరవం యిస్తుంది. తనకిష్టం అయినది, ఆవిడకి యిష్టంకానిదీ చేయాల్సివస్తే మొదట్లో ఆవిడకి నచ్చచెప్పేస్తుంది,

విక్కీ అప్పుడప్పుడూ "నా జీవితంలో బెస్టుపాయింట్‌ని నువ్వు పడగొట్టే శావు కదా, అనేవాడు.

'ఏమిటది,' అంది

'మాఅమ్మ యిష్టానికి వ్యతిరేకంగా నిన్ను చేసుకున్నాను,అని నిన్ను సాధించ టానికి వీలులేదు కదా? ఆవిడని నువు మంచి చేసుకున్నావు కదా!'

ప్రియ అతని చేయిపట్టుకుంది. "నిజం చెప్పు. మీ అమ్మగారు నా మూలంగా దూరం అయితే నీకు బాగుండేదా!'

అతను ప్రియ చేయి చెంపకి అనించుకున్నాడు.

"ఉహూ! నా జీవితంలో వీకెస్టు పాయింట్ ఏదయినా వుంటే, అది మా అమ్మే! ఆవిడని లేఖచేయనట్టు పైకి మాట్లాడతానే తప్ప, ఆవిడమనసు దేనికైనా బాధపడితే నేను భరించలేను ! ప్రియా, నీకు తెలియదు ! అమ్మ మా డాడీ చిన్నప్పుడే పోతే నా కోసమే బ్రతికిందని నాకు తెలుసు! నిన్ను 'బేబీ కేర్ సెంటర్'లో చూసిన తర్వాత, నాకే అనిపించింది. ఇలా నీనావివశత లేకుండా ప్రేమని పంచియివ్వగలిగే వ్యక్తి నాకు కావాలి. ఎందుకంటే, నా యీ జీవితం

# వనిత

స్త్రీ జన మాస పత్రిక




ఉత్తరప్రదేశ్‌లోని ఇటావా నగరంలో....
ఛోటేలాల్ జైన్ ఇంటి డ్రాయింగ్ రూంలో....
సీలింగ్ ఫాన్‌కు వేళ్లాడుతున్న మీనా శవం!
ఆమె రెండు కాళ్ళూ మగవాడి షర్టుతో కట్టివేయబడి వున్నాయి.

దూరంగా ఒక స్టూల్ పడి వుంది. కొద్ది దూరంలో ఉన్న సోఫాలో ముగ్గురు ఆడపిల్లల మృతదేహాలు, ఆ పక్కన ఒక కర్ర....ఆ కర్రతోనే ఆ ముగ్గురి కంఠాలను నొక్కి చంపినట్లు తెలుస్తున్నది.అయితే మీనాకి ఆమె పిల్లలకీ ఎందుకీగతి పట్టింది?

ఎందరో అభాగినులు....వారిలో మీనా ఒకర్తి. సుప్రసిద్ధ రచయిత్రి **వాసిరెడ్డి సీతాదేవి** జూలై '84 సంచిక నుంచి ఆరంభిస్తున్న '**వాస్తవ గాథలు**' శీర్షికలో మీనా కథ చదవండి!!



జన్మదిన సంచిక (జూలై '84) సంచికలోని ఇతర ఆకర్షణలు: వంటల పోటీలో గెలుపొందిన వంటకాలతోమరో పోటీ, పెద్ద కథల పోటీ ఫలితాలు, మొదటి బహుమతి పొందిన కథ: 'గాయత్రి' (రచన: పెదపూడి రాజ్యలక్ష్మీదేవి) ప్రారంభం. ప్రకాశంజిల్లా వివరాలు. మాటలకొలుపు బహుమతి మొత్తం పెంపు. ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి 'స్వయంసిద్ధ'తో పాటుగా మీరు మెచ్చే, మీకు నచ్చే, మరెన్నో శీర్షికలతో వెలువడుతున్న

నెలతల నెచ్చెలి

## వనిత

విడి ప్రతి: రూ. 2-50
సం॥ర చందా: రూ. 30-00

వివరాలకు:
డాల్టన్ ఏజెన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026

నా ఒక్కడిదీకాదు। నా జీవితంలో మా అమ్మ వుంది. చిన్న విషయానికి తననే సంప్రదింపులకు వచ్చే నా బంధుజనం వున్నారు। మా బాబాయి, మా పెద్ద నాన్న, పెద్దవారు. మా అత్తయ్య భర్త పోయాడు. వాళ్ళ కుటుంబాలు నా మీదనే ఆధారపడ్డాయి. ఇదిగాక, నా వ్యాపారరీత్యా సందడి, వాళ్ళుగాక నా స్నేహితులు. వాళ్ళ కుటుంబాలు ఇంతమందితో నా జీవితం అల్లుకుపోయి వుంది। వీళ్ళతో నన్ను విడదీయకుండా, వీళ్ళంతా మనవాళ్ళు అని నమ్మిన వ్యక్తికావాలి నాకు. నా స్వసుఖమే నాదీ। నా కుటుంబం నా బంధువులు, స్నేహితులు, వీళ్ళతో కలిసిపోయిన నన్ను, నా బాధ్యతలని అర్థంచేసుకునే వ్యక్తి కావాలి నాకు.

'వైవాహిక జీవితం అంటే, యింటి నాలుగు గోడలకే పరిమితం' బైట జీవితం వేరు అనుకునే వ్యక్తిత్వం కాదు నాది। నా శరీరానికి నా మనసుకి కూడా సుఖం యిచ్చే భార్య కావాలి నాకు।

ప్రియ అతని మాటలు శ్రద్ధగా వింది. అందులో ఒక్క అక్షరం కూడా మర్చిపోకుండా వుండటానికి నిర్ణయించుకుంది। ఆ తర్వాత మళ్ళీ ఎప్పుడూ అతను ఆ ప్రసక్తి తీసుకురాలేదు. ప్రియంవద అతని ఆశలకి భిన్నంగా, అతని మనసు నొప్పించేవిధంగా ఏనాడూ ప్రవర్తించలేదు. అతని బాధ్యతలని సమస్యల్ని యింటి భారం తనమీద వేసుకుని, అతనికి శ్రమ తగ్గించింది. అతని జీవితంలో తనని ఎందుకు కోరుకున్నారో, ఒక్కక్షణంకూడా మర్చిపోనట్టుగా ప్రవర్తించేది। అతని మనసుకి ఎప్పుడూ అశాంతి కలగనిచ్చేది కాదు। వ్యాపార సంబంధమయిన పని ద్వారా అతను యింటికి అన్న టైముకి రాలేకపోతే అలిగేది కాదు. 'సారీప్రియా' వస్తూనే అతను అంటుంటే,అతని నోరు మూసేది. ఇందులో చెప్పేటానికి ఏముంది: ఒక్క గంట ఆలస్యం అయితే ఏమైంది। జీవితంఅంతా కలిసి ఉండాల్సినవాళ్ళం: పరాయివాళ్ళకి టైమ్ యిచ్చినట్టు ఎంగేజ్‌మెంట్ ఫిక్స్ చేయటంలేదుకదా।" చిరునవ్వుతో అంటుంటే, అతను భార్య కళ్ళలోకి ఆ మాటలు అనడంలో నిజం ఎంతవుందా అని శోధిస్తున్నట్టు వెతికేవాడు. ప్రియంవద కళ్ళలో అతనికి నటన కనిపించేది కాదు. ప్రియ విశేషం అదే। ఏ పనిచేసినా ఏ మాట చెప్పినా, అందులో నిగూఢార్థం, నటన ఎంతమాత్రం వుండవు.

ప్రియ మరుక్షణంలో అతని బిగికౌగిలిలో బందీఅయిపోయేది.

తమ కోరుకున్ని దానికంటే, ఆశించినదానికంటే, వూహించిన దానికంటే వున్నతంగా ప్రవర్తించే ప్రియ వ్యక్తిత్వం యిలాంటి క్షణాల్లో బైటపడ్తుంటే,







LIFEBUOY
for health




అతనికి ఎనలేని సంతోషం కలిగేది. ఆ ఆనందంతో భార్యని ఉక్కిరిబిక్కిరి చేసేవాడు.

'నేను అప్పుడు అనుకోలేదు సుమా.' అనేవాడు.

వికీ అలా చిన్నపిల్లాడిలా ఎంతో సంతోషంగా మాట్లాడుతుంటే, ప్రియంవదకి చెప్పలేని ఆనందంగా వుండేది. ఆ ఆనందం జీవితంలో తనకి భగవంతుడు ప్రసాదించిన ఎనలేని కానుక అనిపించేది.

ప్రియంవదకి తన యిల్లు, తన పిల్లలు, తన అత్తగారు, తన బంధుజనం యిదే లోకం. ఈ ప్రపంచం తనకి యిచ్చిన వికీ అంటే పంచప్రాణాలు. తను ఏ పనిచేసినా, అతని ఆనందం రెట్టింపు అవాలి అన్నట్టు వుండేది. తన వలన అతని గౌరవం మరింత పెరగాలి. అతను తనని కావాలని చేసుకుని తనకి ఎంత ఆనందం, సుఖం ఇస్తున్నాడు. దానికి రెట్టింపు తననుండి అతనికి అందివ్వాలి అనుకునేది.

అలాగే గడిచాయి సంవత్సరాలు:

రత్నాల్లాంటి పిల్లలు కలిగారు. ఆ పిల్లల్ని చూస్తే యింట్లో బైట అందరికీ ముద్దే. క్రమశిక్షణ, మంచి ప్రవర్తన, మళ్ళీ వాళ్ళ తెలివితేటలు అణిచిపెట్టని స్వతంత్రం వాళ్ళకి వుంది.

వికీ-ప్రియంవదల ఆనందాన్ని, వాళ్ళు వందరెట్లు అధికంచేసారు. వారిద్దరి సంసారం ఒక స్వర్గం. అదొక సుందర స్వప్నం. దానిని వారిద్దరూ భార్యాభర్తలుగా జాగ్రత్తగా నిర్మించుకున్నారు. ఆ యిల్లు, ఆ పిల్లలు, ఆ శాంతి ఆ సుఖం ప్రియంవద-వికీల స్వయంకృషి ఫలితం. బంధువులందరిలో వారికి ఒక ప్రత్యేక గుర్తింపు. వికీ స్నేహితుల్లో అతనిపట్ల యీర్ష్య కలిగించేటంత ప్రత్యేకత. సాటి వ్యాపార భాగస్వాముల్లో 'వికీ చతురుడు' అందుకే యిటు వ్యాపారంలోనే కాదు, అటు గృహజీవితంలో కూడా విజయం సాధించాడు. అనుకునేవాళ్లు. అతని తెలివితేటలు ఏమీలేవు: అలాంటి భార్య దొరకడం అదృష్టం. అనేవాళ్ళు.

వికీ వాళ్ళ విమర్శలని, ప్రశంసలని, చిరునవ్వుతో వినేవాడు. అతనికి ఎవరు ఎలా అనుకున్నా ఫర్వాలేదు: జీవితం తృప్తిగా, తనివిదీరా అనుభవిస్తున్నట్టుగా. హాయిగా ఆనందంగా వుంది. దీనికి మూలకారణం, ప్రియంవదేనని అతనికి నమ్మకంగా తెలుసు.

• • •

దగ్గరకొచ్చి గమనించండి

# సూపర్ రిన్
# చిమ్ముతూన్న మరింత తెల్లదనం
## దీనికి సరిపడే డిటర్జంట్ బిళ్ళ మరొకటి లేదు.

సూపర్ రిన్ తెల్లదనం
మిరుమిట్లు గొల్పుతుంది :
దగ్గరగా వచ్చి చూడండిక.
ఆకర్షణీయమైన కొత్త ర్యాపర్,
మరి దాంతోబాటే తాజాదనం
చిందే సరికొత్త సువాసన!




LINTAS RIN 74 1810 TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

మన్నాడు.

ఉదయం 9 గం. వేళ.

డైనింగ్‌టేబిల్ దగ్గర విక్కీ, వరుణ్, దివ్య కూర్చుని, టిఫిన్ తింటున్నారు. విక్కీ, పిల్లల్తో కలిసి టేబిల్‌దగ్గర కూర్చుంటే, ఇక అక్కడ నవ్వుల జల్లులు కురుస్తూనే వుంటాయి! పిల్లలకి, అప్పటికప్పుడు, పిల్లిమీదనో, ఎలుకమీదనో పెట్టి, కథచెప్పేయటం విక్కీకి అభ్యాసమైన విద్య.

ఒక సోమరిపోతు ఎలుక, కష్టపడి పనిచేయకుండా వున్నందుకు, ఎన్ని తిప్పలుపడిందో చెబుతున్నాడు. రాత్రి వరుణ్ హోమ్‌వర్క్ చేయకుండా, కొత్తగా తెచ్చిన కామిక్ బుక్స్ చదువుతూ, కాలంగడిపి నిద్రపోయాడు. దివ్య అలాకాదు! తనకున్న హోమ్‌వర్క్ చేసిన తర్వాతనే, యింకేపనైనా చేస్తుంది. దివ్య తన పుస్తకాలు చక్కగా సర్దుకుంటుంది. పక్క చెదిరితే దుప్పటి వెంటనే అరిందాలా, అచ్చం తల్లి సరిచేసినట్టే సరిచేస్తుంది. పెన్సిళ్లు, రబ్బరు లాటివి పారేసుకోకుండా, జాగ్రత్తగా దాచుకుంటుంది. వరుణ్ అలా కాదు, ఎక్కడివి అక్కడ పారేస్తాడు. తనవి లేకపోతే వెంటనే దివ్యవి తీసేసుకుంటాడు! ప్రియంవద కొడుక్కి నచ్చచెబుతుంది! విక్కీ యింకోసారి యిలా చేస్తే మాట్లాడనని బెదిరిస్తాడు. తల్లి బ్రతిమలాటకంటే, తండ్రి బెదిరింపే వాడికి ఎక్కువ పనిచేస్తుంది.

ప్రియ కాఫీ తెచ్చి యిస్తూ విక్కీతో, "నేను 10 గం. కి. మదర్ థెరిసా హోమ్‌కి వెళ్తాను" అంది.

విక్కీ విని వూరుకున్నాడు.

పిల్లలు టిఫిన్ పుస్తకాల బ్యాగ్స్ తెచ్చుకోవటానికి అవతల గదిలోకి పరుగెత్తారు.

ప్రియంవద అతనికి దగ్గరగా వచ్చింది. పిల్లలు ఎదురుగా వున్నప్పుడు అతన్ని సాదారణంగా ముట్టలేదు. విక్కీ భుజంమీద చేయివేస్తూ "నేను-నేను" అని పూర్తిచేయలేనట్టు అసంపూర్తిగా ఆగిపోయింది.

"ఏమిటి ప్రియా!"

"మధురని మన యింటికి తీసుకువస్తాను. నా చేతులతో స్వయంగ నాకు చేతనైనంత సాయంచేస్తాను! ఒకవేళ తను కోలుకోలేకపోతే, యీ ఆఖరి రోజుల్లో అనాథగా, అనామకంగా కాకుండా, తన కిష్టమైన నా దగ్గర చచ్చిపోవటం నాకిష్టం."

వికీకి భార్య మనస్సు అర్థం అయింది. తనకి చదువుకోవటానికి సాయం చేసిన స్నేహితురాలిని ఆదుకోవాలి అనుకోవడంలో ఆశ్చర్యం లేదు. అతిశయోక్తి కూడకాదు. అతను తనభుజంమీద ఆనిన భార్యచేతిని అర్థంచేసుకున్నట్టుగా తట్టాడు.

అసలు వారిద్దరి మధ్యా మామూలుగా ఎక్కువ మాటలు వుండవు. ఇద్దరి మధ్యా ఒక మౌన భాష. అతని చూపులతోనే ఆమెకి అర్థం అవుతుంది: అతనికి, ఆమెగురించి అంతకంటే ఎక్కువే అవగాహన ఉంది. ఒకరికి ఒకరు అడగకుండానే ఒకరి మనసు ఒకరు ఎరిగి ప్రవర్తించటం వారిద్దకీ పెళ్ళి అయినప్పటి నుంచీ అలవాటు అయింది.

వికీ అన్నాడు. "ప్రియా. నీ స్నేహితురాలి పరిస్థితి చాలా ప్రమాదంగా వుంది. ఆ స్థితిలో వున్న మనిషిని యింట్లో వుంచుకోవడం మంచిది కాదు. ఆ ఫోన్ యిలా పట్టుకురా" అన్నాడు.

ప్రియంవద వెళ్ళి ఫోన్ తీసుకువచ్చింది

అతను నంబర్ డయల్ చేసాడు.

"హలో. కరుణా నర్సింగ్‌హోమ్."

అవతలనుంచి పలకగానే "డాక్టర్ మూర్తిని పిలవండి" అని మూర్తి రాగానేమధురని హాస్పటల్లో చేర్పించుకొనే విధంగా కోరాడు.

రెండు నిముషాలు మాట్లాడిన తర్వాత ఫోన్ పెట్టేస్తూ వికీ తలెత్తి భార్య వైపు చూసాడు. అతను ఫోన్‌లో డాక్టర్ మూర్తితో మాట్లాడుతున్నంతసేపూ ప్రియ చేయి అతని భుజంమీద అనేవుంది. ప్రియా. ఇక నువ్వు దిగులుపడకు. 1 గం. కల్లా మీ మధురని, నర్సింగ్‌హోమ్‌లో స్పెషల్ రూమ్‌లో అన్ని సౌకర్యాలతో వుండేటట్టు డాక్టర్ మూర్తి ఏర్పాటుచేస్తాడు. నేను 1 గం.కి వస్తాను మనిద్దరం కలిసి వెళ్ళి చూసివద్దాం, ఓ. కే." అన్నాడులేస్తూ.

ప్రియంవద తలవూపింది. కళ్ళు లీలగా చెమ్మగిల్లుతున్నాయి. ముఖంలో ఆనందం కన్పిస్తోంది. పిల్లలు పరుగెత్తుకు వచ్చారు.

'బై మమ్మీ.' అంటూ ప్రియంవద బుగ్గమీద ముద్దుయిచ్చి పరుగెత్తారు.

వెళ్ళిపోతున్న వికీ ఆగి వెనక్కితిరిగి చూసాడు. అక్కడ ప్రియంవద నిలబడి వుంది.

# మీ పళ్ల మీద చిగుళ్ల పట్టు సడలనివ్వకండి!



## కేవలం ఫోర్‌హేన్స్ మాత్రమే
## చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది.
## చిగుళ్లు గట్టిగా వుంటే
## పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.

అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్‌హెన్ తాను తయారు చేసిన టూత్‌పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చారు. ఇది నేరుగా చిగుళ్ల మీద పని చేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము. వాటిని బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.

ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం మరియు దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.




## ఫోర్‌హేన్స్ – ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.

339F 172 TEL

అతను వెనక్కి తిరిగి దగ్గరకి వచ్చాడు.

బుగ్గమీద ముద్దుపెట్టుకుని "బై" తగ్గు స్వరంతో అన్నాడు.

"థాంక్ యూ" అంది.

"దేనికి ?"

"మధురకి సాయం చేస్తున్నందుకు."

"నీ స్నేహితురాలు అంటే, సాయంచేయాల్సిన బాధ్యత నాది కాదా. మరి అలా కృతజ్ఞతా భారంగా వుండకమ్మా। దబాయించి నాతో పనిచేయించుకో।"

ప్రియ అతను అన్న తీరుకు పకాలున నవ్వింది.

క్రింద నుంచి 'బయ్'మని హారన్ ఆగకుండా వినిపించింది.

"వెళ్తున్నా. 1 గం.కి వస్తాను." భార్యకి చెప్పి వికీ పిల్లల దగ్గరకి పరుగెత్తాడు.

ప్రియంవద వరండాలోకి వచ్చింది.

అప్పటికే వరుణ్ హారన్ మోగిస్తున్నాడు.

తండ్రి రాకని చూసి ఆపాడు.

వికీ వెళ్ళి డ్రైవింగ్ సీట్‌లో కూర్చున్నాడు.

కారు వెళ్తుంటే, వరండాలో నిలబడివున్న ప్రియంవదకి పిల్లలిద్దరూ చేతులు వూపారు।

వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత కూడా ప్రియ ఒక్క క్షణం అలాగే నిలబడిపోయింది.

తనకి భగవంతుడు ఎంత ఆనందం, ఎంత శాంతి ప్రసాదించాడు.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press Public Garden Road, Hyderabad-500 001. Editor : A SUDHAKARA RAO

గాలిపటంతో కబురంపనా
వలపులతోకల గిరికీలు తిరగనా
రంగురంగుల ప్రేమలేఖలంపనా
ఆ ఆ ఆ -


రెండో రోజు! హాయ్.
మన గాలిసందేశం లో ఆ పాటనెంత బ్రహ్మాండంగా పిక్చరైజ్ చేశామో చూశారా! మూడు నూర్లు ఖాయం! -